అపరాధ పరిశోధన అనుబంధం—110

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఆకుపచ్చ చీర

రచన: వసుంధర

## ఎర్రగాజు

రచన: టెంపోరావ్

## నెత్తురుచిమ్మిన గుడ్డలు

రచన: సికిందర్

## హంతకు లెందరో?

రచన: బొమ్మిడి అచ్చారావు

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —110
ఫిబ్రవరి, 1983
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ పీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1

# ఆకుపచ్చ చీర

## వసుంధర

అప్పటికే కవిత అక్కడ చాలా చీరలు చూసింది. ఆమెకు ఒక్కటీ నచ్చినట్లు అనిపించలేదు. సేల్సుమన్ ఓపికగా ఆమెకు అన్నీ చూపిస్తున్నాడు. ఆమె కొనడానికే వచ్చింది తప్పితే కాలక్షేపానికి రాలేదని సేల్సుమన్‌కు తెలుసును. చాలా తరచుగా ఆమె ఆ షాపులో బట్టలు కొంటూంటుంది. ఆ నగరంలో ప్రముఖుడైన చలపతిరావు భార్య ఆమె.

"మేడమ్—కలగజేసుకుంటున్నందుకు మన్నించండి. ఆ ఆకుపచ్చ చీర మీకు ఎంతో బాగుంటుంది—" అన్న గొంతు ఒకటి కవితకు వెనుకనుంచి వినబడగా ఉలిక్కిపడి వెనక్కు తిరిగింది.

సుమారు ముప్పైఏళ్ళ యువకుడు. ఎత్తయిన విగ్రహం. ఒత్తయిన జుట్టు. కళ్ళలో మర్యాద కనబడుతోంది.

ఆమె అతణ్ని చూసి సిగ్గుపడింది. అప్రయత్నంగానే అతడు చెప్పిన ఆకుపచ్చ చీర వంక చూసింది. ఆమె

కళ్ళలోని మెరుపును కనిపెట్టి సేల్సుమన్ ఆ చీర మడతలు విప్పి చూపించాడు.

కవితకు ఆ చీర ఎంతో బాగున్నదనిపించింది. మరి తనకు ఇందాక ఎందుకు నచ్చలేదో!

ఆడదాన్ని ప్రభావితం చేయడానికి అపరిచిత యువకులు ప్రథమ సాధనాలు.

సేల్సుమన్ సమస్య తీరిపోయింది. అతడా చీరను ప్యాక్ చేయించాడు.

చీర గురించి ఆమెకు సూచించిన యువకుడామెను సమీపించి—"నా అభిరుచిని మన్నించినందుకు థాంక్స్" అన్నాడు.

"సెలక్షన్‌లో సహకరించినందుకు నేనే మీకు థాంక్స్ చెప్పుకోవాలి!" అంది కవిత.

"నేనన్నానని అంటున్నారా లేక మనస్ఫూర్తిగా థాంక్స్ చెబుతున్నారా—" అన్నాడతను.

అతడంత సూటిగా అడిగేసరికి మొహమాటపడింది కవిత—"అయ్యో—అలా ఎందుకనుకుంటున్నారు?"

"అయితే నాకు మిమ్మల్ని ఈ చీరలో చూడాలని వుంది. ఆ అవకాశం కల్పించగలరా?" అన్నాడతను.

"అంటే?" అంది కవిత తడబడుతూ.

"రేపు సాయంత్రం అశోకా పార్కులో మీకోసం యెదురు చూస్తూంటాను. ఇలా అన్నందుకు నన్నపార్థం చేసుకోకండి. నేను చాలా మర్యాదస్థుణ్ని. మీరు వివాహిత అని నాకు తెలుసు...." అని అతడు చరచరా అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

# 2

కవితకు ఆ రాత్రంతా నిద్రపట్టలేదు. "ఏమిటి అతగాడి ధైర్యం? బదులుకోసం కూడా ఎదురు చూడలేదు. తను వస్తాననే అనుకుంటున్నాడా?"

కానీ అతడు ప్రత్యేకంగా చెప్పనే చెప్పాడు.... "నేను చాలా మర్యాదస్థుణ్ని. మీరు వివాహిత అని నాకు తెలుసు...."

అతడి మాటల్లో మర్యాద ధ్వనించింది.

వివాహిత అయిన స్త్రీ తనను గౌరవించి ఆరాధించే మగవాళ్ళను అభిమానించగలదు. కానీ తన శరీరాన్ని కాంక్షించే పరాయి మగవాడున్నాడంటే ఆ భావనే ఆమెకు కంటక ప్రాయమవుతుంది.

అతడి మంచితనాన్ని గురించి ముందామె మనసుకు నచ్చచెప్పుకుంటోంది. ఎందుకంటే అతడు ఎన్నిక చేసిన ఆ చీర కట్టుకుని అతడికి కనిపించాలని ఆమెకు కోరికగానే వుంది.

ఆ చీరలో భర్త తనను చూసి—"మార్వెలస్!" అన్నాడు. తను సిగ్గుపడుతూంటే—"ఈ రోజు సిగ్గు కూడా కొత్త అందాలు సంతరించుకుంటోంది. అంతా ఆ చీర మహాత్మ్యం—" అన్నాడు.

"అంటే నా అందమేమీ లేదా?" అంది కవిత.

"బంగారంలో రాళ్ళు పొదిగితే — బంగారానికే అందం వస్తుంది. కానీ అది బంగారం కాబట్టే అందం వస్తుంది. నేను మెచ్చుకుంటున్నది ఈ చీరను కాదు. నీ అభిరుచిని. నీ ఒంటికి ఏమేమి నప్పుతాయో నీకు ఇంత బాగా ఎలా తెలుసా అన్నది నా ఆశ్చర్యం. అందమైన శరీరం వుంటే చాలదు. దాన్ని అలంకరించుకొనడంలోనే

వున్నది అభిరుచి...." అన్నాడు చలపతిరావు.

ఆ అభిరుచి తనది కాదు. ఆ యువకుడిది. అతడు తన్నీ చీరలో చూడగోరాడు. అందులో తప్పున్నదా?

వున్నా తను ఉండనివ్వదు....

మర్నాడు సాయంత్రం ఆమె పార్కుకి వెళ్ళేసరికి అతడామెకోసం ఎదురు చూస్తున్నాడు.

"మీకు మరీ మరీ థాంక్స్!" అన్నాడతను.

"ఎందుకు?"

"నా మాట మన్నించినందుకు...."

కవిత ముఖం ఎర్రనయింది...."నేను మీ మాట మన్నించి రాలేదు. ఏదో పనుండి ఇలా వచ్చాను...."

"పోనీలెండి .... పనుండే వచ్చినా నేను చెప్పిన పార్కుకి నేను చెప్పిన సమయానికి నేను చెప్పిన చీర కట్టుకుని వచ్చారు. అదృష్టం ఇంతకంటె ఎక్కువగా ఎవరినీ కరుణించగలదనుకోను...." అన్నాడతను.

కవిత మాట్లాడలేదు. తనిప్పుడేం చేయాలీ అని ఆలోచిస్తున్నదామె. అతడు తన గురించి ఏమనుకుం టున్నాడో?"

"మీకు కుతూహలం తక్కువనుకుంటాను...." అన్నాడతను.

"ఏం?" అన్నదామె అప్రయత్నంగా.

"మీకు నేను అపరిచితుణ్ని. అలాంటిది నేను మీకు సరిపడే చీర గురించి ఎలా చెప్పగలిగాను?" అన్నాడతడు.

"ఈ చీర నాకు సరిపడిందని ఎవరన్నారు? అంది కవిత.

"మీరిలా ఈ చీరతో ఇక్కడ నిలబడి వుండగా—

ఎవరైనా గుడ్డివాడిక్కడికి వచ్చాడంటే—వాడికూడా కళ్ళొస్తాయి—" అన్నాడతడు.

"అంటే?" అంది కవిత.

"అద్భుతమైన తన విశ్వరూపాన్ని సందర్శించే అవకాశమివ్వాలని పుట్టు గ్రుడ్డి అయిన ధృతరాష్ట్రుడికే కనులిచ్చాడు శ్రీకృష్ణుడు. ఇలాంటి సౌందర్యం దర్శించే భాగ్యం ఎవ్వరూ పోగొట్టుకోనరాదని ఆ సృష్టికర్తకు అనిపిస్తుంది—...."

కవిత సిగ్గుపడింది. అతడు పొగడ్తలతో తనను ముంచేస్తున్నాడు. ఎందుకు?

"మీకు కుతూహలం చాలా తక్కువ ..." మళ్ళీ అన్నాడతడు.

ఆమె చురుగ్గా అతడివంక చూసింది.

"నేను మీకీ చీరనెలా ఎన్నిక చేయగలిగానో ఆలోచించే ప్రయత్నం చేయడంలేదు మీరు...."

"చేశాను. తెలియలేదు—...." అంది కవిత.

"కుతూహలమే కాదు. జ్ఞాపకశక్తి కూడా తక్కువే మీకు...."

"అంటే?"

"ఒక్క క్షణం అలా కూర్చోండి—" అన్నాడతడు.

కవిత కూర్చుంది. ఆమెకు కాస్త దూరంగా అతడు కూర్చున్నాడు.

"ఇప్పుడు గతం గురించి ఆలోచించండి...." అన్నాడతడు.

"ఎందుకు?"

"ఈ చీరకు సంబంధించిన మీ గతంలో ఏమైనా సంఘటన ఉంటే గుర్తుకు వస్తాయి. అందుకు?"

కవిత ఆలోచనలో పడింది. ఈ యువకుడు తన వెంట బడడానికి ఏదో కారణముంది. ఇతడు తన గతం ప్రస్తక్తి తెస్తున్నాడు. ఏమిటా గతం?

ఆకుపచ్చ చీర....గతం....

తనకు వివాహమైంది....వివాహానికి ముందు....

ఉలిక్కిపడింది కవిత. అదే నా గతమంటే? అప్రయత్నంగా తలెత్తి అతడి ముఖంలోకి చూసిందామె.

అతడు నవ్వి—"మీకు శామ్యూల్ గుర్తొచ్చాడు కదూ—నేనతడి స్నేహితుణ్ని!" అన్నాడు.

కవితకు ఒక్కక్షణం నోట మాటరాలేదు. తర్వాత నెమ్మదిగా—"నాకు శామ్యూల్ గుర్తొస్తాడని మీకెలా తెలుసు?" అంది.

"చాలా తెలుసు నాకు. అయితే అన్నీ ఒక్కసారిగా చెబితే మీరు భరించలేరు. అందుకని ఒక్కొక్కటిగా చెబుతాను. ఈ రోజుకిది చాలు. మనం మళ్ళీ కలుద్దాం" అని లేచి వెళ్ళిపోయాడతడు.

## 3

కవిత యింట్లో కూర్చుని శామ్యూల్ గురించే ఆలోచిస్తోంది. ప్రస్తుతం ఆమె మనసేమీ బాగాలేదు.

శామ్యూల్ యువకుడు. అందగాడు. ఓ సినిమాహాలు వద్ద తమకు పరిచయమైంది. పరస్పరాకర్షణ బయల్దేరింది. పరిచయం ప్రేమగా మారడానికి ఎంతో కాలం పట్టలేదు. ఇద్దరూ కలిసి ప్రేమ విహారాలు చేశారు. దూరంగా వున్నప్పుడు త్తరాలు వ్రాసుకున్నారు.

తర్వాత ఈ ప్రేమ వ్యవహారం కవిత తల్లిదండ్రుల వరకూ వచ్చింది. కవిత తండ్రి మండిపడ్డాడు. ఈ పెళ్ళి జరగడానికి వీల్లేదన్నాడు. ఈ పెళ్ళి చేసుకుంటే మళ్ళీ

కవిత ముఖం చూడనన్నాడు. ఆమె అన్నింటికీ సిద్ధపడింది.

అయితే శామ్యూల్ నిరుద్యోగి. ప్రేమించుకోవడం వరకూ బాగానే వుంది. కానీ ఆ తర్వాత బ్రతకాలికదా! ఏదైనా మంచి ఉద్యోగం దొరికేవరకూ పెళ్ళిచేసుకునే ఉద్దేశ్యమతడికి లేదు. అదీగాక అతడికి చాలా ఇంటి బాధ్యతలున్నాయి. అతడికి దండిగా కట్నమిచ్చి, ఉద్యోగం కూడా వేయించడానికి ఓ ఆడపిల్ల తండ్రి సిద్ధంగా వున్నాడు. కవిత తండ్రి కూడా తనకలాగే సాయపడగలడని శామ్యూల్ ఆశించాడు.

"మన కొద్ది నెలల ప్రేమ. కానీ మనవాళ్ళది ఎన్నో సంవత్సరాల ప్రేమ. మన ప్రేమ పేరు చెప్పి మన వాళ్ళను మనం దూరంచేసుకోరాదు—...." అని తీర్మానించాడు శామ్యూల్.

కవిత అతడిని ఎంతగానో ప్రాధేయపడింది. అతడంగీకరించలేదు. ఈలోగా కవిత తండ్రి త్వరపడి చలపతిరావు సంబంధం నిశ్చయం చేశాడు.

కవితకు పెళ్ళయిపోయింది. ఆరంభంలో ఆమె అదోలా వుండేది. కానీ చలపతిరావు మంచితనం, ప్రేమాభిమానాలు క్రమంగా ఆమెను ఆకట్టుకున్నాయి. ఆమె శామ్యూల్‌ను మరిచిపోయింది.

ఇన్నాళ్ళకు మళ్ళీ తను శామ్యూల్‌ను గుర్తుచేసుకోనవలసి వచ్చింది.

శామ్యూల్‌కు ఆకుపచ్చ రంగంటే ఎంతో ఇష్టం.

"ఇదివరలో నాకారంగంటే మక్కువలేదు. నీతో కలిపి చూశాక ఆరంగంటే మోజు బయల్దేరింది—" అనేవాడు శామ్యూల్!

అతడామెకు ఏదైనా బహుమతి ఇస్తే ఏదో విధంగా ఆకుపచ్చరంగు దానితో ముడిపడి వుండేది. ఏదీ లేకపోతే ప్యాకెట్ కట్టడానికి ఆకుపచ్చరంగు రిబ్బన్ వాడేవాడు. అతడామెకు ఆకుపచ్చరంగు పెన్ను, ఆకుపచ్చ కాగితాల లెటర్ ప్యాడ్ ఇచ్చి-ఉత్తరాలు వ్రాయడానికి వాటినే ఉపయోగించుకోమని కోరాడు. అన్నింటికీ మించి ఆ రోజు....

ఆ రోజు ఇద్దరికీ అనుకోని ఏకాంతం లభించింది.

శామ్యూల్‌తో సినిమా చూసి అతడితోపాటు అతడి గదికి వెళ్ళిందామె. అలా చాలాసార్లు చేసింది గతంలో.

శామ్యూల్ ఓ గవర్నమెంటు క్వార్టర్లో వుంటున్నాడు. అది ఒక ఆఫీసరుది. ఇల్లు చాలా పెద్దది. అందుకని ఆయన అందులోని ఒక గదిని శామ్యూల్‌కి అద్దెకిచ్చాడు. అలా చేయడం నేరం. కానీ ఇలాంటి నేరాలు ఈ రోజుల్లో చాలామంది చేస్తున్నారు.

శామ్యూల్ కవితను ఆ యింట్లోని వారికి కూడా పరిచయం చేశాడు. వాళ్ళంతా స్నేహపాత్రులు. విశాల భావాలు కలవారు. కవిత రాకకు వారెటువంటి అభ్యంతరమూ చెప్పలేదు. అసలామె రాక గురించి వాళ్ళు పట్టించుకోనేలేదు. వీలున్నప్పుడు వాళ్ళూ వీరి మధ్యకు వచ్చేవారు.

అయితే ఆ రోజు ఆ యింట్లో శామ్యూల్, కవిత తప్ప ఇంకెవ్వరూ లేరు. ఇల్లంతా శ్యామూల్‌కు అప్పగించి ఇంటివారంతా ఊరికి వెళ్ళారు.

గదులన్నింటికీ తాళాలువేసి వున్నా అది శామ్యూల్ మీద అపనమ్మకంతో కాదు. ఆ తాళాలన్నీ వారతడికే ఇచ్చి రెండేసిరోజులకోసారి ఇల్లు ఊడ్పించమని చెప్పారు.

ఆ రోజు శామ్యూల్ తాళాలన్నీ తీసి కవితకు గదులన్నీ చూపిస్తూ ఆఖరున పడకగదికి తీసుకుని వెళ్ళాడు.

ఆ గది ఎంతో బాగున్నది. గదిలో దగ్గరగా జేర్చబడిన రెండు మంచాలు, వాటిమీద ఫోం బెడ్లు-మంచానికి దగ్గర్లోనే డ్రస్సింగ్ టేబుల్—ఆ టేబుల్ కు అందమైన నిలువెత్తు అద్దం .... గోడలకు శృంగారాత్మకమైన పెయింట్స్....

కవిత ఆ బొమ్మలను చూస్తూ పదిమంది తిరిగే ఇంట్లో అలాంటి బొమ్మలనెలా వుంచారా అని ఆలోచిస్తోంది. తమ యింట్లో పడక గది చాలా సింపుల్ గా వుంటుంది. ఆ గదిలోనూ మంచాలున్నాయి. డ్రెస్సింగు టేబులు వుంది. అయితే పడుకు నేందుకు మంచాలవసరం కాబట్టి మంచాలున్నాయనీ, ముఖం చూసుకు నేందుకు అద్దం అవసరం కాబట్టి అది వున్నదనీ అనిపిస్తుంది తప్పితే వాటి ప్రత్యేకత కనిపించదు.

ఈ గదిలో అలాకాదు. ప్రేయసీప్రియులు తమకోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసుకున్న ప్రేమ మందిరంలా వున్నదది.

కానీ ఆ ఆఫీసరుకు వయసు నలభై అయినా వుంటుంది. ఆదడి భార్య ముప్పయ్యో పడిలో వుంది. ఇంట్లో ఎదిగిన పిల్లలున్నారు.

శామ్యూల్ ఆమె ఆలోచనలను చదివినట్లే వున్నాడు.

"ఈ గది పూర్తిగా భార్యాభర్తలది. పిల్లలకిందులో ప్రవేశం నిషిద్ధం. ఆఫీసరుగారు క్రమశిక్షణ విషయంలో చాలా ఖచ్చితంగా వుంటాడు. అయినా పిల్లలక్కూడా ఒక్కసారి చెబితే చాలు...."

ఆ బొమ్మలు తను చూస్తున్నట్లు అతడు గ్రహించాడని

తెలియగానే కవిత సిగ్గుపడింది.

"సిగ్గెందుకు?" అన్నాడు శామ్యూల్.

"సిగ్గు కాదా మరి!" అంది కవిత.

శామ్యూల్ నవ్వుతూ—"రేపు నాకుద్యోగం వచ్చాక మన పెళ్ళి అయినాక—మన పడకగదిని ఇలాగే అలంకరించుకోవాలని వుంది నాకు. నీ అభ్యంతర మేమీ వుండదని ఆశిస్తాను—" అన్నాడు.

"ఛీ!" అంది కవిత.

"సరదాగా ఒక్క క్షణం మనమిద్దరమూ ఆ మంచం మీద కూర్చుందామా—" అన్నాడు శామ్యూల్.

"ఎందుకు?"

"జంటగా మంచంమీద కూర్చుని — మంచంమీద మన జంట ఎలా ఉంటుందో అద్దంలో చూసుకోవాలని వుంది—" అన్నాడు శామ్యూల్.

అతడలా అనగానే అదే కోరిక ఆమెలోనూ పుట్టింది. అయితే స్త్రీ సహజమైన అభ్యంతరాన్ని తెలియజేసి నాకనే ఆమె అతడి కోరిక తీర్చింది.

ఇద్దరూ మంచంమీద కూర్చున్నారు. ఒకరి పక్కన ఒకరు. ఎదురుగా అద్దంలో ఒకరి పక్కన ఒకరు.

అప్రయత్నంగా శామ్యూల్ అన్నాడు—"మన జంట ఎంత బాగుంది?"

కవితకూ అదే అనిపించింది. తమ వివాహం త్వరగా జరిగిపోతే బాగుండునని ఆ క్షణంలో ఆమెకు అనిపించింది.

"అయితే జంటగా మనలో కొన్ని లోపాలున్నాయి" అన్నాడు శామ్యూల్.

"ఏమిటి?" అంది కవిత.

"జంటకుండవలసిన చనువు మనలో కనిపించడం

లేదు— ...."

"అంటే?"

"మనమిలా కూర్చుంటే ఇద్దరన్నా చెల్లెళ్ళు కూర్చున్నట్లుంది తప్పితే భార్యాభర్తలు కూర్చున్నట్లులేదు... "

"భార్యాభర్తలెలా కూర్చుంటారో నీకు తెలుసా?" చిలిపిగా అడిగింది కవిత. ఒక్కోసారి ఆడవాళ్ళు ఎంత అమాయకత్వం ప్రదర్శిస్తారంటే అదే వారి పతనానికి దారి తీస్తూంటుంది. తన ప్రశ్నలోని చిలిపితనం కవితకు తెలియలేదు.

శామ్యూల్ ఆమెకు దగ్గరగా జరిగి — భుజంమీద చేయివేసి—ఆమెను దగ్గరగా తనవైపు అదుముకుంటూ— "ఇలా?" అన్నాడు.

అప్పటికి కవితకు తన పొరపాటు అర్ధమయింది. అయితే ఆమెకు అతడికి దూరంగా జరగాలని కానీ— తన భుజంమీదనుంచి అతడి చేతిని తీసివేయాలనిగానీ అనిపించలేదు. ఆ దగ్గరతనమూ, అతడి స్పర్శా ఆమెకు ఏదో తెలియని కొత్త హాయినిస్తున్నాయి. అలాగే వుండి పోవాలనిపించిందామెకు.

అటువంటి సమయంలో మగవాడు కోరుకునేదదే. ఆడది మాట్లాడకుండా ఊరుకోవడం అతడికి వరం! శామ్యూల్ ఆ వరాన్ని వృధా చేయదల్చుకోలేదు. కాస్సేపట్లో ఇద్దరూ మరి కాస్త దగ్గరయ్యారు. అద్దం సంగతి ఇద్దరూ మరిచిపోయారు.

కొద్ది క్షణాల్లోనే ఆ చనువు మరింత పెరిగింది. శామ్యూల్ చొరవ చేస్తూంటే కవిత కాదనలేకపోతోంది. ఆ ఆశక్తత ఆమె వంటిమీదనుంచి చీరను తొలగించింది.

కవిత ఒకరకమైన సందిగ్ధావస్థలో పడింది. ఆమెకు

మనసులో భయంగా వున్నది. శరీరం మనసుకు ఎదురు తిరుగుతున్నది. అవునంటే తనకు అన్యాయం జరిగిపోతుందని భయం. కాదంటే అతడు తనను వదిలిపెడతాడని భయం. అతడి చనువు ఆమెకు బాగున్నది.

శామ్యూల్ మంచితనం, మర్యాద ఆమెకు తెలుసు. తన ప్రోత్సాహంలేనిదే అకడొక్క అడుగు కూడా ముందుకు వేయడు. వేయలేదు.

ఇక ముందు ఏం జరిగినా ఆ తప్పుకతడిని బాధ్యుడిని చేయలేదు. పూర్తి బాధ్యత తనదే అవుతుంది.

అతణ్ని వారించాలా, కూడదా?

కవిత ఆలోచిస్తూనే వున్నది. వున్నట్లుండి శామ్యూల్ ఆమెకు దూరంగా జరిగాడు—"నన్ను మన్నించు కవితా-చీర కట్టుకో!"

కవిత ఉలిక్కిపడింది. ఆ ఉలికిపాటులో నిరాశ కూడా వుంది.

కవిత మనసు ఆమె శరీరానికి అనుగుణంగా మారిపోతోంది. తానతడిని ప్రోత్సహించకపోయినా ప్రతిఘటించ రాదని ఆమె నిర్ణయించుకుంది. అయితే తనకుతానై విరమించుకున్నాడు. ఏం జరిగింది?

"నావల్ల చాలా పెద్ద పొరపాటు జరుగవలసింది. సమయానికి నా కళ్ళు తెరుచుకున్నాయి...." అన్నాడు శామ్యూల్.

కవిత చటుక్కున చీర కట్టుకుంది.

"ఛీ—నువ్వెంత సిగ్గుమాలినదానివి—మగవాడికున్న పాటిముందు ఆలోచన నీకు లేకపోయింది—" అని మనసామెను తూలనాడింది.

అతడిలో ఆ క్షణంలో వచ్చిన మార్పు ఎందుకో

తెలుసుకోవాలని ఆమెకు అనిపించింది. కానీ ఎలా అడుగుతుంది?

ఇద్దరూ అక్కణ్ణించి బయటపడ్డారు.

ఆ తర్వాత నాలుగు రోజులు ఇద్దరూ కలుసుకోడానికి ప్రయత్నించలేదు. ఆవేశంలో మనిషి ఏమేమో చేయాలనుకుంటాడు. ఆవేశం తొలగిపోయాక తాము చేయాలనుకున్నదానికి సిగ్గు, ఆశ్చర్యం కలుగుతాయి.

నాలుగు రోజుల తర్వాత శామ్యూల్ పార్కులో కలుసుకున్నాడు కవితను. ఆమెకు బహుమతిగా ఓ చిన్న ప్యాకెట్ తెచ్చాడు.

"నాకు ఉద్యోగం లేదు. అది వెతుక్కుంటూ ఈ ఊరొచ్చే నువ్వు దొరికావు. నీకోసమైనా త్వరగా ఉద్యోగం సంపాదించాలని వుంది. అది సాధ్యపడుతుందనే ఆశిస్తున్నాను. ప్రస్తుతం నేను చిల్లర పనులు చేసి డబ్బు సంపాదించి రోజులు గడుపుతున్నాను. నా ఆదాయం అంతంతమాత్రం. అందువల్ల నేను పేదవాడిని. నా బహుమతి నా అంతస్తుకు తగినట్లుగానే వుంటుంది. కానీ దాన్ని నువ్వు నిరాదరణ చేయవద్దు. అంతస్తు ఎదిగాక నే మంచి బహుమతి ఈయవచ్చునుకదా—ఇంతలో తొందరపడి ఏమిచ్చిందని అనుకోవద్దు. ఇది నీకు ఇవ్వడానికి ఓ పెద్ద కారణముంది. ముందు నేను నీకేమిచ్చానో చూడు—" అన్నాడు శామ్యూల్.

కవిత ఆత్రుతగా ప్యాకెట్ విప్పింది. అది.... ఆకుపచ్చరంగు చేనేత చీర! డిజైన్ ఎంతో బాగుంది. ఖరీదెంతో వుండదు. ఆపైన రిబ్బెట్లో కొన్నట్లున్నాడు.

"ఇది నాకు ఎంతో విలువైనది!" అన్నది కవిత చటుక్కున ఆ చీరను గుండెలకు హత్తుకుని.

"అవును నిజంగానే అది నీకు విలువైనది. అందుకే నేనది నీకోసం కొన్నాను. నీ శీలానికది రక్షాకవచంగా కూడా వుంటుంది—" అన్నాడు శామ్యూల్ ఆమె వంకే పరీక్షగా చూస్తూ.

"అంటే?" అన్నది కవిత అర్థంకాక.

"నాలుగురోజుల క్రితం మనమిద్దరం ఓ గదిలో ఉన్నప్పుడు—నీ వంటిమీద చీర లేనప్పుడు—నీ వంటిమీద వున్న లంగా రంగు ఆకుపచ్చ. నాలో ఆవేశం పెల్లుబుకుతున్నప్పటికీ ఆకు పచ్చరంగును నీ శరీరాన్నుంచి దూరం చేయాలన్న ఆలోచనే నాకు భయంకరంగా తోచింది. అప్పుడే నాలో వివేకం తలెత్తింది...." అన్నాడు శామ్యూల్.

కవితకు గుర్తువస్తోంది. సాధారణంగా బయటకు వెళ్ళేటప్పుడు తను అన్నీ మ్యాచింగు బట్టలే కడుతుంది. ఆ రోజు తను ఎర్రచీర కట్టుకుంది. ఎర్ర లంగా చాకలివద్ద వుండిపోయింది. అందుకని ఆకుపచ్చ లంగా వేసుకుంది. కానీ అదే ఆ రోజు తన శీలాన్ని కాపాడిందంటే—అందులోనూ తనుకూడా మానసికంగా, మనస్ఫూర్తిగా శీలాన్ని పోగొట్టుకోవడానికి సిధ్ధపడినప్పుడు కాపాడిందంటే అది చాలా పెద్ద విశేషమే!

ఆ చీర కవితవద్ద ఇంకా వున్నది. దాన్నామె భద్రంగా దాచుకున్నది.

కవిత వెళ్ళి బీరువా తలుపు తెరిచింది. మూలగావున్న ఆ చీర తీసింది. ఆ చీరను చూస్తూనే ఆమె ఉలిక్కిపడింది.

అదామె కొన్న కొత్త చీరవలెనే వున్నది. డిజైన్లో మాత్రం చిన్న చిన్న తేడాలున్నాయి.

తన కోసమని కొన్న ఆ చీర డిజైన్ శామ్యూల్కు

ఇంకా అంత బాగా గుర్తున్నదా? అతడే ఉద్దేశ్యంతో తన స్నేహితుడని పంపాడు? ఇప్పుడేం జరుగుతుంది? శామ్యూల్ తనకు తానై తనను కలుసుకోకుండా తన స్నేహితుడినెందుకు పంపాడు?

అసలు శామ్యూల్ ఇప్పుడెక్కడున్నాడు? ఏం చేస్తున్నాడు?

## 4

"శామ్యూల్ గురించి ఆలోచించకండి—" అన్నాడతను.

కవిత ఫోన్‌లోకి చూసింది. దూరాన వున్న ఆ మనిషిని చూస్తున్నట్లుగానే వున్నదామె ముఖం—"మరి ఎవరి గురించి ఆలోచించమంటారు?"

"నా గురించి—...."

"మీ గురించా—ఎందుకు?"

"శామ్యూల్‌కు మీరు ప్రేమలేఖలు వ్రాశారు. అవి నా దగ్గరున్నాయి. శామ్యూల్ మీకు వ్రాసిన ప్రేమలేఖల్ని ఆతడి ముఖాన కొట్టారు. అవీ నా దగ్గరున్నాయి. శామ్యూల్ మీతో పంచుకున్న అనుభవాల్ని డైరీలో వ్రాసుకున్నాడు. అవి నా దగ్గరున్నాయి. శామ్యూల్‌ని మీరెంతగా కాంక్షించినదీ మీరు డైరీలో వ్రాసుకున్నారు. అవీ నా దగ్గరున్నాయి. మీ గురించిన వివరాలు ఇన్ని నా దగ్గరుంచుకుంటే మీరు నా గురించి ఎందుకు ఆలోచించాలనడం హాస్యాస్పదంగా లేదూ!" అన్నాడతను.

కవిత శరీరంలో వణుకు పుట్టుకొచ్చింది. అతడు చెప్పేదంతా నిజమా? తను బ్లాక్ మెయిలింగు వ్యవహారంలో

ఇరుక్కోబోతుందా?

"వీటి ఖరీదు లక్షరూపాయలు. అన్నీ ఒరిజనల్సు. మీ భర్తకు చేరకుండా అన్నీ మీ కే అప్పగించేస్తాను.." మళ్ళీ అన్నాడతను.

"లక్ష రూపాయాలా" ఆమె నోరు తెరిచింది అప్రయత్నంగా.

"లక్ష రూపాయలని ఒక్కసారి వినడంవల్ల మీకది చాలా పెద్ద మొత్తంలా అగుపించవచ్చు. కానీ సులభవాయిదాల పద్ధతి ఒకటున్నది. నెలకు రెండువేలు చొప్పున యాభై నెలలకు ఇమ్మన్నాననుకోండి — అప్పుడాలోచించి చూడండి — నేనడిగింది — ఎంత చిన్న మొత్తమో!" అన్నాడతను.

నెలకు రెండువేలు! తన భర్త తనకు నెలకు రెండు వేలిస్తాడు—నీ సరదాలకు ఖర్చు చేసుకొమ్మని. యాభై నెలలపాటు ఆ రెండువేలనూ ఇతగాడికివ్వాలా? ఆ రెండువేలూ తనేం చేస్తున్నదీ భర్తకు చెప్పవలసిన బాధ్యత కూడా తనకున్నది. తన బాధ్యత తను నిర్వహించకపోతే ఏదో ఓ రోజున రహస్యం బయటపడవచ్చును. అప్పుడు భర్త తనను అసహ్యించుకుంటాడు.

"హలో....హలో...." అన్నాడతను.

"ఊఁ" అన్నదామె.

"మీరేమీ మాట్లాడడంలేదు...."

"ఏం మాట్లాడాలో తెలియడంలేదు...."

"నెలకు రెండువేలు నాకివ్వలేరా?"

"ఇవ్వగలను..."

"అయితే ఊఁ అనండి...."

"నాకు కొంత వ్యవధి కావాలి...."

"ఎందుకు?"

"నా భర్తనుంచి రహస్యాలు దాచడం నాకిష్ట ముండదు. మీ కారణంగా ఇప్పుడాపని చేయవలసి వస్తోంది...."

ఫోన్‌లో అవతల నవ్వు వినిపించింది—"మీరు మీ భర్తకు శామ్యూల్ విషయం చెప్పారా?"

"లేదు...." అందామె విసుగ్గా.

"విసుక్కోకండి. మీరు మీ భర్తనుంచి రహస్యాలు దాచే అలవాటు లేదన్నారుగా—అందుకని అనుమానం వచ్చింది...." గొంతులో వెటకారం ఉంది.

అవును—శామ్యూల్ విషయం తను భర్తకు ఎందుకు చెప్పలేదు? తను చేసిన దాంట్లో తప్పేముంది? వయసు ప్రభావంతో ఓ యువకుణ్ని ప్రేమించింది. అతడిని పెళ్ళి చేసుకోవాలనుకుంది. కానీ అది సాధ్యపడలేదు.

ఇప్పుడు....

ఆ విషయం భర్తకు తెలియబరుస్తానని ఒకడు బెదిరిస్తున్నాడు.

నిజానికి తాను శారీరకంగా ఏ తప్పూ చేయలేదు. చేసిందనడానికి ఆధారమూ లేదు. కానీ వివాహానికి పూర్వం ఓ పురుషుడికి తానంత దగ్గరగా వెళ్ళిందంటే తన భర్త సహిస్తాడా?

"నాకు వ్యవధి కావాలి...." మళ్ళీ అంది కవిత.

"సరే—యిస్తున్నాను. కానీ ఇరవై నాలుగు గంటలు మాత్రమే! ఆ తర్వాత నేను మీనుంచి ఇంకేమీ వినదల్చుకోలేదు. రెండువేలు పుచ్చుకోవటం ఒక్కటే నేను చేయబోయేది...." ఆవతల ఫోన్ క్లిక్‌మంది.

కవిత రిసీవర్ని క్రెడిల్ చేసింది. చరచరా వెళ్ళి మళ్ళీ

బీరువా తలుపులు తీసింది. అందులోని లాకర్లో వున్నాయి తన డైరీలు.

కవిత లాకర్ తలుపులు తెరిచింది. ఆత్రుతగా వెతికింది.

ఒకే ఒక్క డైరీలేదు .... అందులోనే ఉన్నాయి తను శామ్యూల్ కలిపి గడిపిన ప్రేమ వివరాలు....

తను తప్పుచేయలేదు. కానీ భర్త నమ్ముతాడా?

అసలీ డైరీ ఎలా సంగ్రహించబడింది? ఆ లాకరు తాళాలను తానెంతో భద్రంగా దాచుకుంటుంది?

ఆలోచిస్తూంటే కవితకు గుర్తుకు వస్తోంది.

ఆ పని శామ్యూల్ చేశాడు. నిస్సందేహంగా శామ్యూల్ చేశాడు.

అయితే శామ్యూల్ తను చేసిన తప్పుకు విచారించలేదు. బాహాటింగా ఆ పని చేశాడు.

వివాహమైనాక తానింకా పుట్టింట్లో వుండగానే అతడు వ్రాసిన ఉత్తరం ఆమెకింకా గుర్తున్నది. అదింకా ఇప్పటికీ ఆమెవద్దనే వున్నది.

"నీతో పరిచయం నాకెంతో విలువైనది. నా అసమర్థతతో నేనది పోగొట్టుకున్నాను. అందువల్ల నిన్ను దేనికీ తప్పుపట్టను. అయితే నీతోటి అనుభవాలన్నీ నా డైరీలో పదిలంగా దాచుకున్నాను. నీ స్వదస్తూరీతో నీ డైరీలో మన గురించి వ్రాసుకున్న అనుభవాలు కూడా నా వద్దనే వుండాలన్నది నా కోరిక. ఆ కోరిక ఎప్పటికైనా ఎలాగో అలాగ తీర్చుకుంటాను. నీకు నామీద జాలివుంటే ఆ ఒక్క డైరీ నాకు పంపించు...."

తానా ఉత్తరాన్ని చింపిపారేసింది. ఆ డైరీని అతడికి పంపకూడదనే నిశ్చయించుకుంది.

ఉత్తరం వ్రాసిన వారం రోజులకు శామ్యూల్

వచ్చాడు.

"పెళ్ళయిపోయాక కూడా నా వెంటబడతావేం?" అంది తాను.

"నేను నీ వెంటబడను. నీ జ్ఞాపకాలు మిగుల్చుకుని నిన్ను మరిచిపోవాలనుకుంటున్నాను...." అన్నాడు శామ్యూల్.

"ఆ డైరీ నీకివ్వను...." అంది తను.

"ఒక్కసారి చూడనీ...." అన్నాడతడు.

కాసేపటికి జాలిపడి తానతడికి డైరీ చూపించింది. అతడు డైరీ చదువుతున్నప్పుడు తానక్కడలేదు. తను తిరిగి వచ్చేసరికి అతడక్కడలేడు. డైరీ మాత్రం ఉన్నదక్కడ.

సిమెంటు రంగు కవరు చూసి అది తన డైరీయేనని భ్రమపడింది. కానీ అది తనదికాదు.

శామ్యూల్ తెలివిగా డైరీ మార్చి వెళ్ళిపోయాడు. అప్పుడు తను పరీక్షించి చూడనైనా లేదు. అలాంటి అనుమానం తనకు రాలేదు.

ఆ డైరీలోని కొన్ని అనుభవాల్ని ఇద్దరూ చాలాసార్లు కలిసి చదువుకున్నారు. అతడి డైరీ తనకూ, తన డైరీ అతడికీ కవరు పేజీ రంగుతోసహా గుర్తుండి పోయాయి. అందువల్ల అతడికి తన డైరీ బాగా తెలుసు. అలాంటిదే మరొకటి ముందుగా కూడా తెచ్చుకుని ఆ మార్పిడిచేసి వుంటాడు.

తనకు వివాహం నిశ్చయం కాగానే ఆ డైరీని కొనసాగించకుండా వేరే మరో డైరీని ప్రారంభించింది. అందువల్ల మళ్ళీ ఆ డైరీలోకి చూసే అవకాశం కూడా రాలేదు.

ఇప్పుడు తన డైరీలో సిమెంట్ రంగు డైరీ ఒకటి ఎక్స్ట్రాగా వున్నది. కానీ అది తన డైరీ కాదు.

శామ్యూల్ ఎంత పని చేశాడు?

చివరికిప్పుడు బ్లాక్ మెయిలింగుకి దిగాడు!

అతడికి మొదట్నుంచీ ఇదే ఉద్దేశ్యమున్నదా? లేక పరిసితుల ప్రభావంవల్ల ఇలా మారాడా?

అతడికి తానంటే ఎంతో అభిమానం. తన మనసు కష్టపడే పని ఒక్కటి చేసేవాడు కాదు. మాట అనేవాడు కాదు.

శామ్యూల్ కి ఎంతో సంస్కారం కూడా వుంది! అతడి కారణంగానే తన శీలం కాపాడబడింది.... ఈ సమాజంలో ఆడది, మగాడు ఏకాంతంగా వున్నప్పుడు... ఒక మగాడు ఆడదాన్ని తొందరపడకుండా ఆపడం సామాన్య విశేషం కాదు.

అలాంటి శామ్యూల్ ఈ రోజు బ్లాక్ మెయిలింగ్ కి దిగాడా?

ఆలోచిస్తూండగానే ఆ రోజు గడిచిపోయింది. రాత్రి అయిపోయింది.

ఇరవై నాలుగు గంటలు గడువిచ్చాడు శామ్యూల్ స్నేహితుడు.

పన్నెండు గంటలు అప్పుడే అయిపోయాయి.

కవిత భర్త కోసం ఎదురు చూస్తోంది. ఎదురుచూస్తూనే అతడు వస్తాడేమోనని భయపడుతోంది.

చలపతిరావు తనను ప్రాణంకంటె మిన్నగా ప్రేమిస్తున్నాడు. అలాంటి అతడినుంచి తనీ రహస్యం ఎందుకు దాచాలి? అందులోనూ తనేమీ తప్పు చేయలేదు కూడా!

కానీ..అతడు ఎన్నడూ తనను ప్రాణంకంటె మిన్నగా

ప్రేమిస్తూనే వుండాలని తనకున్నది. అందుకే రహస్యం దాచాలనుకుంటున్నది.

అప్పుడు .... నెలకు .... రెండు వేలు .... అదీ భర్తకు తెలియకుండా ....

## 5

చలపతిరావు ఇంట్లో అడుగు పెడుతూనే నీరసంగా నవ్వాడు. తన బాధలో మునిగి వున్న కవిత ముందా విషయం గమనించలేదు.

"నీ భోజనం అయిందా?" అన్నాడతడు నీరసంగా.

"మీకోసం చూస్తున్నాను ..." అంది కవిత.

"నేను అనుకోకుండా బయట భోంచేసి రావలసి వచ్చింది...."

కవిత అదోలా నవ్వింది.

"నువ్వు భోంచేయి కవితా ...."

"లేదండీ—నాకాకలిలేదు...." అంది కవిత.

"కోపం వచ్చిందా?" అన్నాడతడు నీరసంగానే.

"లేదండీ—నిజంగానే ఆకలిగాలేదు. మీరు వచ్చినా మీకు భోజనంపెట్టి నేను సాయం కూర్చుందామనుకున్నాను...." అంది కవిత.

"అందుకే నువ్వంటే నాకెంతో యిష్టం. ఈ యింట్లో అన్నింటికీ నాకర్లున్నారు. కానీ మనిద్దరి మధ్యా ఎవ్వరినీ వుండనివ్వవు నువ్వు...." అన్నాడు చలపతిరావు.

"అవునండీ — మనిద్దరిమధ్యా యెవ్వరూ వుండడం నాకిష్టముండదు...."

చలపతిరావు ఇంకా నీరసంగానే—"కవితా—నీ ఇష్ట ప్రకారమే ఎల్లకాలమూ జరగాలని ఆ భగవంతుణ్ని ప్రార్థిద్దాం—" అన్నాడు.

"కవిత ఉలిక్కిపడి—"ఎందుకు?" అన్నది.

"ఏమో—ఈ అదృష్టం ఎల్లకాలమూ మనకుండ దేమోనని నాకు భయంగా వుంది—" అన్నాడు చలపతి రావు.

"ఏమయిందండీ...."

"కవితా — నేను కొన్ని చిక్కుల్లో పడ్డాను. ఈ నెలకు నీకు రెండు వేలూ ఇవ్వలేను. అయితే వచ్చే నెలలో మొత్తం నాలుగు వేలూ ఇచ్చుకోగలను...." అన్నాడు చలపతిరావు నీరసంగా.

"ఏమిటండీ—అలా నీరసంగా మాట్లాడుతున్నారు!" అంది కవిత. అయితే అతడన్న మాటలకామెలో కలవరం ప్రారంభమైంది.

భర్త ఇచ్చిన డబ్బుతో ప్రతినెలా ఆమె ఎంతో కొంత బంగారం కొంటూనే వున్నది. డబ్బును డబ్బుగా కాక బంగారంగా మార్చుకోనడం శ్రేయస్కరమని ఆమె అభిప్రాయం.

భర్త డబ్బివ్వకపోతే బ్లాక్ మెయిలర్ కివ్వడానికి తన వద్ద డబ్బుండదు. బంగారం అమ్మాలి....తనేంచేసినా భర్తకు తెలిసిపోతుంది. భర్తకు తెలియకుండా తాను ఖర్చుచేయగలిగింది ఆ రెండువేలూమాత్రమే! తానెక్కడికి వెళ్ళినా—అందరూ భర్తకు పరిచయస్థులే! ఇంట్లో వున్న బంగారం గురించి భర్తకు తెలుసు. తన వంటిమీద బంగారంకాక మిగతా బంగారం కొంత బ్యాంకు లాకర్లోనూ, కొంత ఇంట్లో లాకర్లోనూ వున్నది. రెండు తాళంచెవులూ భర్తవద్దనే వుంటాయి.

బ్లాక్ మెయిలర్ తనకెంతో గడువివ్వలేదు.

"నాకు వంట్లో బాగాలేదు. మనసు కూడా బాగున్నట్లు

లేదు...." అన్నాడు చలపతిరావు నీరసంగా.

కవిత స్వయంగా భర్తను పడక గదిలోకి చేయి పట్టుకొని తీసుకొని వెళ్ళింది. గదిలోకి చేరుకోగానే చలపతిరావు ఆమె చేయి విడిపించుకొని చటుక్కున తలుపులు మూశాడు.

"ఏమయిందండీ—...." అంది కవిత.

"నువ్వు నా చేయి పట్టుకోగానే నా నీరసం ఎగిరి పోయింది...." చిలిపిగా నవ్వుతూ అన్నాడు చలపతి రావు.

"ఊహూ...."

"ఈ ఆకుపచ్చ చీరలో నువ్వు నన్ను రెచ్చగొడు తున్నావు. నాలో ఉద్రేకం రేగుతోంది—" అన్నాడు చలపతిరావు మళ్ళీ.

కొద్ది క్షణాల్లో ఆమె వంటిమీద ఆకుపచ్చ చీర లేదు.

కవిత భర్త చేష్టలకు పరవశించటంలేదు. ఆమెకు శామ్యూల్ గుర్తుకు వస్తున్నాడు. ఆకుపచ్చ రంగును తన వంటినుంచి వేరుచేయడం ఇష్టంలేక అతడు తననే వదులు కున్నాడు. అతడి సౌందర్యారాధన అటువంటిది.

అసలైన ప్రేమ అదేనా?

భర్తకు తనపైన ఉన్నది కామం. కానీ శామ్యూల్ తనని ప్రేమించాడు. అయితే ఆ ప్రేమకు చివరికలా పరి శీలించింది? తన ప్రియురాలినుంచి ప్రతినెలా రెండువేల రూపాయలాశించే స్థాయికి శామ్యూల్ దిగిపోయాడు.

రాత్రి పన్నెండు గంటలవరకూ చలపతిరావు ఆమెను మురిపించి అప్పుడు మళ్ళీ మరోసారి నిట్టూర్చాడు.

"ఏమయిందండీ?" అంది కవిత.

"ఈ రోజు జరుగకూడని విశేషం జరిగిపోయింది...."

"ఏమిటండీ అది!"

"నీకు లక్ష్మి తెలియదు కదూ—...."

"తెలియదు...."

"ఆమె వెంకటేశ్వర్లు భార్య...."

"వెంకటేశ్వర్లూ నాకు తెలియదు...."

"ఆయన ఊళ్ళో చాలా పేరున్నవాడు. నాకు ముఖ పరిచయం వుంది. ఆ భార్యాభర్తల ఆదర్శ దాంపత్యం గురించి ఊళ్ళో పెద్ద విశేషంగా చెప్పుకుంటారు. మన గురించి కూడా అంతా అలా చెప్పుకోవాలని నాకుంటుం దనుకో. కానీ మన గురించి బైటవాళ్ళకు తెలియదు. వాళ్ళు బయట కూడా తమ ఆదర్శ దాంపత్యాన్ని ప్రదర్శించేవారు. ఈ రోజు వాళ్ళు విడిపోయారు—...."

"విడిపోయారా?"

"అవును. అందుకు కారణం తెలుసా నీకు?"

"నాకెలా తెలుస్తుంది?"

"పోనీ ఊహించగలవా?"

కవిత ఊహించడానికి కూడా ప్రయత్నించలేదు. అలా ప్రయత్నిస్తూంటే ఆమెకు శామ్యూల్ గుర్తుకు వస్తున్నాడు.

చలపతిరావు చెప్పాడు — "కొద్ది నెలల క్రితం ఆయన ఆఫీసులో తన లేడీ సెక్రటరీ చేయిపట్టుకుని దగ్గరకు లాక్కున్నాడని ఆమె అంటుంది—"

"అయితే?"

"ఆ ఒక్క సంఘటన వారి మధ్యన వున్న అన్నేళ్ళ అవగాహననూ జయించింది. ఆ రోజునుంచీ వారిమధ్య గొడవ ప్రారంభమైంది. ఇద్దరూ కోర్టుకెక్కారు విడాకుల కోసం. అయితే నిజంగా విడాకులు పుచ్చుకుంటారని

నేననుకోలేదు. రెండు వారాల క్రితం తెలిసింది—వాళ్ళు విడాకులు పుచ్చుకోబోతున్నారని...."

కవిత ఆశ్చర్యంగా—"వారిమధ్య ఇంకా ఏమైనా జరిగివుంటుంది...." అంది.

"అలా ఎందుకనుకుంటున్నావు?" అన్నాడు చలపతిరావు.

"భార్యాభర్తల అనుబంధం తెగిపోవడానికి మరీ అంత చిన్న సంఘటన కారణమా?" అంది కవిత.

"జీవితమంతా ఒకరికోసం ఒకరు బ్రతకాలంటుంది లక్ష్మి. ఎప్పుడైనా మనిషన్నాక బలహీనక్షణాల్లో మనసు చలిస్తే భార్యాభర్తలు పరస్పరం క్షమించుకోగలగాలంటాడు వెంకటేశ్వర్లు. నువ్వేమంటావ్?" అన్నాడు చలపతిరావు.

కవిత భర్తవంక భయంగానూ, అనుమానంగానూ చూసింది. అతడీ ప్రశ్న ఎందుకడిగినట్లు? తన గురించి ఏమైనా తెలిసిందా?

"లక్ష్మి మాటే రైటు—" అన్నదామె.

చలపతిరావు నిట్టూర్చి — "ఆడవాళ్ళంతా అలాగే అంటారు. కానీ మగాడు తప్పుచేస్తే మళ్ళీ అందుకు ప్రోత్సాహమే కారణమవుతుంది—" అన్నాడు.

కవిత ఉలిక్కిపడింది. శామ్యూల్‌ని తనే ప్రోత్సహించినట్లు లెక్క! కానీ అతడు నిగ్రహించుకున్నాడు. అది తనకు బలహీన క్షణం....

"ఏది ఏమైనా పెళ్ళయినాక భార్యాభర్తల్లో ఎవ్వరూ బలహీన క్షణాలకు లొంగకూడదు—...." అంది కవిత.

"అంటే పెళ్ళికి ముందు లొంగవచ్చుననా నీ అభిప్రాయం?"

సూటిగా తగిలింది కవితకీ ప్రశ్న. ఒక్క క్షణం తడబడి—"ఈ విషయమై మీ అభిప్రాయం చెప్పండి" అంది.

"నా అభిప్రాయ మేమిటంటే బలహీన క్షణాల విషయమేలాగున్నా భార్యా భర్తల మధ్య రహస్యా లన్నవి వుండకూడదు. ఒకరి బలహీనతల నొకరికి చెప్పుకొని అవగాహన పెంచుకొని సమస్యలకు పరిష్కార మార్గాల నాలోచించాలి.

కవిత చటుక్కున-"నా దగ్గర మీకు తెలియని రహస్య మేదైనా వుంటే అర్థం చేసుకొని క్షమించగలరా?" అన్నది.

"నీ రహస్యాలు నాకు చెప్పుకోగలిగితే అది నువ్వు నాకిచ్చిన గౌరవంగా భావించి సంతోషిస్తాను. నీవద్ద ఎలాంటి రహస్యం దాగున్నప్పటికీ నేను నిన్ను వదులుకో లేను. నా ప్రాణంలో ప్రాణానివి నువ్వు...." అన్నాడు చలపతిరావు.

బ్లాక్ మెయిలర్ గురించి భర్తకు చెప్పేయాలన్నంత ఆవేశం వచ్చింది కవితకు ఆ క్షణంలో. అయితే అప్పుడే ఆమెకు తను చదివిన కథ ఒకటి గుర్తుకు వచ్చింది.

అందులో తనవంటి భార్య....

ఎటొచ్చీ తను తప్పు చేయలేదు. ఆమె తప్పు చేసింది.

ఆమె భర్త తన ఆదర్శాల గురించి పదేపదే చెప్తు వుంటాడు. భార్యలో ఎటువంటి తప్పున్నా క్షమించ గలననీ భార్యాభర్తల మధ్య రహస్యాలుండకూడదనీ అంటాడు. చివరికొకరోజున తను పెళ్ళికిముందు చిన్న పొరపాటు చేశాననీ—అది తన మనసును వేధిస్తున్నదనీ అంటాడు. భార్య కూడా ఏదైనా చిన్న తప్పు చేసి

వుంటే తన మనసుకు తృప్తిగా వుండేదంటాడు. ఆమెను దేవతలా చూస్తూ తానామెకు దూరంగా వుండడం ప్రారంభిస్తాడు.

భర్త పన్నిన ఈ వలలో భార్య పడిపోయింది. భర్త తన్ను తాను నిందించుకుంటూ అసంతృప్తితో బాధ పడడమూ, తనను దేవతలా చూడడమూ భరించలేక— ఆమె పెళ్ళికిముందు తను చేసిన తప్పు గురించి చెప్పేస్తుంది.

"నువ్విలాంటిదానివని చాలాకాలంగా అనుమానిస్తున్నాను. నీచేత ఈ నిజం చెప్పించడానికే ఇన్నాళ్ళుగా నాటకమాడుతున్నాను. నీవంటి కులట నాకు వద్దు—" అంటాడు భర్త.

అతడామెను వదిలిపెట్టేస్తాడు.

ఈ కథలోని నీతి ఏమిటో కూడా రచయిత్రి చివర చెప్పింది—"ఆడది తప్పుచెయ్యడం తప్పుకాదు. నీ భర్త తప్పును మన్నిస్తాడని నమ్మడం తప్పు...."

ఈ కథ గుర్తుకు రాగానే కవితకు బెంగపట్టుకుంది. చలపతిరావు తనను వెంకటేశ్వర్లు, లక్ష్మిల విడాకుల గురించి ఎందుకు చెప్పాడు? తనచేత నిజం చెప్పించడానికి అతడు ప్రయత్నిస్తున్నాడా? అతడికి తనపై అనుమానం కలిగిందా? శామ్యూల్ గురించి అతడికి తెలిసిపోయిందా?

ఆలోచనలతో కవితకు నిద్రపట్టేసరికి చాలా ఆలస్యమయింది. చలపతిరావు ఆ రాత్రికామెను పలకరించలేదు.

# 6

ఆ రోజు కూడా చలపతిరావు ఉదయం ఎనిమిది గంటలకే బయటకు వెళ్ళిపోయాడు.

సరిగ్గా పది గంటలకు కవిత గదిలో టెలిఫోన్

మ్రోగింది. ఆమె భయపడుతూనే రిసీవర్ తీసింది.

"గడువు అయిపోయింది—" అన్నాడతను.

"నేను నిర్ణయం తీసుకున్నాను. మీకు డబ్బివ్వాలని" అంది కవిత.

"చాలా మంచి నిర్ణయం తీసుకున్నారు...." అన్నాడతను.

"కానీ ఈ నెలకు నేను మీకేమీ ఇచ్చుకోలేను. వచ్చే నెలనుంచి ప్రారంభిద్దాం...."

"వచ్చే నెలనుంచా? అదేమీ లాభంలేదు. ముందే చెప్పాను...."

"ప్రారంభం ఈ నెలనుంచే.... ఈ నెలకివ్వాల్సిన రెండువేలూ బాకీగా అనుకోండి. వచ్చే నెలలో రెండు నెలలదీ కలిపి నాలుగువేలూ ఇస్తాను...."

"నథింగ్ డూయింగ్...."

"ఈ విషయంలో నేను అసహాయురాలిని ..."

"అయితే ఈ రోజే మీ భర్తకు అన్నీ చెప్పేస్తాను."

"ప్లీజ్ ....అలా చేయొద్దు...."

"చాలాంబాగుంది. లక్షరూపాయలకు యాభైవాయిదాలివ్వడమే ఓ పెద్ద విశేషం. అందులో మళ్ళీ అప్పు కూడానా?"

కవిత అతడికి తన పరిస్థితి వివరించి చెప్పింది.

"అయితే ఓ పని చేయండి. మీకింకో ఇరవై నాలుగు గంటల వ్యవధి ఇస్తున్నాను. ఈలోగా ఆ రెండువేలూ ఎలా సంపాదిస్తారో ఆలోచించుకోండి. రేపు ఉదయం పదిగంటలకు మీ దగ్గర నాకివ్వడానికి రెండువేలూ సిద్ధంగా వుండాలి. లేనిపక్షంలో అంతే!" అవతల ఫోన్ క్లిక్ మంది.

కవిత ఆలోచనలో పడింది. తనకింక వ్యవధి లేదు. ఏదో ఒక నిర్ణయం తీసుకోవాలి. విషయం భర్తకేనా చెప్పుకోవాలి. లేదా ఏదో విధంగా డబ్బు సిద్ధం చేయాలి.

లక్షరూపాయలు....

తను చేయని తప్పుకు మూల్యంగా అంత మొత్తం చెల్లించాలా? భర్తమీది అపనమ్మకంతో అంత డబ్బు పోగొట్టుకోవాలా?

కవిత మనసు ఉసూరుమంటున్నది.

అటు జీవితం....ఇటు లక్షరూపాయలు....

లక్షరూపాయల గురించి ఆమె మరీ అంతగా బెంగ పడడంలేదు. ఈ బ్లాక్ మెయిలర్ బాధ తనను జీవితాంతం వదలదేమోనని ఆమె భయం.

పిరికివాడికి వెయ్యి చావులు. ధైర్యవంతుడికొక్కటే చావు.

ఏదో ఒకటి అవుతుంది. భర్తకు విషయం చెప్పేస్తే.

మళ్ళీ ఆమెకు ఆ కథ గుర్తుకు వచ్చింది.

ఆలోచనలతో కవిత సతమతమవుతూండగా ఆమెను కలుసుకొనేందుకు ఒక యువతి వచ్చింది.

కవితకు ఆమె ఎవరో తెలియదు. అయినా మర్యాదగా పలకరించింది.

"నా పేరు రేఖ. కానీ నిజానికి మిమ్మల్ని మా అన్నయ్య కలుసుకోవలసింది—" అన్నదామె.

"మీ రెవరో నాకు తెలియదు. మీ అన్నయ్య కూడా నాకు తెలిసివుంటాడని నేననుకోను—" అంది కవిత.

"అందుకే మా అన్నయ్య నన్ను పంపాడు. అనవసరంగా ఆడవాళ్ళపైన అపవాదులు రావడం అన్నయ్యకిష్టముండదు—...."

"విషయం చెప్పండి...."

"అన్నయ్య మీ ఇంటికొచ్చి మిమ్మల్ని కలుసుకుంటే అది ఎన్నో అపార్థాలకు దారితీస్తుంది. ఆడవాళ్ళ గురించి అన్నయ్య ఇంత మూర్ఖంగా ఆలోచిస్తాడు. దీన్నిబట్టి అన్నయ్య మంచితనం మీరు అర్థం చేసుకోవచ్చును..." అందామె.

"మీ అన్నయ్య మంచితనం గురించి నేనెందుకు అర్థం చేసుకోవాలో నాకు తెలియటంలేదు—...."

"ఎందుకంటే మా అన్నయ్య మీవారి గురించి ఏదైనా విశేషం చెబితే అది మీరు మీపట్ల సానుభూతిగా మాత్రమే అర్థం చేసుకోవాలి...."

"చెప్పండి...." అంది కవిత విసుగ్గా.

"ఇలాంటివి మాటల్లో చెప్పటం ఇబ్బందిగా వుంటుంది....ఇది చూడండి...." అంటూ ఆమె ఓ కవరు నందించింది కవితకు.

కవిత ఆ కవరునందుకుంది. అందులో నాలుగు ఫోటోలున్నాయి. అన్నింట్లోనూ ఒక యువకుడు, యువతి. ఇద్దరిమధ్యనూ ఎంత చనువున్నదో ఆ ఫోటోలే చెప్పక చెబుతున్నాయి.

ఆ ఫోటోలోని యువతి ఎవరో కవితకు తెలియదు. యువకుడు మాత్రం ఆమె భర్త చలపతిరావు.

కవిత చేతులు వణికాయి—"ఈ ఫోటోలు నాకెందు కిచ్చారు?"

"అన్నయ్యకు ఆడవాళ్ళంటే సానుభూతి. ఆ ఆడవాళ్ళను మోసగించే మగవాళ్ళంటే చిరాకు. పెళ్ళికి ముందు మీవారి చరిత్ర ఇది. పెళ్ళయినాక ఇంకా ఇలాంటి చరిత్ర ప్రారంభమైన దాఖలాలు లేవు. కానీ చెప్పలేం! మీరు మీవారిని ఆరాధిస్తున్నారు. ఆయన ఆ ఆరాధనకు

అర్హుడు కాడు. మీ మనసులో ఆయనకు సరైన స్థానం ఇవ్వటంకోసం ఈ ఫోటోలుపయోగిస్తాయి. వుంచుకోండి" అని చరచరా వెళ్ళిపోయిందామె.

కవిత చాలాసేపు ఆ ఫోటోలవంకనే చూస్తూండి పోయింది.

ఇదా తన భర్త చరిత్ర! ఇది ఈ రోజే తనకెందుకు తెలిసింది?

ఆమెకు అంతా అర్థమైనట్టే అనిపించింది.

మరొక్కసారి తను చదివిన ఆ కథకోసం వెతకాలను కుంది. ఎంత వెదికినా ఆమెకా పుస్తకం కనబడలేదు. ఆఖరికి భర్త వ్యాపార వ్యవహారాల మధ్య ఆమెకు దొరికింది ఆ పుస్తకం.

ఆ పుస్తకం అక్కడెందుకుంది?

సందేహంలేదు. చలపతిరావు ఈ కథను చదివాడు. ఆ కథ అతడిపై చెప్పుకోదగ్గ ప్రభావమే చూపింది. అతడికి భార్యపై అనుమానం ప్రారంభమైంది. అందు కోసం తనూ నాటకం ప్రారంభించాడు.

ఈ ఫోటోలు నిజమా—ఆ నాటకంలోని భాగమా?

ఏదిఏమైనా కవిత ఒక నిర్ణయానికి వచ్చింది. భర్తకు తన రహస్యం చెప్పాలన్నదే ఆ నిర్ణయం. అయితే తనకు తానై కాదు. ఆ బ్లాక్ మెయిలరునే ఆ విషయాలు చెప్ప నిస్తుంది. భర్త తనను నిలదీసి అడిగితే ఆ శామ్యూల్‌నే ఇక్కడకు రప్పించమంటుంది. మానసికంగా తనను హింసించిన ఆ శామ్యూల్‌ని కసితీరా తిడుతుంది.

అప్పుడు భర్త తనను వదిలిపెట్టాలనుకుంటే....

ఆత్మహత్య!

## 7

అతడు నెంబర్ డయల్ చేసి—"హలో!" అన్నాడు.

అవతలనుంచి—"నేను కవితను. మీరెవరు?" అన్న గొంతు వినిపించింది.

"నేను శామ్యూల్ స్నేహితుణ్ని—" అన్నాడతడు.

"అయాం సారీ మిస్టర్! నేను మీకు డబ్బివ్వలేను. మీరేం చేయాలనుకుంటే అది చేసుకోవచ్చును."

అవతల క్లిక్‌మంది.

అతడి కళ్ళలో ఆశ్చర్యం కనబడింది. తనూ రిసీవర్ క్రెడిల్ చేశాడు. తర్వాత జేబులో చేతులు పెట్టుకుని లేచి నిలబడ్డాడు.

కొద్ది క్షణాల్లోనే అతడు రోడ్డుమీద వున్నాడు. మరికొద్ది క్షణాల్లో చలపతిరావు ఎదుట వున్నాడు.

"ఆమె డబ్బివ్వడానికి నిరాకరించింది" అన్నాడతడు.

చలపతిరావు కళ్ళు మెరిశాయి-"రియల్లీ!" అన్నాడు.

"అవును...."

"థాంక్యూ మై డియర్ ఫ్రెండ్...." అన్నాడు చలపతిరావు.

"నేను మీ స్నేహితుణ్ని కాదు. శామ్యూల్ స్నేహితుణ్ని!"

చలపతిరావు అతడికి, శామ్యూల్‌కు మరోసారి తన కృతజ్ఞతలు తెలియజేశాడు. అతడు వెళ్ళిపోయాడు.

చలపతిరావు ఆలోచిస్తున్నాడు.

తను ప్రాణానికి ప్రాణంగా ప్రేమిస్తున్నాడు కవితను. ఎట్టి పరిస్థితిల్లోనూ ఆమెకు దూరమై బ్రతుకలేడు. అయితే పెళ్ళికి ముందు బలహీన క్షణాల్లో తానో చపలచిత్త అయిన యువతి వలలో పడ్డాడు. అది తాత్కాలికం

మాత్రం. ఎప్పుడో ఆ వ్యవహారం కవితకు చెప్పి ఆమె క్షమను పొందాలనుకున్నాడు. కానీ ఈలోగా వెంకటేశ్వర్లు, లక్ష్మిల ఆదర్శ దాంపత్యం కోర్టుకెక్కింది.

ఆడది భర్తని ఎంతగా ప్రేమించినా, భర్తచే ఎంతగా ప్రేమించబడుతున్నా-ఒకోసారి చిన్న చిన్న విషయాల్లో ఎంతైనా మూర్ఖంగా ప్రవర్తించి నూరేళ్ళ సంసార జీవితాన్ని ఛిన్నాభిన్నం చేసుకోగలదని లక్ష్మి ఋజువు చేసింది.

లక్ష్మి కేసు కోర్టులో నడుస్తూండగానే తనపైన బ్లాక్ మెయిల్ ఆరంభమయింది. చలపతిరావుకు కవితపై నమ్మకం పోయింది.

ఏం చేయాలి?

కవిత తన్ను చీదరించుకుంటే....

మన దేశంలోని ఆడది మానసికంగా ఇంకా ఎదగలేదు. కవిత ఎలాంటి తప్పు చేసినా తను భరించడానికి సిద్ధంగా వున్నాడు. కానీ ఆమె అలా వున్నదో, లేదో..

చలపతిరావుకు శామ్యూల్ గురించి చూచాయగా తెలుసు. అతడు కవితను పెళ్ళిచేసుకోవాలనుకున్నాడనీ.. కవిత తండ్రి అందుకంగీకరించలేదనీ....

అతడు శామ్యూల్‌ను కలుసుకున్నాడు. తన పరిస్థితిని, లక్ష్మి గురించిన విశేషాలు చెప్పాడు.

“మిమ్మల్ని కవిత ప్రేమించినదీ లేనిదీ నాకు తెలియదు. ప్రేమించి వున్నప్పటికీ అది గతంలో మాత్రమేనని నాకు తెలుసు. నన్నామె సానుభూతితో అర్థం చేసుకోవాలంటే మీరామెను బ్లాక్ మెయిల్ చేయడం మినహా మరోదారిలేదు. మీరామెనెలా బ్లాక్ మెయిల్ చేస్తారో కూడా నేను తెలుసుకోనదల్చలేదు. ఒకప్పు

డా మెను ప్రేమించిన వ్యక్తిగా ఈరోజా మె సంసారం చక్కదిద్దండి...."

ముందు అంగీకరించకపోయినా చివరికి శామ్యూల్ అంగీకరించాడు. తన స్నేహితుడిని పంపాడు.

ఇప్పుడేం జరుగుతుంది? నిన్న రేఖ తనను బెదిరించింది. ఫోటోలా మెకు అందజేస్తానని! అందజేశానని కూడా ఆ తర్వాత ఫోన్ చేసి చెప్పింది.

ఫోటోలా మెకు అందాయా? అందితే ఆమె రియాక్షన్ ఏమిటి?

* * *

ఇంట్లో భర్తకోసం ఎదురుచూస్తూ కవిత ఆలోచిస్తోంది. బ్లాక్ మెయిలర్ భర్తకు అన్నీ చెప్పేశాడా? భర్త ఇప్పుడు తన గురించి ఏమనుకుంటున్నాడు? అతడు వచ్చి తనను నిలదీస్తే తను ఏం చేయాలి? ఈ ఫోటోలు చూపించాలా?

తనాశించినట్లుగానే ఆ సాయంత్రం భర్త రాగానే బ్లాక్ మెయిలర్ విషయం చెప్పాడు. అతడు శామ్యూల్ విషయం చెప్పి, కవిత ఉత్తరాలు, డైరీ చూపించినట్లు, తను వాటిని అతడి మొఖానే కొట్టి బాగా చీవాట్లువేసి పంపినట్లు, చెప్పాడు....

కవిత హృదయం తేలికపడింది. భర్త ఔన్నత్యానికి, అతడికి తనమీదున్న నమ్మకానికి, ప్రేమకి కరిగిపోయింది.

ఆ తర్వాత ఏళ్ళు గడిచాయి.

ఫోటోల గురించి కవిత భర్తను అడగనేలేదు.

వారి దాంపత్యంలోని అన్యోన్యత మాత్రం చెక్కుచెదరకుండా వున్నది.

—:అ యి పో యి ం ది:—

# ఎర్రగాజు

## టెంపోరావ్

విజయవాడ స్టేషన్‌లో లీల ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కింది. వెనకనే ఆమె అన్న రామరాజు ఎక్కాడు. ఇద్దరూ కొంతసేపు మౌనంగా నిలబడ్డారు.

"అన్నయ్యా, సీటు రిజర్వేషన్ కూడా దొరకలేదు. మద్రాస్ దాకా ఇలా నుంచునే వెళ్ళాలేమో!" అంది లీల.

"డోంట్ వర్రీ! ఎవరో కొంచెం జరిగి నిన్ను కూర్చోమంటారు" అన్నాడతను.

ఆ మాట విని సమీపంలో వున్న కోకిల వాళ్ళవైపు చూసింది. ఆమె వయస్సు నలభై దాటింది.

"నువ్వెళ్ళు అన్నయ్యా! పాపం అమ్మ ఒక్కత్తే వుంటుంది" అంది లీల.

"మరేం ఫరవాలేదులే! నీకు ఎక్కడో సీటు చూసి, కూర్చోబెట్టి వెళ్తాను."

ప్లాట్‌ఫామ్‌మీద నుంచి అమ్మేవాళ్ళ అరుపులు వినపడుతున్నాయి. తనకు తెలిసిన వాళ్ళు యెవరేనా కని

పిస్తారా అని రామరాజు ముందుకూ, వెనక్కీ చూశాడు.

"నువ్వు ఎందాకా వెళ్ళాలమ్మా?"

ఆ ప్రశ్న విని లీల తృళ్ళిపడింది. రామరాజు పక్కకు చూశాడు.

కోకిల నవ్వుతూ వాళ్ళవైపు చూస్తోంది. రామరాజు ఆమె దగ్గరకు జరిగాడు.

"ఈమె నా చెల్లెలు లీల. మద్రాస్ వెళ్తోంది" అన్నాడతను.

"ఇలా కూర్చోవమ్మా!" అంది కోకిల.

ఆమె పక్కనే లీల కూర్చుంది. సంతోషపడ్తూ రామరాజు ఆమెవంక చూశాడు.

"మీరు మద్రాస్‌కే వెళ్తున్నారా?"

"యస్, మద్రాసే! అక్కడ గాబ్రియల్ సర్జికల్ క్లినిక్‌లో నర్సుగా పనిచేస్తున్నాను" అందామె.

"చూడండి, మా చెల్లెలు యింతవరకూ మద్రాస్ వెళ్ళలేదు. ఒంటరిగా ప్రయాణం చేయలేదు. అందువలన నాకు గాభరాగా వుంది."

"భయపడకండి! మద్రాస్‌లో ఎక్కడికెళ్ళాలి?"

"మోటర్స్ యింజనీరింగ్ కంపెనీ వాళ్ళు నన్ను యింటర్వ్యూకి రమ్మన్నారు. బి. ఎ. పాసయ్యాను" అంది లీల.

"ఎప్పుడు యింటర్వ్యూ?"

"రేపు పదింటికి."

"నీకు ఏ బెంగా లేదమ్మా. మద్రాస్‌లో నేను నీకు సహాయపడ్తాను" అంది కోకిల.

"చాలా థాంక్స్. మద్రాసులో నా ఫ్రెండ్ శాంతారావు వున్నాడు. అతడికి ఉత్తరం రాశాను.

అతడు స్టేషన్‌కి వస్తాడు. అతడికి మీరు లీలను అప్పగిస్తే చాలు, ఎంతో సంతోషిస్తాను" అన్నాడు రామరాజు.

"అలాగే చేస్తాను" అంది కోకిల.

రామరాజు కృతజ్ఞతతో ఆమెవైపు చూశాడు.

"దేవతలా మీరు దొరికారు. చాలా సంతోషం. ఒకవేళ నా ఫ్రెండ్ స్టేషన్‌కి రాకపోతే అతని యింటి ముందు నా చెల్లెల్ని దింపండి. అతని అడ్రెస్ ఆమె దగ్గరుంది."

"దానికేముంది! అలాగే అతడి యిల్లు చూపిస్తాను" అని ఆమె రామరాజువైపు నవ్వుతూ చూసింది.

"లోకంలో అనేకమంది దుష్టుల మధ్య మనం జీవిస్తున్నాం. మీరు నన్ను కూడా నమ్మకూడదు. నా అడ్రెస్ గుర్తుంచుకోండి! మిస్ కోకిల, గాబ్రియల్ సర్జికల్ క్లినిక్, హాల్స్ రోడ్డు, ఎగ్మూరు, మద్రాసు. గత పదేళ్ళనుంచీ అక్కడే పనిచేస్తున్నాను" అందామె.

ఆమె అడ్రసు అతడు రాసుకున్నాడు.

"మీలాంటి సహృదయుల అడ్రెస్ నా దగ్గర వుండడం మంచిది. నా చెల్లెలు యింటర్వ్యూ అవగానే ఏదో ట్రెయిన్‌లో ఎక్కి తిరిగి వచ్చేస్తుంది. అదంతా నా మిత్రుడు చూస్తాడు."

"మా యింట్లో ఒకరోజైనా వుండాలి మీ చెల్లెలు!" అందామె నవ్వుతూ.

"నాకంటె మా అమ్మకి బెంగ ఎక్కువ. ఎలాగో పట్టుబట్టి అది మద్రాస్ వెళ్తోంది. ఉద్యోగం కోసం మద్రాస్ వెళ్ళడం నాకిష్టంలేదు. ఏదో మంచి ఉద్యోగం యిక్కడే దొరుకుతుందని నేనెంత చెప్పినా అది వినలేదు."

"వయస్సులో వున్న వాళ్ళకు ధైర్యం ఎక్కువ!" అందామె నవ్వుతూ.

రామరాజు కిందకు దిగాడు. కిటికీలోంచి లోపలకు చూస్తూ నుంచున్నాడు. అతడి చూపు క్షణకాలం లీల మీదే వుంది!

లీల చిరునవ్వు అతడికి ధైర్యాన్నిచ్చింది.

"నువ్వు దిగులుపడకు అన్నయ్యా! రేపు రాత్రి ట్రెయి నెక్కి ఎల్లుండిపొద్దుటే నీ ముందు వుంటాను" అంది లీల.

ఎక్స్ప్రెస్ కూత వినపడింది. అతడు చెల్లెలివైపు, కోకిలకేసి చూశాడు. ఎక్స్ప్రెస్ కదిలింది. కొంతదూరం అతను ప్లాట్ఫామ్మీద పరుగెత్తాడు. ఎక్స్ప్రెస్ వేగంగా ముందుకు వెళ్ళిపోయింది. అతను అలా నిలబడి, వెళ్ళిపోతున్న ట్రెయిన్వైపు చూశాడు. ఆలోచిస్తూ వెనక్కి తిరిగి బయటకు నడిచాడు.

తన చెల్లెలు మద్రాస్ వెళ్ళి క్షేమంగా తిరిగిరావాలని దేవుడిని ప్రార్థించాడు.

## 2

కోరమండల్ ఎక్స్ప్రెస్ యెక్కడా ఆగకుండా ప్రయాణం సాగిస్తోంది.

"కోకిలకూ, లీలకూ బాగా స్నేహం అయిపోయింది. తను తెచ్చుకున్న వడలు ఆమె లీలకిచ్చి తినమంది. లీల ఆమెకు యిడ్లీ చట్నీ యిచ్చింది.

"నువ్వు ఎంతవరకూ చదువుకున్నావు?" అడిగింది కోకిల.

"బి. ఎ. పాసయ్యాను. టైపింగ్ హయ్యర్, షార్టు హేండ్ లోయర్ పాసయ్యాను."

"నీ అన్నకు పెళ్ళయిందా?"

"కాలేదు. నా పెళ్ళి అయిందాకా పెళ్ళాడకూడదని అన్నయ్య నిశ్చయించుకున్నాడు. అమ్మా నేనూ ఎంత చెప్పినా వినడు!"

"అతడి వయస్సు ముప్ఫయి వుంటుందా?"

"మీరు కరెక్టుగా వూహించారు. అన్నయ్య నాకంటె 8 ఏళ్ళు పెద్ద" అంది లీల.

"అమ్మ, అన్నయ్యా నువ్వూమాత్రం యింట్లో వుంటున్నారా?"

లీల తలాడించింది. కోకిల ఫ్లాస్కులోని కాఫీని గ్లాసులో పోసి ఆమెకిచ్చింది. ఆమె తాగింది. అదే గ్లాసులో కాఫీ పోసుకుని కోకిల తాగేసింది.

కోకిల నవ్వుతూ లీలవైపు చూసింది. లీల చాలా అందమైన యువతి. కుడిచేతికి ఎర్రటి గాజులున్నాయి! మొహం చూస్తే అమాయకురాల్లా లీల కనిపిస్తోంది.

"నువ్వు ఒంటరిగా ఎక్కడకూ వెళ్ళలేదా?"

"అన్నయ్యో, అమ్మో కూడా లేకుండా నేను బయట వూళ్ళకు వెళ్ళలేదు. నేను వెళ్ళాలనుకున్నా వాళ్ళు వెళ్ళనివ్వరు."

"ఇప్పుడు మద్రాస్ ఎలా వెళ్ళనిచ్చారు?"

"అన్నయ్య నాతో వస్తానన్నాడు. కాని అర్జంట్ పనివలన అతడికి సెలవు దొరకలేదు. నన్ను వెళ్ళొద్దన్నాడు. నేను వెళ్ళితీర్తానని పట్టుబట్టాను. చివరికి అన్నయ్య సరే అన్నాడు. ఈసారి ఎంత వద్దన్నా నేను మాననని అన్నయ్య గ్రహించాడు. అందుకే వూరుకున్నాడు.

"మీ అన్నయ్య ఫ్రెండ్ కాంతారావు నీకు బాగా తెలుసా?"

"తెలుసు! అతడు స్టేషన్‌కు వస్తాడో రాడో! అన్నయ్య ఉత్తరం ఆలస్యంగా రాశాడు."

కోకిల ఆమె చెయ్యి పట్టుకుంది. నవ్వుతూ ఆమె కళ్ళలోకి చూసింది.

"లీలా, డోంట్ బాదర్! కాంతారావు స్టేషన్‌కి రాకపోతే ఆయనింటికి నిన్ను నేను తీసుకెళ్తాను. భయం లేదు" అంది కోకిల.

దేవతలా ఆమె దొరికినందుకు లీల లోలోపల ఆనందించింది.

చీకటిపడ్తోంది. సెంట్రల్ స్టేషన్‌లోని లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి. కోరమండల్ ఎక్స్‌ప్రెస్ ఆగింది.

కోకిల, లీల కిందకు దిగారు. లీల చేతిలో ఏర్ బాగ్ వుంది. ప్లాట్‌ఫామ్‌మీద చాలా రద్దీగా వుంది.

"ఆ కాంతారావు ఎవరో నువ్వే గుర్తుపట్టాలి లీలా" అంది కోకిల.

ఒక వ్యక్తి కోకిల పక్కనుంచి మెల్లిగా కదిలాడు. పావుగంటవరకూ వాళ్ళు చూస్తూ వుండి పోయారు.

"మా ఇంటికి పోదాం, పద! కాంతారావుకి ఉత్తరం అందలేదేమో!" అంది కోకిల.

"మరో ఐదు నిమిషాలు చూద్దాం" అంది లీల.

ఐదు నిమిషాలు దాటిపోయింది. ఏం చెయ్యాలా అని లీల గాభరా పడ్తోంది.

నలభై ఏళ్ళ మనిషి వాళ్ళముందుకు వచ్చాడు. లీలవైపు పరీక్షగా చూశాడు.

"అమ్మాయి, నీ పేరు?" ప్రశ్నించాడతను.

"లీల. మాది విజయవాడ" అందామె.

"కాంతారావుకోసం చూస్తున్నావా?"

ఆమె తలాడించింది.

"ఆయన మిమ్మల్ని పంపారా?"

"అతడికి ఆరోగ్యంగాలేదు. నన్ను వెళ్ళమన్నాడు. ఇలా వచ్చాను—ప్లాట్ ఫామ్‌మీద తిరిగి తిరిగి చెప్పులు అరిగిపోయాయి!" అన్నాడతను.

"కాంతారావుగారు రాకపోతే తప్పక ఎవరినేనా పంపుతారని నేనన్నానుగా!" అంది లీల సంతోషంగా కోకిలవైపు చూస్తూ.

కోకిల క్షణకాలం అతడివైపు చూసింది.

"మీ పేరు?"

"రామ్మూర్తి."

"కాంతారావు మీ ఫ్రెండా?"

"ఇద్దరం ఒకే ఆఫీసులో పనిచేస్తున్నాం. ఇంకా ఏమైనా ప్రశ్నలు అడగాలా?"

"క్షమించండి! లీల మొదటిసారిగా మద్రాస్ వచ్చింది. అందుకని అడుగుతున్నాను" అంది కోకిల.

"మీరూ మాతో రండి! కాంతారావుకు ఆమెను మీరు అప్పగించవచ్చు!" అన్నాడతను.

అతడామాట అనగానే ఆమెలోని అనుమానం మాయమైంది. ఆమె లీలవైపు నవ్వుతూ చూసింది.

"లీలా, రేపు ఇంటర్‌వ్యూ అయాక ఒకసారి మా ఇంటికి రా! అడ్రెసు యిచ్చేనుగా!"

"నేనే తీసుకొస్తాను" అన్నాడతను.

"రా అమ్మా, పోదాం! మరీ ఆలస్యమైతే నువ్వు ఏమయ్యావో అని కాంతారావు గాభరాపడ్తాడు" అన్నాడతను.

అతడితో లీల వెళ్ళిపోయింది. తన సూట్ కేసు, బాగ్ తీసుకొని కోకిల బయటకు నడిచింది.

బయట నిలబడి కోకిల ఆటోకోసం చూస్తోంది. ఆమె ముందునుంచి ఒక టాక్సీ దూసుకుపోయింది. అందులో వున్న లీల ఆమెకు బై బై చెప్పింది.

టాక్సీ నంబరుమీదకు ఆమె చూపు వెళ్ళింది. అప్పుడే అక్కడికొచ్చి ఆగిన ఆటోలో ఎక్కిందామె.

"ఎగ్మూరు" అందామె.

ఆటో బయటకు దూసుకు పోయింది.

# 3

రోడ్డు దీపాలు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. వెనుక సీటుమీద కూర్చుని లీల కారు కిటికీలోంచి ముచ్చటగా బయటకు చూస్తోంది.

అనేక రోడ్లు తిరిగి టాక్సీ సాగిపోతోంది. పక్క కూర్చున్న రామ్మూర్తివైపు ఆమె తిరిగింది.

"ఇంకా ఎంతదూరం వెళ్ళాలి?" అడిగిందామె.

"చాలాదూరం వెళ్ళాలి!" అన్నాడతను.

ఆమె మళ్ళీ బయటకు చూస్తూ ఆలోచించసాగింది. కాంతారావు యిల్లు సెంట్రల్ స్టేషన్‌కు దగ్గరగానే వుందని అన్న చెప్పడం ఆమెకు గుర్తుకొచ్చింది. బస్సులో వెళ్తే పదిహేను నిమిషాల్లో కాంతారావు యిల్లు చేరుకో వచ్చు అన్నాడు అన్నయ్య. పదిహేను నిమిషాలు పైన టాక్సీ వెళ్తోంది. అయినా కాంతారావు యిల్లు రాలేదు!

కాంతారావు ఇల్లు మారాడా? ఆ ప్రశ్న మెదడులో కలగానే ఆమె వులిక్కిపడింది. అన్నయ్య రాసిన ఉత్తరం అతడికి అందలేదేమో!

అయితే తన పక్క కూర్చున్నతను ఎవరు? నిజంగా

కాంతారావు ఫ్రెండేనా?

"మద్రాస్ నువ్వు ఎందుకొచ్చేవమ్మా?" అడిగాడతను.

"కాంతారావుగారు చెప్పలేదా?"

"అతడికి తొందర ఎక్కువ. నన్ను స్టేషన్‌కి వెంటనే వెళ్ళమన్నాడు. నీ పేరూ, ఊరూ చెప్పాడు. మీ పక్క నుంచి వెళ్తూ నిన్ను లీలా అని ఆమె పిలవడం విన్నాను. లేకపోతే నిన్ను పోల్చడం నాకు ఎంతో కష్టమయ్యేది" అన్నాడతను.

అతడు చెప్పినదాన్ని గురించి ఆమె ఆలోచిస్తోంది. లీల తెలివిగల యువతి. ఎవరు ఏం చెప్పినా నమ్మదు.

"ఎందుకొచ్చావో చెప్పలేదు!"

"మోడర్న్ ఇంజనీరింగ్ కంపెనీ తెలుసుగా, మైలాపూర్‌లో వుంది. వాళ్ళు నన్ను యింటర్‌వ్యూకి రమ్మన్నారు."

"ఇంటర్‌వ్యూ ఎన్నింటికి?"

"రేపు పదింటికి."

"ఆఫీసుకు లీవుపెట్టి నేను నిన్ను అక్కడకు తీసుకు వెళ్తానులే" అన్నాడతను.

"కాంతారావుగారు రాలేరా?"

"జ్వరం తగ్గితే అతనే వస్తాడు."

అతడు ముందుకు వంగి టాక్సీ డ్రయివర్‌కు ఏదో చెప్పాడు. ఒక టెలిఫోన్‌బూత్ దాటి టాక్సీ వెళ్ళింది. చటుక్కున ఆగింది.

అతడు కిందకు దిగాడు. గబగబా బూత్ వైపు పరుగెత్తాడు. వెనక్కు తిరిగి ఆమె చూసింది. అతడు ఏదో నంబరు తిప్పుతున్నాడు.

లీల తీవ్రంగా ఆలోచించసాగింది. ఇరవై నిమషాలు పైన టాక్సీ కదుల్తూనే వుంది. కాని కాంతారావు యిల్లు యింకా రాలేదు. ఆమెలో అనుమానం తలెత్తింది.

వెనక్కి తిరిగి ఆమె చూసింది. ఇంకా అతడు ఫోన్‌లో మాట్లాడుతూనే వున్నాడు. టాక్సీ డ్రయివర్ సిగరెట్ కాలుస్తూ కూర్చున్నాడు. కారు తలుపు మెల్లిగా తెరిచి, ఏర్ బాగ్ తీసుకుని ఆమె కిందకు దిగింది. రోడ్డు దాటి అటువైపు వున్న షాపులవైపు పరుగెత్తింది. వేగంగా నడుస్తూ పేవ్‌మెంటమ్మట వెళ్ళిపోయింది.

రిసీవర్ పెట్టేసి బూత్‌లోంచి అతడు బయిటపడ్డాడు. పరుగెత్తుకొచ్చి టాక్సీ ఎక్కి తలుపు మూశాడు. పక్కకు చూశాడు. ఆమెలేదు.

"అమ్మాయి ఎక్కడ?" అడిగాడు డ్రయివర్ని.

"ఎక్కడికి పోయిందో నాకేం తెలుసు?" అన్నాడు డ్రయివర్.

అతను కిందకు దిగి ఆమెకోసం యిటూ, అటూ చూశాడు. ఎక్కడా కనబడలేదు.

"నేనలా వెళ్ళి చూసి వస్తాను. నువ్వు యిక్కడే వుండు" అన్నాడతను.

"మీటర్ చార్జి చెల్లించి వెళ్ళి వెతుకు!" అన్నాడు డ్రయివర్.

అతడు మీటర్ చూసి డబ్బు చెల్లించాడు. వేగంగా రోడ్డు దాటి ఆమెను వెతుకుతూ వెళ్ళాడు.

## 4

లీల ధైర్యంగా ముందుకు నడుస్తోంది. ఒక బట్టల షాపు బోర్డును చూసి తను అయినావరంలో వున్నట్లు గ్రహించింది.

ఇప్పుడు తనేం చెయ్యాలి? ఆమె టైము చూసింది. ఏడు దాటింది. తిన్నగా కోకిల యింటికి వెళ్ళటం మంచిదేమో! ఏమో, కోకిల ఎటువంటిదో!

తనకు సంభవించిన అనుభవాన్నిబట్టి ఆలోచిస్తే యీ పట్నంలో ఎవర్నీ నమ్మకూడదు అనిపిస్తోంది.

టాక్సీలోని వ్యక్తి తనకోసం వెతుకుతాడేమో! తను ధైర్యంగా వుండాలి! ఈ మహాపట్నంలో ధైర్యంవుంటే గాని బతకడం కష్టం.

పేవ్ మెంటమ్మట పోతూ ఆమె ఏదో బోర్డు చూసి ఆగింది. హోటల్ మిడ్ లాండ్, బోర్డింగ్ అండ్ లాడ్జింగ్ అని పెద్ద అక్షరాల్లో వుంది.

హోటల్లో అనేకమంది వుంటారు. అక్కడ గది తీసుకొని వుండడం మంచిదేమో!

ఆమె ఆలోచిస్తూ లోపలకు వెళ్ళింది, ముందు గదిలో కౌంటర్ వెనక వున్న గుమస్తా ఆమెవైపు చూశాడు.

"నాకు గది కావాలి" అందామె.

"ఎన్ని రోజులుంటారు?" అడిగాడు గుమస్తా.

"రేపు సాయంత్రం వెళ్ళిపోతాను."

"గదికి అద్దె 30 రూపాయలు. టిఫిన్, భోజనం వగైరా కావలిస్తే వాటికి వేరే డబ్బు చెల్లించాలి."

"ఆల్ రైట్."

అతడు పెద్ద బుక్కులో ఆమె వివరాలన్నీ రాసి, సంతకం పెట్టమన్నాడు. సంతకం పెట్టాక 30 రూపాయలు అడ్వాన్స్ యిమ్మన్నాడు. ఆమె యిచ్చింది.

అతడు ఒక తాళంచెవిని ఆమెకిచ్చాడు.

"రూమ్ నంబరు 20. కింద భాగంలోనే వుంది. అలా వెళ్ళి కుడివైపు తిరగండి. మీ గది వస్తుంది."

ఆమె వెనుతిరిగి నడిచింది. నడవమ్మట వెళ్ళి 20 నంబరు తాళం తెరిచి లోపలకు అడుగు పెట్టింది.

గది చిన్నదైనా శుభ్రంగా వుంది. యటాచ్‌డ్ బాత్ రూం వుంది. గది తలుపును మూసి, లోపల గడియను బిగించిందామె. కుర్చీలో కూర్చుని కాస్సేపు విశ్రాంతి తీసుకుంది.

అన్నయ్య రూపం ఆమె మెదడులో మెదిలింది. అతడు తనను బి.ఎ. దాకా చదివించాడు. తనకోసం ఎంతో కష్టపడుతున్నాడు. తన కోసం అతని సుఖాన్ని త్యాగం చేశాడు.

అందుకే ఆమె తెగించి మద్రాస్ వచ్చింది. తను కూడా ఎంతో కొంత గడిస్తే కుటుంబానికి వుపయోగపడ్తుంది. తన అన్నకొచ్చేది ఎనిమిదికందలే. అందులో ముగ్గురు జీవించాలి. ప్రతి నెలా అందులోంచి వంద రూపాయలు అన్నయ్య బ్యాంకిలో వేస్తాడు తన పెళ్ళి కోసం!

అన్నయ్య మంచి బట్టలు కూడా కొనుక్కోడు. పాత పాంట్లతో జీవితాన్ని గడిపేస్తున్నాడు.

తను డబ్బు గడించి కుటుంబ పరిస్థితిని మార్చాలి!

ఎవరో తలుపును తట్టారు. ఆమె త్రుళ్ళిపడ్తూ తన వూహాల్లోంచి మేలుకొంది.

మెల్లిగా వెళ్ళి తలుపును తెర్చింది. హోటలు నౌఖరు బయట నిలబడి వున్నాడు.

"మీకు భోజనం కావాలా?"

"మరో అరగంటలో గదికి పట్రా" అందామె.

అలాగే అని చెప్పి అతడు వెళ్ళిపోయాడు. ఆమె తలుపును మూసి గడియ పెట్టింది.

యటాచ్డ్ బాత్ రూమ్‌లోకి వెళ్ళి ఆమె హాయిగా స్నానం చేసింది. దుస్తులు మార్చుకుని ఆమె పరుపు మీద వాలింది.

తలుపు తట్టగానే ఆమె లేచింది. తలుపు తెరిచింది. హోటలు నౌఖరు పెద్ద ప్లేటులో భోజనం తెచ్చి టేబుల్ మీద వుంచాడు. కూజాలోని నీళ్ళు గ్లాసులో పోసి పక్కనే పెట్టాడు.

"చూడండి, మరేదైనా కావాలా?" అడిగాడతను.

ఆమె కంచంవైపు చూసింది.

"ఏమీ అక్కరలేదు. అరగంట తర్వాత వచ్చి నువ్వు ప్లేటు పట్టుకుపోవచ్చు" అందామె.

అతను బయటకు వెళ్ళిపోయాడు. ఆమె తలుపు మూసుకొని భోజనం చేయడం ప్రారంభించింది. ఇప్పుడామెకు ధైర్యంగా వుంది. ఆకలితో ఆమె తినసాగింది.

## 5

సరిగ్గా తొమ్మిదిన్నరకి లీల మోడర్న్ యింజనీరింగ్ కంపెనీ ఆఫీసుకు చేరుకుంది.

విశాలమైన ముందు హాల్లో ఒక యువకుడు ఆమెకు ఎదురయ్యాడు. ఆమెవైపు అతను ఆశ్చర్యంగా చూశాడు.

"మీరు స్టెనోగ్రాఫర్ ఉద్యోగానికి వచ్చారా?" తీయటి కంఠంతో అడిగాడతను.

"అవును. నా పేరు లీల. విజయవాడనుంచి వచ్చాను" అందామె.

ఆమెను తనతో రమ్మన్నాడతను. అతడి వెనకనే ఆమె నడుస్తోంది.

"నా పేరు ఆనందమోహన్. నేను యీ కంపెనీ

అధిపతికి పెర్సనల్ అసిస్టెంట్ గా వుంటున్నాను" అన్నాడతను.

"వెరీ హేపీ టు మీట్ యు" అందామె.

ఒక గదిలోకి అతడామెను తీసుకువెళ్ళాడు. గదిలో వందమంది యువతులు కుర్చీల్లో కూర్చుని వున్నారు.

వాళ్ళను చూసి ఆమె ఉలిక్కిపడింది. అతడి వంక చూసింది.

"ఒక ఉద్యోగానికి యింతమంది కాండిడేట్సా?" అడిగింది ఆశ్చర్యంగా.

"మా కంపెనీ చాలా పెద్దది. స్టెనో టైపిస్టుకి ఇక్కడ 1200 యిస్తారు. అందువలన ఎక్కువమంది వస్తారు" అన్నాడతను.

గుమ్మంలో నిలబడి ఆమె అందరివైపూ చూసింది. అంతమందిలో తనకు ఉద్యోగం వచ్చే అవకాశం తక్కువ. తను అనవసరంగా ఇంతదూరం వచ్చింది. రైలు ఖర్చు, హోటలు ఖర్చు దండగ.

"మిస్ లీలా, మీరు వెళ్ళి కుర్చీలో కూర్చోండి."

"ఆమె వెనుదిరిగి అతడివంక చూసింది.

"ఈ ఇంటర్వ్యూ అవడానికి ఎంత టైము పడ్తుంది?" అడిగిందామె.

"కాండిడేట్స్ ఎక్కువమంది వున్నారుగా, అందువలన కండెన్స్‌డ్ టెస్టు పెడ్తారు. ఆ టెస్టులో చాలా మంది ఫిల్టరయిపోతారు. ఐదుగురో, ఆరుగురో మిగుల్తారు. వాళ్ళకు వేరే టెస్టు వుంటుంది. అందులో ఎన్నికైన యిద్దరికి యిక్కడ ఉద్యోగాలిస్తారు."

ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది.

"మిమ్మల్ని మరువడం కష్టం. మీరు చాలా సహాయ

పడ్తున్నారు. నాకు ఏదేనా ఛాన్స్ వుంటుందంటారా?"

అతను నవ్వాడు. యువకుడు హుషారుగా, స్మార్టుగా వున్నాడు.

"పి శ్ళం ద ర్శి మాసి ఛాన్స్ లేదనుకోకూడదు. మూడేళ్ళ క్రితం నేను యింటర్వ్యూకి వచ్చినపుడు 500 మంది కాండిడేట్స్ వున్నారు. మీలాగే నేను ఆంధ్రా నుంచి వచ్చాను, కాకినాడనుంచి. చివరకి ఉద్యోగం నాకొచ్చింది. అలా లక్ మీకూ రావచ్చు!"

"మీ మాటలు ఫలిస్తాయేమో, చూద్దాం" అని ఆమె ఖాళీ కుర్చీలో వెళ్ళి కూర్చుంది.

టెస్టులన్నీ పూర్తయినాయి. సరిగ్గా మూడింటికి లీల ప్రొప్రయిటర్ దస్తూర్ గదిలోకి వెళ్ళింది.

దస్తూర్ ముందున్న టేబులు మీద ఆరు టెలిఫోనులు వున్నాయి. అతని వయస్సు యాభై వుంటుంది. అతడు ఆమెకేసి నవ్వుతూ చూశాడు.

"మిస్ లీలా, నీకు జాబ్ యిస్తాం....వచ్చే నెల ఫస్టు నుంచి నువ్వు డ్యూటీలో చేరొచ్చు. అపాయింట్మెంట్ ఉత్తరం నీ అడ్రెస్కు పోస్టులో పంపుతాం. కంగ్రాట్యులేషన్స్!" అన్నాడతను.

ఆమె నోటమ్మట మాట పెగల్లేదు. ఆమె హృదయం ఆనందంతో నిండి పోయింది. అమాంతంగా గాలిలో ఎగరాలనిపించిందామెకు.

"చాలా థాంక్స్ సార్" అందామె.

"ఈ సమయంలో నీకు ఒక సలహా యిస్తున్నాను. మా కంపెనీలో చేరినవాళ్ళు యావజ్జీవితం యిక్కడే వుండిపోతారు. మరో చోటకు వెళ్ళరు. ఇక్కడ చేరాక నువ్వు వేరే ఉద్యోగాలకోసం అన్వేషించకూడదు.

అందరికంటె మేం జీతాలు ఎక్కువగా యిస్తాం. అంతే కాదు. మా కంపెనీలో పనిచేసేవారికి అనేక సౌకర్యాలు మేం చేకూర్చుతాం."

"నేను మరోచోటకు వెళ్ళను సార్" అంది లీల.

"నీకు మేం ఫ్లాట్ యిస్తాం. మా వాన్‌లో నువ్వు ఆఫీసుకు రావచ్చు. అదే వాన్‌లో యింటికి వెళ్ళొచ్చు. ఇదంతా నీకు మా ఉత్తరంలో తెలియజేస్తాం" అన్నాడతను.

"మీ కంపెనీలో ఉద్యోగం దొరకడం నా అదృష్టంగా భావిస్తున్నాను, సార్."

ఆనందమోహన్ గదిలోకొచ్చి అధిపతి పక్కకు వెళ్ళాడు.

"ఈ పిల్ల తప్ప తతిమ్మవాళ్ళు నాకు నచ్చలేదు. వాళ్ళను వెళ్ళిపోమను" అన్నాడు దస్తూర్.

"మిస్ మాణిక్యం మినిష్టర్ రికమెండేషన్‌లో వచ్చింది సార్" ఆనందమోహన్ జ్ఞాపకం చేశాడు.

దస్తూర్ నవ్వాడు.

"మిస్ మాణిక్యానికి ఉద్యోగం ఇవ్వడంకంటె మినిష్టర్‌కు డొనేషన్ యివ్వడం మంచిది" అన్నాడు దస్తూర్.

దస్తూర్‌కు నమస్కరించి లీల ఏర్‌కండిషండ్ గదిలోంచి బయటకు నడిచింది. ఆనందమోహన్ ముందు హాల్లో ఆమె దగ్గరకొచ్చాడు. యిద్దరూ బయటకు నడిచారు

"జయించారు, కాంగ్రాట్స్!" అన్నాడతను.

"నా గెలుపుకోసం మీరు చాలా పాటుపడి వుంటారు. మీకు నా ధన్యవాదాలు" అందామె.

అతడు నవ్వాడు.

"మా కంపెనీలో మెరిట్‌కి విలువ ఎక్కువ ఇస్తారు దస్తూర్. మీ శక్తితో మీరు విజయాన్ని సాధించారు. నాకు చాలా సంతోషంగా వుంది" అంటూ అతడి విజిటింగ్ కార్డును ఆమెకిచ్చాడు.

కార్డును ఆమె హేండ్ బాగ్‌లో పడేసుకుంది.

ఇద్దరూ రోడ్డమ్మట నడవసాగారు.

"మీరు ఎక్కడుంటున్నారు?"

"హోటల్ మిడ్‌లాండ్‌లో. రూమ్ నంబరు 20"

అతడు ఆమెవంక చూశాడు.

"మిమ్మల్ని చూడగానే యీ ఉద్యోగం మీకు వస్తుందని నా కనిపించింది."

"ఎందుకలా అనుకున్నారు?"

"మీ మొహంలో ఏదో కళ వుంది. మీరున్నచోట లక్ష్మి నివశిస్తుందనిపిస్తోంది."

"బాగా పొగుడుతున్నారు" అందామె.

కొంతసేపు యిద్దరూ మౌనంగా నడిచారు.

"హోటల్ దగ్గరికి వచ్చి మిమ్మల్ని చూడొచ్చా?"

"నేను రాత్రి మెయిల్లో వెళ్ళిపోతున్నాను."

"స్టేషన్ దాకా వచ్చి మిమ్మల్ని సాగనంపుతాను"

"తప్పక రండి. ఎప్పుడొస్తారు?"

"ఆఫీసులో మరికొంత పనుంది. సరిగ్గా ఆరింటికి వస్తాను."

"మీరాక కోసం ఎదురు చూస్తూ వుంటాను" అందామె.

ఆమెను బస్సు ఎక్కించి అతను తన ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

లీల తన హోటల్ దగ్గరికి చేరుకునేసరికి నాలుగున్నర

కావస్తోంది. ఆనందంతో ఆమె పరుపు మీద వాలిపో యింది.

## 6

లీల తలుపు తెర్చింది. బయట నిలబడిన హోటల్ నౌఖరువైపు చూసింది.

"మీకోసం ఎవరో ఫోన్ చేశారు" అన్నాడతడు.

తనకోసం యెవరు ఫోన్ చేసి వుంటారు? ఆనంద మోహనా? ఆలోచిస్తూ ఆమె బయటకు వెళ్ళింది.

ముందు గదిలో వున్న ఫోన్ వద్దకు వెళ్ళి రిసీవర్ని అందుకుంది.

"హలో, లీల స్పీకింగ్! ఎవరు?"

"నేనమ్మా కాంతారావుని" అందో కంఠం.

"అంకుల్, మీరా!" అందామె ఆశ్చర్యంగా.

"ఏమిటమ్మా, అలా చేశావు? నా ఫ్రెండ్ రామ్మూర్తిని స్టేషన్ కి పంపాను. అతను ఇక్కడకు తీసుకొస్తూంటే టాక్సీలోంచి దిగి ఎక్కడికో వెళ్ళిపో యావట! అతడొచ్చి నాముందు ఏడుస్తూ కూర్చున్నాడు. రాత్రంతా మాకు నిద్రలేదు. నీకోసం వెతుకుతూనే వున్నాం. నువ్వు ఆ హోటల్లో వున్నావని తెలిసి అక్కడకు ఫోన్ చేశాను."

"సారీ అంకుల్! నాకు ఎందుకో భయంవేసింది. అందుకే వెళ్ళిపోయాను."

"ఎందుకు భయం? ఇక్కడ నేనున్నానుగా?" అన్నా డతను.

"స్టేషన్ కి మీ యిల్లు దగ్గరగా వుంటుందని అన్నయ్య చెప్పాడు. ఇరవై నిమిషాలు టాక్సీ వెళ్ళినా మీ యిల్లు రాలేదు. అందుమూలంగా నాకు అనుమానం వచ్చింది"

అందామె.

"లీలా, నేను ఇల్లు మారాను. అది మీకు తెలియదు. నేను జ్వరంతో పడున్నాను. నా ఫ్రెండ్‌ను పంపాను."

"ఐయామ్ సారీ, అంకుల్!"

"అయిందేదో అయిపోయింది. నా ఫ్రెండ్ కారు నీకు పంపుతున్నాను. నువ్వు వెంటనే యిక్కడకు రా!"

"ఇప్పుడు నేను రాలేను, అంకుల్! ఆరు గంటలకు నాకు పనుంది" అందామె.

"లీలా, ఇప్పుడు ఐదు కావస్తోంది. నేను పంపిన కార్లో వెంటనే వచ్చేయి. ఆరులోపల నిన్ను హోటల్‌కి పంపేస్తాను. నువ్వు వస్తేగాని నాకు నిద్రపట్టదు!"

"మీ యిల్లు ఎక్కడుంది?"

"నార్త్ జగన్నాధ నగర్, స్ట్రీట్ నంబర్ 9, బిల్డింగ్ నంబర్ 95. ఇది నా కొత్త అడ్రెసు."

"అలాగే వస్తాను, అంకుల్" అందామె.

"కారు యిప్పుడే బయల్దేరింది. కాస్సేపట్లో అక్కడికొస్తుంది. దానిలో కూర్చుని వెంటనే వచ్చేయి."

"తప్పక వస్తాను" అందామె.

"లీలా, నీ రాకకోసం ఎదురు చూస్తూ వుంటాను" అని అతడు రిసీవర్ని పెట్టేశాడు.

ఆమె రిసీవర్ని పెట్టేసింది. అప్పుడే ఒకతను ముందు హాల్లోకి వచ్చాడు.

"ఇక్కడ లీల అనే యువతి ఎవరైనా వున్నారా?" అడిగాడతను.

ఆమె అతడి ముందుకు వెళ్ళింది.

"లీల నేనే" అందామె.

"మీకోసం కాంతారావుగారు కారు పంపారు"

అన్నాడతను.

ఆమె బయటకు వెళ్ళి కారువైపు చూసింది. కారు నంబర్ని గుర్తుంచుకుంది. హాల్లోకొచ్చి టైమ్ చూసింది. 5-15 అయింది. ఆరింటికి ఆనందమోహన్ వస్తానన్నాడు. అతడికి ఫోన్ చేయడం మంచిదేమో!

ఆమె టెలిఫోను డైరెక్టరీ చూసింది. మోడర్న్ యింజనీరింగ్ కంపెనీ నంబర్ కి ఫోన్ చేసింది.

"హాలో!" అందో స్త్రీ కంఠం.

"హాలో, మిస్టర్ ఆనందమోహన్ తో మాట్లాడాలి" అందామె.

కాస్సేపట్లో ఆమెకు కనెక్షన్ వచ్చింది.

"హాలో, ఆనందమోహన్!" అన్నాడతను.

"నేను, లీలని!" అందామె.

"మీరు నాకు ఫోన్ చేసినందుకు సంతోషిస్తున్నాను. చెప్పండి" అన్నాడతను.

"నేను అంకుల్ కాంతారావు యింటికి వెళ్తున్నాను. అతను నారు జగన్నాథ నగర్ లో వున్నాడు. 9వ స్ట్రీట్, నంబర్ 95 యిల్లు. అతిడు నాకోసం ఫియట్ కారు పంపాడు. కారు నంబర్ TMX 3006. ఆరు గంటల లోపల నేను రావడానికి ప్రయత్నిస్తాను. ఆలస్యమైనా మీరు వెళ్ళిపోకండి. నేను వచ్చినదాకా వుండండి" అందామె.

"లీలా, అక్కడకు వెళ్ళక తప్పదా?" అడిగాడతను.

"వెళ్ళితీరాలి" అందామె.

"లీలా, వెళ్ళిరండి. మీరు వచ్చినదాకా మీ హోటల్లో వేచివుంటాను."

"థాంక్స్" అని ఆమె రిసీవర్ని పెట్టేసింది.

ఆమె వెళ్ళి తన గదికి తాళంవేసింది. బయటకు నడిచి ఫియట్ కార్లో ఎక్కింది. డ్రయివర్ కారును వేగంగా పోనిచ్చాడు.

## 7

గేటు దాటి కాంపౌండులోకి ప్రవేశించింది. పోర్టికో కింద కారు ఆగింది. తలుపు తెరిచి ఆమె కిందకు దిగింది.

వరండాలో రామ్మూర్తి నిలబడి వున్నాడు.

"మీరా? కాంతారావుగారు ఏరీ?" అందామె.

"రామ్మా, ఆయన లోపల వున్నారు" అన్నాడతను.

ఆమె లోపలకు వెళ్ళింది.

"ఆయన ఆరోగ్యం బాగాలేదు. ఆయన ఆ గదిలో వున్నారు" అన్నాడు రామ్మూర్తి.

ఆమె ఆత్రంగా ఆ గదిలోకి వెళ్ళింది. గదిలో ఎవ్వరూ లేరు. ఆమె తృళ్ళిపడింది. వెనక్కు తిరిగింది. గుమ్మంలో రామ్మూర్తి నిలబడి వున్నాడు.

"కాంతారావుగారు యిక్కడలేరే?" అందామె.

రామ్మూర్తి గంభీరంగా నవ్వాడు. తలుపులు మూశాడు. ఆమెవైపు తీక్షణంగా చూశాడు.

"లీలా, నన్ను మోసంచేసి పారిపోయావు! నిన్ను మోసంచేసి యిక్కడకు రప్పించాను" అన్నాడతను.

ఆమె గుండె దడదడలాడింది. అతడివంక ఆమె సూటిగా చూసింది.

"నీకేం కావాలి?" అందామె.

"నువ్వు కావాలి! నీ అందం కావాలి" అన్నాడతను.

"నేను యిక్కడకు వచ్చినట్లు ఆనందమోహన్‌తో చెప్పాను. నేను హోటల్‌కి తిరిగి వెళ్ళకపోతే అతడు వూరుకోడు. పోలీసులతో ఇక్కడకు వస్తాడు" అందామె.

అతడు పిశాచంలా నవ్వాడు.

"అతడు యిక్కడకు రాలేదు. నేను నీకు యిచ్చిన అడ్రెస్ యీ యింటిదికాదు!"

"లయ్యర్!" అర్చిందామె.

అతడు ఆమెవైపు విషపూరితమైన నవ్వుతో చూశాడు.

"లీలా, నువ్వు నా అతిథివి! నీకు కావలసినవన్నీ నేను సమకూరుస్తాను. నువ్వు మళ్ళా హోటల్ కి వెళ్ళవు!"

"ఇక్కడే వుంటూగా?" ప్రశ్నించిందామె.

"ఎక్కడకు వెళ్తావో నాకు తెలియదు. గుడ్ నైట్!" అని అతడు వెళ్ళిపోయాడు.

తలుపు మూయబడింది. అటువైపునుంచి తాళంవేసినట్లు ఏదో చప్పుడైంది.

గదిలో లైటు వెల్గుతోంది. ఏడుస్తూ లీల మంచం మీద వాలిపోయింది.

# 8

ఆనందమోహన్ సరిగ్గా ఆరింటికి ఆమె హోటల్ కి చేరుకున్నాడు. ఇరవై నంబరు గదికి వెళ్ళి అతను చూశాడు.

గదికి తాళంవేసివుంది. అతను ముందు హాల్లో వున్న సోఫాలో కూర్చున్నాడు. సిగరెట్ పీలుస్తూ ఆమెకోసం చూస్తూ వుండి పోయాడు.

టైమ్ ఎనిమిది దాటింది. అయినా ఆమె రాలేదు. అతడు విసుగ్గా లేచాడు. ఆమె ఇంకా ఎందుకు రాలేదు?

మరి కొంతసేపు ఆమె రాకకోసం అతను చూశాడు. ఎంతసేపు చూసినా ఆమె రాలేదు. ఆమె తన అంకుల్ శాంతారావు యింట్లో వుండొచ్చు!

ఆనందమోహన్ బయటకు నడిచాడు. తన స్కూటర్ని

నాడు జగన్నాథ నగర్ వైపు పోనిచ్చాడు.

పట్నానికి దూరంగా వుంది ఆ నగర్. తొమ్మిదవ వీధమ్మట స్కూటర్ని పోనిస్తూ అతడు 95 నంబరు ఇంటి ముందు ఆపి, కిందకు దిగాడు.

స్కూటర్ చప్పుడు విని ఆ యింట్లోని మనిషి గేటు దగ్గరకు వచ్చాడు. ఆనందమోహన్ అతడివంక చూశాడు.

"కాంతారావు యిక్కడ వుంటున్నారా?" అడిగాడతను.

"ఆ పేరుతో ఇక్కడ ఎవ్వరూ లేరు" అన్నాడా మనిషి.

ఆనందమోహన్ మేడవైపు చూశాడు.

"ఈ మేడ ఎవరిది?"

"నాదే. నా పేరు అల్మాగం. పైనా, కిందా నేనే వుంటున్నాను. నేనెవరికీ అద్దెకివ్వలేదు" అన్నాడతను.

ఆనందమోహన్ ఇంటి నంబర్ మళ్ళా చూశాడు. 95! సందేహంలేదు. ఆమె ఇక్కడకు రాలేదు. కాంతారావు ఇల్లు ఇదికాదు. ఆమె యీ అడ్రెసు తనకు ఎందుకిచ్చింది?

లీల తనకు రాంగ్ అడ్రెస్ ఇవ్వదని అతని విశ్వాసం. ఈ అడ్రెస్ యెవరో ఆమెతో చెప్తే ఆమె తనతో చెప్పిందా?

కాంతారావు ఎక్కడుంటున్నాడు? ఈ అడ్రెస్ ఆమెతో చెప్పి కాంతారావు ఆమెను మరెక్కడికో తీసుకువెళ్ళాడా? ఆనందమోహన్ ఆలోచిస్తూ స్కూటర్ దగ్గరకు నడిచాడు.

సిగరెట్ వెలిగించి ఆలోచిస్తూ నిలబడ్డాడు. కాంతారావు అడ్రెసు, అతడు పంపిన కారు నంబరు ఆమె

అతడికిచ్చింది. అతన్ని ఎందుకిచ్చింది? లోలోపల అను మానపడూ ఆమె ఆ కారులో వెళ్ళిందా?

అతడు స్కూటర్ని స్టార్టుచేసి పోనిచ్చాడు. ఈ పాటికి ఆమె హోటల్ కి వచ్చి వుంటుందేమో! అతడు స్కూటర్ని వేగంగా ఆమె హోటల్ కి పోనిచ్చాడు.

స్కూటర్ దిగి ముందు హాల్లోకి వెళ్ళాడు. కౌంటర్ వెనకనున్న గుమస్తా వెపు చూశాడు.

"లీల తన గదికి వచ్చిందా?" అడిగాడు.

"ఇంకా రాలేదు, సార్" అన్నాడు గుమస్తా.

ఆ వార్త వినగానే అతడి గుండె దడదడ కొట్టు కుంది. అతడు టైమ్ చూశాడు. పది దాటింది. రాత్రి ట్రెయిన్ లో తన ఊరుకు వెళ్తానని ఆమె తనతో చెప్పింది. కాని ఆమె వెళ్ళలేదు. ఆమె ఎందుకు వెళ్ళలేదు? జనని రమ్మని ఆమె గదిలో ఎందుకు లేదు?

ఆమె ఏదో ఆపదలో యిరుక్కుని వుండాలి. ఆనంద మోహన్ కౌంటర్ ముందుకు వెళ్ళి గుమస్తావంక చూశాడు.

"లీలకోసం ఎవరొచ్చారు?"

"ఎవరో ఆమెతో ఫోన్ లో మాట్లాడారు. తర్వాత కారు వచ్చింది. డ్రయివర్ తో బయటకు వెళ్ళి ఆమె కారెక్కింది."

"వెళ్ళేటప్పుడు ఆమె మొహం ఎలా వుంది? నవ్వుతూ వుందా?"

"ఆమె మొహంలో నవ్వులేదు. విచారమూ లేదు. ఏదో ఆలోచిస్తున్నట్లు వుంది" అన్నాడు గుమస్తా.

"కారు రాగానే ఆమె వెళ్ళిపోయిందా?" అడిగాడు ఆనందమోహన్.

"ఆమె ఫోన్ చేసి ఎవరితోనో మాట్లాడింది, సార్,

తర్వాత ఆమె కారులో వెళ్ళిపోయింది."

ఆమె తనకు ఫోన్ చేసింది. ఆలోచిస్తూ ఆనందమోహన్ సిగరెట్ వెలిగించాడు. పొగ పీల్చి వదుల్తూ తన స్కూటర్ వైపు నడిచాడు.

ఇంటర్వ్యూకి వచ్చిన లీలతో మాట్లాడాక ఆమె అప్లికేషన్ మరోసారి చూశాడతను. ఆమె విజయవాడ అడ్రెస్ ముద్రించినట్లు అతడి మెదడులో నిల్చిపోయింది. ఆమె యింటికి టెలిగ్రామ్ యివ్వడం మంచిదేమో! టెలిగ్రాం ఇస్తే అక్కడివాళ్ళు ఖంగారు పడ్తారు.

మద్రాసుకు ఒంటరిగా వచ్చిన యువతి కాంతారావు బాగా తెలిస్తేగాని అతడింటికి వెళ్ళదు. కాంతారావు బాగా తెలిస్తే ఆమె హోటల్లో గది ఎందుకు తీసుకుంది?

స్కూటర్ని అతడు పోనిచ్చాడు. రోడ్డు లైట్లు వెల్గుతున్నాయి. అతడు మెల్లిగా స్కూటర్ని పోనిస్తున్నాడు. లీలకోసం అతడికళ్ళు వెతుకుతున్నాయి. కాని ఎక్కడా ఆమె అతడికి కనబడలేదు. పన్నెండు తర్వాత అతడు మళ్ళా ఆమె హోటల్కు చేరుకున్నాడు.

ముందు హాల్లో ఎవ్వరూ లేరు. హోటల్ బయట వాచ్మన్ పచార్లు చేస్తున్నాడు.

ఆనందమోహన్ ఆమె గదివైపు వెళ్ళాడు. తలుపుకు తాళంవేసి వుంది. ఆమె యింకా రాలేదు!

అతడు బయటకు కదిలాడు. పన్నెండు దాటింది. ఈ రాత్రి తను ఏమీ చేయలేదు. ఆ కారు యెవరిదో కనుక్కోవాలి!

ఆనందమోహన్ తన గదికి వెళ్ళిపోయాడు. తిండి తిన బుద్ధి కాలేదు. రాత్రంతా జాగారంచేస్తూ అతడు గడిపేశాడు.

పొద్దుటే హోటల్ మిడ్‌లాండ్‌కి ఫోన్ చేశాడు.

"హల్లో, హోటల్ మిడ్‌లాండ్" అందో కంఠం.

"హలో, 20 నంబరు గదిలో వుండే లీల వచ్చిందా?" ప్రశ్నించాడు.

"ఆమె రాలేదు సార్. కాని ఒకతను వచ్చాడు. మాకు రావలసిన డబ్బు చెల్లించి గది ఖాళీచేసి, ఆమె ఏర్ బాగ్ తీసుకొని వెళ్ళిపోయాడు" అన్నాడు గుమస్తా.

"అతడు ఏమైనా చెప్పాడా?"

"ఆమె యివాళ వాళ్ళ ఊరుకు వెళ్తోందట"

"అతని పేరు చెప్పాడా?"

"కాంతారావు."

కాంతారావు! ఆనందమోహన్ ఉలిక్కిపడ్డాడు. లీల విజయవాడ వెళ్ళిపోయిందా? అంతా అగమ్యగోచరంగా వుంది.

ఆనందమోహన్ కుర్చీలో కూర్చుని ఆలోచించ సాగాడు. ఆమెను గురించి తనింతగా బాధపడ్డం అనవసరమేమో!

ఆమె యింటర్‌వ్యూకి వచ్చింది. తర్వాత తను వస్తానంటే గదికి రమ్మంది. ఆమెతో తనకంతగా పరిచయం లేదు. ఆమెను గురించి తను యింతగా దిగులుపడ్డం వృధా అనిపించింది.

కాని ఎంత ప్రయత్నించినా లీల రూపం అతడి మెదడులోంచి తొలగిపోవడంలేదు. ఆమెను మొదటిసారి చూడగానే తన హృదయంలో ఏదో జ్యోతి వెలిగినట్లు అనిపించింది. ఆమెను అతడు మర్చిపోవడం కష్టమేమో!

ఆనందమోహన్ తనఆఫీసుకు చేరుకున్నాడు. తను చేయ గలిగింది ప్రస్తుతం ఏమీ లేదు. త్వరలో వచ్చి తన ఉద్యో

గంలో చేరుంది. జరిగినదంతా అప్పుడు ఆమే చెప్తుంది.

తన పనిలో అతడు నిమగ్నుడైపోయాడు. కంపెనీ టెలిఫోన్‌లు రెండు అతడి టేబులు మీద వున్నాయి. టెలిఫోన్ మ్రోగింది. అతడు రిసీవర్ని ఎత్తాడు.

"మోడర్న్ యింజనీరింగ్ కంపెనీ!" అన్నాడతను.

"హలో, నేను విజయవాడనుంచి మాట్లాడుతున్నాను. నా పేరు రామరాజు. నా చెల్లెలు లీల స్టెనో టైపిస్టు ఉద్యోగంకోసం ఇంటర్‌వ్యూకి అక్కడికి వొచ్చింది. ఆమె నిన్న రాత్రే బయలుదేరి యిక్కడకు రావాలి. కాని ఆమె రాలేదు. నాకు చాలా గాభరాగా వుంది సార్"

"రామరాజుగారూ, లీల యింటర్‌వ్యూకి వచ్చింది. గుడ్ న్యూస్, ఆమెకు ఉద్యోగం వచ్చింది, మా కంపెనీలో. ఆమె మద్రాసులో వున్న కాంతారావు ఇంటికి వెళ్ళిందని విన్నాను" అన్నాడు ఆనందమోహన్.

"అయితే ఫరవాలేదు! వాడు దాన్ని రెండుమూడు రోజులు వుండమని వుంటాడు."

"కాంతారావు అడ్రెస్ చెప్తారా?"

"నంబర్ 10, చిన్నతంబీ స్ట్రీట్, ట్రిప్లికేన్. మీరు లీలను కలుసుకుంటే నేను ఫోన్ చేసినట్లు చెప్పండి. తొందరగా వచ్చేయమనండి. అమ్మ బెంగ పెట్టుకుంది."

"అలాగే చెప్తాను."

"తమ పేరు?"

"ఆనందమోహన్! మీరు యిచ్చిన అడ్రెసుకు వెళ్ళి ఆమెకు అంతా చెప్తాను. అవుసరమైతే నేను మీకు ఫోన్ చేయవచ్చా?"

"పొద్దుట 9 నుంచి సాయంత్రం 5 దాకా నేను ఆఫీసులో వుంటాను సార్. మాది కృష్ణా కెమికల్స

కంపెనీ. మీరు యెప్పుడు కావలసినా నాకు ఫోన్ చేయవచ్చు. అకౌంటెంట్ రామరాజు అని అడగండి” అని అతడు రెండు టెలిఫోన్ నెంబర్లు యిచ్చాడు.

ఆ నంబర్లను ఆనందమోహన్ తన డైరీలో రాసుకున్నాడు.

“ఆనందమోహన్ గారూ, ఇంత స్నేహ భావంతో మాట్లాడినందుకు మీకు నా ధన్యవాదాలు. మిమ్మల్ని ఎప్పుడో అప్పుడు కలుసుకుంటానని ఆశిస్తున్నాను.”

“దానికేముంది సార్! మీ చెల్లెలు ఇక్కడ ఉద్యోగంలో చేరుతుందిగా, అప్పుడు మిమ్మల్ని చూసే అవకాశం నాకు లభిస్తుంది.”

“వుంటాను, సార్” అని రామరాజు రిసీవర్ని పెట్టేశాడు.

ఆనందమోహన్ వుషారుగా కుర్చీలోంచి లేచి బయటకు నడిచాడు. తన స్కూటర్ని ట్రిప్లికేన్ వైపు వుషారుగా పోనిచ్చాడు.

ఆమె బహ్మాండంగా నాటకమాడి తనని ఫూల్ చేసింది. ఆరింటికి రమ్మని ఎక్కడికో పోయింది. ఏదో కారు నంబరూ, రాంగ్ అడ్రెసూ యిచ్చి అతడికి నిద్ర లేకుండా చేసింది.

కాంతారావు యింటి ముందు తన స్కూటర్ ఆగ్గానే ఆమె తృళ్ళిపడుతుంది. ఆ అడ్రెసు తనకెలా తెలుసా అని ఆమె ఆశ్చర్యపోతుంది. ఆనందమోహన్ తన స్కూటర్ని వేగంగా పోనిచ్చాడు.

# 9

మెయిన్ రోడ్డు మీదనుంచి ఎడంవైపునున్న చిన్న తంబూ స్ట్రీట్‌లోకి స్కూటర్ని అతను పోనిచ్చాడు.

పదో నంబరు ఇంటిముందు స్కూటర్ ఆపి ఆనందమోహన్ కిందకు దిగాడు.

పాతబడిన యిల్లు. ముందు మెట్లెక్కి అతను వరండా మీదకు వెళ్ళాడు. హాల్లోకి చూస్తూ అతను బయట నిలబడ్డాడు. తలుపు మీద తట్టాడు. తువ్వాలు చుట్టుకుని ఒకతను హాల్లోకొచ్చి అతడి వంక చూశాడు.

"కాంతారావుగారి యిల్లు యిదేనా?"

"ఇదే సార్. కాంతారావు నేనే" అన్నాడతను.

ఆనందమోహన్ చూపు లోపలకు వెళ్ళింది. లీల లోపల గదుల్లో వుండి వుండాలి!

"లీల యిక్కడే వుందిగా?"

కాంతారావు నల్ల మొహం ఆశ్చర్యంగా అతడివైపు చూసింది.

"లీల ఇక్కడకు రాలేదే! అది మద్రాసు వచ్చిందా? రామరాజు ఉత్తరం కూడా రాయలేదే!"

ఆనందమోహన్ గుండె దడదడ కొట్టుకుంది. ఆమె తనతో నాటకం ఆడలేదు. ఏదో మోసం జరిగింది.

"కాంతారావుగారూ, లీల మీ ఇంట్లో వుంటుందని రామరాజు ఫోన్ చేసి నాతో చెప్పారు."

"అది ఇక్కడకు రానేలేదు. అంతా విచిత్రంగా వుంది" అన్నాడు కాంతారావు.

"నేను చెప్పేది జాగ్రత్తగా వినండి. నేను మోడర్న ఇంజనీరింగ్ కంపెనీలో పనిచేస్తున్నాను. మా కంపెనీలో ఇంటర్వ్యూకి లీల నిన్న వచ్చింది. హోటల్ మిడ్ లాండ్‌లో ఆమె గది తీసుకొని వుంది...."

"నేనిక్కడుండగా ఆమె హోటల్లో గది యెందుకు

తీసుకుంది?"

"అదంతా ప్రస్తుతం నాకు తెలియదు. నిన్న సాయంత్రం 6 గంటలకు ఆమె నన్ను తన హోటల్ గదికి రమ్మంది. నే వెళ్ళేసరికి ఆమెలేదు. కాంతారావు ఆమెకు ఫోన్ చేసి కారు పంపాడు. ఆ కారులో వెళ్ళి పోయింది. ఆ కారులో వెళ్లేముందు ఆమె నాకు ఫోన్ చేసింది. ఎక్కడకు వెళ్తున్నదీ, ఏ కారులో వెళ్తున్నదీ ఆమె నాకు చెప్పింది."

"ఎవడా కాంతారావు? వాడి అడ్రెస్ ఎక్కడ?"

"అతడిచ్చిన అడ్రెస్‌కు నేను వెళ్ళి చూశాను. అక్కడ కాంతారావు అనేవాడు లేడు."

"గుడ్ గాడ్!" అర్చాడు కాంతారావు.

"మీ పేరుతో యెవరో ఫోన్ చేసి, కారు పంపి ఆమెను తీసుకుపోయారు. ఆమె ఏమైందో మనం కను క్కోవాలి!"

కాంతారావు విచారవదనంతో అతడివైపు చూశాడు.

"రామరాజుకి చెల్లెలంటే ప్రాణం. మనం ఏదో వెంటనే చెయ్యాలి" అని అతడు లోపలకు పరుగెత్తాడు.

కాస్సేపట్లో పాంటు, స్లాక్ ధరించి అతడు హాల్లో కొచ్చాడు. ఆనందమోహన్ హాల్లో పచార్లు చేస్తున్నాడు.

"పదండి, వెళ్దాం" అన్నాడు కాంతారావు.

ఇద్దరూ బయటకు నడిచారు. ఆనందమోహన్ స్కూటర్ని తన ఆఫీసుకు పోనిచ్చాడు. వెనుక సీటుమీద కాంతారావు కూర్చున్నాడు.

ఆఫీసు చేరుకోగానే కాంతారావును ఒక కుర్చీలో కూర్చోమని ఆనందమోహన్ తన బాస్ ఏర్‌కండిషండ్ గదిలోకి వెళ్ళాడు.

దస్తూర్ అతడివైపు నవ్వుతూ చూశాడు.

"సార్, నిన్న మీరు సెలక్టు చేసిన అమ్మాయి లీలను యెవరో ఎత్తుకుపోయారు!" అన్నాడతను.

దస్తూర్ ఆశ్చర్యపోయాడు. అంతా ఆనందమోహన్ వివరంగా చెప్పాడు.

"ఆనంద్, నేను సెలక్టు చేసిన నిమిషంనుంచీ ఆమెను మన కంపెనీ స్టాఫ్ మెంబరుగానే భావించాలి. ఆమె మాయమైతే మనకు అమర్యాద. ఎంతైనా ఖర్చుపెట్టు! ఆమె ఏమైందో కనుక్కో—" అన్నాడు దస్తూర్.

"అలాగే సార్!" అన్నాడు ఆనందమోహన్.

"కావలసినచోట నా పేరు ఉపయోగించు! తొందరగా పనిలోకి దిగు" అని దస్తూర్ అతడిని తరిమేశాడు.

# 10

తన ఆఫీసు కుర్చీలో కూర్చుని ఆనందమోహన్ విజయవాడకు ఎస్.టి.డి. కాల్ చేశాడు.

"కృష్ణా కెమికల్స్ కంపెనీ! అందో కంఠం అటువైపునుంచి.

"నేను మద్రాసునుంచి ఫోన్ చేస్తున్నా. మీ అకౌంటెంట్ రామరాజుగారితో మాట్లాడాలి."

కాస్సేపట్లో రామరాజు అటువైపున వచ్చాడు.

"హలో రామరాజు స్పీకింగ్!"

"నేను ఆనందమోహన్! మీ ఫ్రెండ్ కాంతారావుగారు నా ముందు వున్నారు. లీల ఆ ఇంట్లో లేదు. ఏమైందో కనుక్కోడానికి ప్రయత్నిస్తున్నాం."

"హలో, లీల ఏమైంది? ఏదీ దాచకుండా చెప్పండి!" అర్చాడతను గాభరాగా.

"రామరాజుగారూ, ఖంగారు పడకండి! ఆమెను ఎవరో ఎతుకుపోయారని అనుమానంగా వుంది. ఇక్కడకు ఆమె వచ్చేటప్పుడు ట్రెయిన్‌లో యెవరితోనైనా పరిచయం అయిందా?"

"కోకిల అనే నర్స్ లీలకు సీటు ఇచ్చింది. కోకిల గాబ్రియెల్ సర్జికల్ క్లినిక్‌లో నర్స్‌గా వుంటోంది. ఆ క్లినిక్ ఎగ్మూర్‌లో వుంది" అన్నాడు రామరాజు.

"అక్కడకు లీల వెళ్ళిందేమో చూస్తాను."

"ఇవాళే బయల్దేరి నేను మద్రాస్ వస్తున్నాను. మీ కంపెనీకొచ్చి మిమ్మల్ని కల్సుకోనా?"

"రండి" అన్నాడు ఆనందమోహన్.

అతడి చేతిలోని రిసీవర్ని కాంతారావు తీసుకున్నాడు.

"రామరాజూ, కాంతారావుని! నాకు ఉత్తరం రాయకుండా లీలను ఇక్కడకు ఎందుకు పంపావు?"

"నీకు రాశానురా! అంది వుండదు!"

"నువ్వు వెంటనే వచ్చెయి. అందరం కలిసి దాని కోసం వెతుకుదాం" అన్నాడు కాంతారావు.

"వెంటనే బయల్దేరి వస్తున్నా."

కాంతారావు రిసీవర్ని ఆనందమోహన్‌కి యిచ్చాడు. మరికొంతసేపు మాట్లాడి అతడు రిసీవర్ని పెట్టేశాడు.

పోలీసు డిపార్టుమెంట్‌లో వున్న యిన్‌స్పెక్టర్ రాజన్‌కి ఆనందమోహన్ ఫోన్ చేశాడు.

"నేను ఆనందమోహన్ని!"

"ఏం కావాలో చెప్పండి" అన్నాడు యిన్‌స్పెక్టర్ రాజన్.

"TMX 3006 ఫియట్ కారు ఎవరిదో కనుక్కొని నాకు చెప్పండి. ఐ విల్ బి గ్రేట్‌ఫుల్!"

"కనుక్కొని మీకు ఫోన్ చేస్తాను."

"చాలా థాంక్స్" అని ఆనందమోహన్ రిసీవర్ని పెట్టేశాడు.

అతడు కుర్చీలోంచి లేచాడు. అతనూ, కాంతారావూ బయటకు నడిచారు.

"లీల గురించి పోలీసు రిపోర్టు ఇవ్వడం మంచిదేమో, సార్" అన్నాడు కాంతారావు.

"ఇద్దాం, యిచ్చేముందు కోకిలను కల్సుకుని మాట్లాడాలి" అన్నాడు ఆనందమోహన్.

హాల్స్ రోడ్డులో వున్న గాబ్రియల్ సర్జికల్ క్లినిక్ కాంపౌండులో స్కూటర్ ఆపి ఆనందమోహన్, కాంతారావు దిగారు.

ఇద్దరూ లోపలకు వెళ్ళారు. టెలిఫోన్ పక్కన కూర్చున్న ఒక నర్స్ వాళ్ళవైపు చూసింది.

"నర్స్ కోకిల వున్నారా?" అడిగాడు ఆనంద మోహన్.

"అలా కూర్చోండి. ఆమె డాక్టర్ గదిలో వున్నారు. కాస్సేపట్లో వస్తారు" అందామె.

కుర్చీల్లో వాళ్ళిద్దరూ కూర్చున్నారు. ఒక నర్స్ హాల్లోకి వచ్చింది.

"వాళ్ళు మీకోసం వచ్చారు" అంది మొదటి నర్స్.

నర్స్ కోకిల వాళ్ళ దగ్గరగా వెళ్ళింది. నవ్వుతూ వాళ్ళవైపు చూసింది.

"నా పేరు ఆనందమోహన్."

"నా పేరు కాంతారావు."

కాంతారావువైపు ఆమె సూటిగా చూసింది.

"ఆ రోజు మీరు స్టేషన్కి రాలేదు. లీల చాలా

భయపడింది. మీ ఫ్రెండ్ రామ్మూర్తి వచ్చేసరికి ఆమె సంతోషించింది" అందామె.

"రామ్మూర్తిని నేను పంపలేదు!" అన్నాడు కాంతారావు.

"లీల ఎలా వుంది?" అడిగిందామె గాభరాగా.

"లీల మాయమైంది. మీ సహాయం మాకు కావాలి. ఆ రామ్మూర్తి ఎలా వుంటాడు? అతడిని మళ్ళీ చూస్తే పోల్చగలరా?" అడిగాడు ఆనందమోహన్.

"రామ్మూర్తి పొట్టిగా, పచ్చగా, సన్నంగా వుంటాడు. పంచ, జుబ్బాతో వున్నాడు. నుదురు మీద ఎర్రటి బొట్టు! అతడి అసలు పేరు రామ్మూర్తి కాకపోవచ్చు" అందామె.

"డాంగ రాస్కెల్!" అర్చాడు కాంతారావు.

"అతడిమీద అనుమానం వచ్చింది. లీలతో పరిచయం లేని మనిషిని కాంతారావుగారు స్టేషన్‌కి పంపరని భావించి అతడిని పరీక్షించి చూశాను. కావలిస్తే నన్నూ తనతో కాంతారావు ఇంటికి రమ్మన్నాడు. దానితో వదిలేశాను" అందామె.

"ఆరితేరినవాడై వుండాలి!" అన్నాడు ఆనందమోహన్.

నర్స్ కోకిలకు థాంక్స్ చెప్పి వాళ్ళు బయటకు నడిచారు. ఆనందమోహన్ తన స్కూటర్ని ఇన్‌స్పెక్టర్ రాజన్ ఆఫీసువైపు పోనిచ్చాడు.

ఇన్‌స్పెక్టర్ రాజన్ వాళ్ళిద్దర్నీ కూర్చోమన్నాడు.

"ఆనందమోహన్‌గారూ, మీరు అడిగింది కనుక్కున్నాను. ఆ నంబరున్న ఫియట్ కారు సుందరంగారిది" అని ఒక చీటీని యిచ్చాడు.

"అన్నీ వివరాలూ అందులో రాశాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

చీటీలో రాసింది చదివి ఆనందమోహన్ కుర్చీలోంచి లేచాడు. ఇన్‌స్పెక్టర్ రాజన్‌కి ధన్యవాదాలు అర్పించి బయటకు నడిచాడు. వెనకనే వెళ్ళాడు కాంతారావు.

విశాలమైన కాంపౌండులో స్కూటర్ ఆగింది. ఆనందమోహన్, కాంతారావు దిగారు. సమీపంలో అరడజను కారు షెడ్లు వున్నాయి. అందులో ఫియట్, అంబాశిడర్ కార్లు వున్నాయి.

ముందు హాల్లోకి వెళ్ళాడు ఆనందమోహన్. "సుందరం గారితో మాట్లాడాలి" అన్నాడతను రిసెప్షన్ గుమస్తాతో.

అతడు ఒక గదివేపు చెయ్యి చూపించి వెళ్ళమన్నాడు. ఆనందమోహన్, కాంతారావు ఆ గదిలోకి వెళ్ళారు.

సుందరం పొట్టిగా, నల్లగా వున్నాడు. మెళ్ళో బంగారం గొలుసు మెరుస్తోంది.

"ఏం కావాలి మీకు?" అడిగాడతను.

"నిన్న సాయంత్రం 5 ప్రాంతంలో మీ ఫియట్ కారు హోటల్ మిడ్‌లాండ్‌కు వెళ్ళిందా?"

"లేదు. నా దగ్గర ఒకే ఫియట్ కారుంది. అందులో నేనూ, నా భార్యా నిన్న బీచ్‌కి వెళ్ళాం" అన్నాడు సుందరం.

"TMX 3006 ఫియట్ కారు హోటల్ మిడ్‌లాండ్‌కి వెళ్ళింది" అన్నాడు ఆనందమోహన్ గంభీరంగా.

"ఆ నంబరు తగిలించుకుని మరో ఫియట్ కారు అక్కడకు వెళ్ళిందేమో!" అని సుందరం నవ్వాడు.

ఆనందమోహన్ లేచాడు.

"సారీ, పొరబడి వుంటాం" అన్నాడు.

ఇద్దరూ బయటకు నడిచారు. కాంతారావును స్కూటర్ దగ్గర వుండమని ఆనందమోహన్ షెడ్లవైపు వెళ్ళాడు.

అక్కడ ఆ క్షణంలో యెవరూ లేరు. ఫియట్ కారు తలుపు తెరిచి అతను లోపలకు పరీక్షగా చూశాడు. వెనుక సీటుముందు, కాళ్ళు పెట్టుకునే రబ్బర్ మేట్ పైన ఎర్రటిగాజు కనిపించింది. దాన్ని తీసి జేబులో పడేసుకున్నాడు.

లీల కుడిచేతికున్న ఎర్రటిగాజులు అతడికి గుర్తొచ్చాయి!

అతడు కారు నంబరు మరోసారి చూసి వేగంగా స్కూటర్ వైపు నడిచాడు.

"సుందరం గదిలోకి మళ్ళా వెళ్ళాలి, రండి" అన్నాడు.

ఇద్దరూ వేగంగా లోపలకు నడిచి సుందరం గదిలోకి దూసుకెళ్ళారు.

కాంతారావు యెదురుగా కూర్చున్నాడు. ఆనంద మోహన్ అతడి పక్కకు వెళ్లాడు.

"సుందరం, నీ ఫియట్ కారు మిడ్‌లాండ్ హోటల్‌కి వెళ్ళింది. ఒక యువతిని మీ డ్రయివర్ కారులో ఎక్కించి తీసుకుపోయాడు!" ఆనందమోహన్ గద్దించాడు.

"అక్కడకు మా కారు వెళ్ళలేదని యెన్నిసార్లు చెప్పాలి?" అర్చాడతను.

"ఆమె చేతికుండే యీ ఎర్రగాజు మీ ఫియట్ కారు మేట్ మీద పడుంది!" అని ఎర్రగాజును పైకితీసి పట్టుకున్నాడతను.

"అటువంటి ఎర్ర గాజులు మన దేశంలో అనేకమంది స్త్రీల చేతులకుంటాయి" అన్నాడు సుందరం.

అతడి వైపు ఆనందమోహన్ సూటిగా చూశాడు.

"ఈ గాజే కాదు! ఆ ఫియట్ కారు డ్రయివర్ని హోటల్ మిడ్‌లాండ్‌లోని వాళ్ళు పోల్చారు!"

సుందరం కనురెప్పలు చిట్లించాడు.

"మా డ్రయివర్ యెక్కడున్నాడు?"

"బయట పోలీసులతో మాట్లాడుతున్నాడు!" అబద్ధమాడాడు ఆనందమోహన్.

"మీకేం కావాలి?"

"ఆ కారులో వెళ్ళిన అమ్మాయి కావాలి!"

"ఆమె మీకు దొరికితే నన్నూ, నా కారునూ వదిలేస్తారా?"

"మాకు కావలసింది ఆ అమ్మాయి, మీరు కాదు!"

సుందరం ఒక కాగితంమీద ఏదో రాసి అతడికిచ్చాడు.

"అక్కడికి వెళ్ళండి. ఆ అడ్రెసు నేను యిచ్చినట్లు వాళ్ళకు చెప్పొద్దు. నేనిచ్చానని తెలిస్తే నన్ను చంపేస్తారు" అన్నాడతను.

అతడిచ్చిన కాగితాన్ని చూసి ఆనందమోహన్ జేబులో పడేసుకున్నాడు. ఇద్దరూ వేగంగా బయటకు వెళ్ళారు. స్కూటర్ని స్పీడుగా కాంపౌండులోంచి బయటకు పోనిచ్చాడు ఆనందమోహన్.

కొన్ని నిమిషాల తర్వాత ఆనందమోహన్ తన ఆఫీసుకు చేరుకున్నాడు. కాంతారావును తన టేబుల్ ముందు కూర్చోమని అతడు దస్తూర్ గదిలోకి గబగబా వెళ్ళాడు.

దస్తూర్ అతడివైపు సూటిగా చూశాడు.

"ఏమైంది?" అడిగాడు దస్తూర్.

"లీలను వాళ్ళు ఎక్కడ దాచివుంచినదీ తెలిసి కాని అక్కడకు ఒంటరిగా వెళ్ళడం ప్రమాదక నాకు పోలీసు సహాయం కావాలి" అన్నాడు ఆన మోహన్.

ఆనందమోహన్ యిచ్చిన చీటీని దస్తూర్ చూశాడ రిసీవర్ ఎత్తి పోలీస్ కమీషనర్ రాజాతో మాట్లాడాడ ఆనందమోహన్ వైపు చూశాడు.

"ఆనంద్, అరగంటలో పోలీస్ వాన్ మన ఆఫీసు వస్తుంది. అందులో నువ్వు వెళ్లొచ్చు. విష్ యు గుడ్ లక్!" అన్నాడు దస్తూర్.

ఆనందమోహన్ తన టేబుల్ దగ్గరకు వెళ్ళి కుర్చీలో కూర్చుని కాంతారావు వైపు చూశాడు.

"రామరాజు వచ్చేసరికి లీల నవ్వుతూ ఆయన ముందు వుంటుంది" అన్నాడతను.

"అతడు చాలా ఆనందిస్తాడు" అన్నాడు కాంతారావు.

ఆనందమోహన్ కాఫీ తెమ్మని నౌఖరుతో చెప్పి సిగరెట్ వెలిగించాడు.

## 11

యునైటెడ్ ఏజన్సీస్ కాంపౌండులో పోలీస్ వాన్ ఆగింది.

ఆనందమోహన్, కాంతారావు కిందకు దిగారు. పెద్ద భవనం. విశాలమైన ముందు హాల్లోకి యిద్దరూ నడిచారు. యెదురుగా వాళ్ళకు సుందరం ప్రత్యక్షమయ్యాడు!

"మీకోసమే చూస్తున్నా, రండి! మీకు లీల

కావాలిగా!" అంటూ అతడు పిస్టల్‌ని వాళ్ళవైపు గురి పెట్టాడు.

"సుందరం, మేం ఒంటరిగా రాలేదు. మా ఇద్దర్నీ యిక్కడ తుదముట్టించవచ్చనే నమ్మకంతో నువ్వు యీ అడ్రెస్ రాసి మాకిచ్చావని అప్పుడే గ్రహించాను" అన్నాడు ఆనందమోహన్.

"ఏ మాటలు నేను నమ్మను!" అంటూ అతడు గుమ్మం వైపు అడుగులేసి బయటకు చూశాడు.

పోలీస్ వాన్ అతడికి కనిపించింది. అతను లోపలకు పరుగెత్తబోయాడు. అమాంతంగా మీదకు దూకి ఆనందమోహన్ అతడిని పట్టుకున్నాడు.

కాంతారావు విజిల్ వేయగానే పోలీసులు వేగంగా హాల్లోకి జొరబడ్డారు.

"ఈ బిల్డింగ్‌లోని గదులన్నీ సోదా చేయండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రాజన్.

మేడమీద వెనకవైపున యిరవై గదులు వున్నాయి. ప్రతి గదిలోనూ వుందొక యువతి!

ఒక్కొక్క గదినే చూస్తూ ఆనందమోహన్, కాంతారావు పోలీసులు జరుగుతున్నారు.

విచారవదనంతో వున్న లీల ఆనందమోహన్ని చూసి, అమాంతంగా వచ్చి అతడికి కౌగలించుకుంది. ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

"లీలా, నువ్వు క్షేమంగా బయటపడ్డావు! సంతోషించు! నీతో అనేకమంది యువతులకు స్వేచ్ఛ లభించింది. అందుకు మనం ఆనందించాలి" అన్నాడు ఆనందమోహన్.

ఆమె కాంతారావు వైపు చూసింది.

"అంకుల్, నీ పేరుతో వాళ్ళు నన్ను మోసం చేశారు" అని ఆమె ఏడ్చింది.

"ఏడవకమ్మా! రేపు నీ అన్నయ్య ఇక్కడ వుంటాడు. అతడు వచ్చేలోపల నువ్వు బయటపడినందుకు నాకు సంతోషంగా వుంది" అన్నాడు కాంతారావు.

ఇన్‌స్పెక్టర్ రాజన్ అక్కడికొచ్చి ఆనందమోహన్‌కి ధన్యవాదాలు అర్పించాడు.

"ఆనందమోహన్ గారూ, సుందరం యీ ముఠా అధిపతి. అందమైన యువతులను ఎత్తుకుపోయి వాళ్ళను గల్ఫ్ దేశాలవారికి పెద్ద మొత్తాలకు అమ్ముతున్నారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రాజన్.

—:ఐ పో యిం ది:—

# నెత్తురు చిమ్మిన గుడ్డలు!

సికిందర్

లాల్ పూర్తయిన సిగరెట్‌ని విసిరేసి, కారు దిగుతూ ఆ ఇంటికేసి చూశాడు. "వెల్, పోలీసులింకా రాలేదు, పార్టనర్" అన్నాడతను.

జాన్ కూడా దిగి, "వస్తూండవచ్చు, పార్టనర్" అన్నాడు.

"ఆమె పిలిచిందో లేదో...." లాల్ అంటూ గేటుని సమీపించాడు. గొళ్ళెం పెట్టబడిలేదు. నెట్టుకొని లోనికి నడిచాడు.

జాన్ అతన్ననుసరించాడు.

ఇద్దరూ మట్టిబాటగుండా ఆ ఇంటికేసి నడిచారు. ముందు తలుపు మూసి వుంది. ప్రక్కన కూడా మూసి వున్న అద్దాల కిటికీలోంచి లైటు వెలుగు ప్రసరిస్తోంది. బయటంతా చీకటిగా, నిర్మానుష్యంగా వుంది.

లాల్ చుట్టూ చూస్తూ, "కారు ఏదీ?" అన్నాడు.

జాన్ కూడా చూసి, ఉలిక్కిపడ్డాడు. "అవును,

ఆమె కారులోనే వచ్చానంది .... కారిక్క
పార్టనర్ —"

"ఏమిటి?"

"జాగ్రత్తగా వుండాలి!"

"ఎందుకు?"

"మనమేదో ట్రాప్‌లోకి నడిచినట్లున్నాం....'

లాల్ ఆగిపోయి. అతనివైపు తిరిగి చూశాడు. "ఇప్పుడు మనల్ని ఎవరో వెనుక నుంచి నెత్తిమీద పట్టుకెళ్ళి ఇంట్లో కట్టి పడేస్తారంటావా?"

తలూపాడు జాన్.

"సిగ్గు లేకపోతే సరి!" కసిరాడు లాల్, వరం మెట్లెక్కుతూ.

మాట్లాడకుండా జాన్ వెనుక వెళ్ళాడు.

లాల్ తలుపు దగ్గరకెళ్ళి, నెట్టబోతూ ఆగి, కర్చీ తీశాడు జేబులోంచి.

"నీ చేతులు కట్టేసుకో, దేన్నీ ముట్టుకోకు!" అన్నా జాన్‌తో.

అప్పుడు బెల్ పుష్ నొక్కాడు, కర్చీఫ్ పట్టుకొని లోన రింగయింది. కానీ జవాబులేదు.

"సునీతగారూ!" పిలిచాడతను.

అప్పుడూ జవాబులేదు.

"మేం వచ్చేశాం, సునీతగారూ!"

నిశ్శబ్దమే రాజ్యమేలుతోంది. లాల్ తలుపుని చిన్నగా నెట్టాడు. అది తెరచుకుంటోంటే లోనికి తొంగి చూశాడు.

"ఇంట్లో లేనట్లుంది, పార్టనర్. కారులో వెళ్ళిపోయి వుంటుంది...." అన్నాడు జాన్.

"ఎలా వెళ్తుంది? ఇక్కడ—ఓహ్—మనల్ని రమ్మని పిలిచి?"

"ధైర్యం చెదిరి వుంటుంది, చెక్కేసింది."

"అయితే పోలీసుల్ని పిలిచి వుండదు" అన్నాడు లాల్, లోపలి కదుగులేస్తూ.

అతను లోపలికెళ్ళి, ఆ హాలులో చుట్టూ చూశాడు.

జాన్ అతని ప్రక్కన చేరి, ఎడమ వైపు గది తలుపు దగ్గర చూపించాడు. "అదిగో పార్ట్నర్ శవం."

లాల్ అటుకేసి గబగబా నడిచాడు. అక్కడ నిలబడి వంగి చూశాడు. అది వెల్లకిలా నే పడివుంది. వళ్ళంతా గాయాలున్నాయి. నేలంతా రక్తం. కత్తి ఇంకా కడుపు లోని ఒక గాయంలోనే వుంది. శవం కళ్ళు తెరిచి వున్నాయి....

"లేదు ప్రాణం...." అన్నాడు జాన్.

"చాలా సేపే అయివుండాలి" అన్నాడు లాల్ వెనక్కి తిరుగుతూ. "వెల్, నువ్వెళ్ళి ఫోన్ చెయ్! త్వరగా రమ్మను వాళ్ళని, క్విక్!"

జాన్ పెద్ద పెద్ద అంగలేశాడు ఫోన్ దగ్గరకి, కర్చీఫ్ తీసి పట్టుకొని.

## 2

"హాలో ఫ్రెండ్స్, హౌలో. ఇక్కడెలా దొరికింది మీకు శవం?" అడిగాడు ఇన్స్పెక్టర్ బాలకృష్ణన్, కారు దిగి వస్తూ.

"శవా లెక్కడైనా దొరుకుతాయి!" అన్నాడు లాల్, అతనితో తిరిగి ఇంట్లోకి నడుస్తూ.

వెనుక సిబ్బంది వచ్చింది.

"మీరెలా వచ్చారిక్కడికి?" అడిగాడు కృష్ణన్

మళ్ళీ.

"పిలిపించబడ్డాం...." అన్నాడు లాల్.

వచ్చి చూస్తే ఆమె లేదు. శవం మాత్రమే వుందిక.

"ఎవరిది?"

"భర్తది."

"అసలేం జరిగింది?"

"ఏమో, చెప్పలేదు."

"మీకేం చెప్పింది?"

"ఆరున్నరకి ఫోన్ చేసి వెంటనే తన ఇంటికి రమ్మ తను అప్పుడే బయటినుంచి కారులో వచ్చిందట. ఇ కెళ్ళి చూస్తే భర్త రక్తం మడుగులో పడివున్నాడట మేం తక్షణం వస్తున్నామని చెప్పి, వెంటనే పోలీస ఫోన్ చేయమన్నాను. కానీ వచ్చి చూస్తే ఇక్క పోలీసులూ లేరు, ఆమె లేదు."

"కారులో వెళ్ళిపోయిందా?"

"అవును. భయపడి వుంటుంది. ఏ ఫ్రెండ్ దగ్గరికి వెళ్ళిపోయి వుండాలి."

"ఫ్రెండ్స్‌ని రప్పించుకోవాలి" అన్నాడు కృష్ణన్ హాలులో ప్రవేశిస్తూ.

అక్కడ శవం అలాగే వుంది. అతనికి ముప్ఫై ఏళ్ళు వుంటాయి. తెల్లగా సున్నితంగా, ఆరోగ్యంగా వున్నాడు. వంటిమీద ప్యాంటు షర్టూ వున్నాయి. కాళ్ళకి బూట్లు. జుట్టు చెదరలేదు. నూనెరాసి చక్కగా దువ్వి వుంది. చొక్కాకి గుండీలు చెక్కు చెదరలేదు. బట్టలెక్కడా నలగలేదు, రక్తం మరకలు తప్పితే!

సమీపంలో ఏ వస్తువూ లేదు, రక్తం మడుగు తప్ప.

ఫోటోగ్రాఫర్ తన పని కానిచ్చాడు.

డాక్టర్ పరీక్షకు పూనుకున్నాడు.

క్రిష్ణన్ సిగరెట్ వెల్గించుకున్నాడు. "ఆమె పేరేమిటి లాల్?"

చెప్పాడు లాల్.

"ఇతని పేరు?"

"చెప్పలేదామె...." అన్నాడు లాల్ టైము చూసు కుంటూ, "ఓ.కే., క్రిష్ణన్. ఇక మీరు చూసుకోండి, మేం వెళ్తాం. ఆమె మమ్మల్ని పిలిపించింది గానీ, చెప్ప కుండా వెళ్ళిపోయింది. ఆమె మా క్లయంట్ కాదు. కాబట్టి మేం ఏ బాధ్యతా తీసుకోవడంలేదు, తిరిగి ఆమె కన్పించి ఏదైనా కోరేవరకూ. అంతవరకు మీరే చూసు కోండి, గుడ్ నైట్."

"గుడ్ నైట్ లాల్, గుడ్ నైట్."

## 3

తిరిగి ఆఫీసుకు చేరుకొని, పైకి మెట్లెక్కి వెళ్ళినప్పుడు కారిడారులో తచ్చాడుతూ ఓ స్త్రీని చూసి చటుక్కున ఆగిపోయారు డిటెక్టివ్ లిద్దరూ.

ఒకర్నొకరు ప్రశ్నార్థకంగా చూసుకొని, తిరిగి కదిలారు.

ఆమెని సమీపిస్తూండగా, ఆమె చూసి చిరు నవ్వు నవ్వింది. ఆమె దగ్గరాగి డిటెక్టివ్ లు కలవరపడుతూ చూసీ, చటుక్కున తేరుకున్నారు. అప్పుడు లాల్, ఆమెని ఆపాదమస్తకమూ చూశాడు. ఆమె తెల్లని రంగులో, చక్కని శరీర సౌష్టవంతో, ఆకర్షణీయంగా వుంది. ఆమెలో ఏమాత్రం ఆందోళన లేదు.

"నమస్తే, లాల్."

"నమస్తే" అన్నాడు లాల్, చూపులు ఆమె కళ్ళల్లోకి సారిస్తూ, "మీరు..."

"నేనిక్కడ చాలా సేపట్నుంచీ ఎదురు చూస్తున్నాను...." అందామె, నిట్టూరుస్తూ. "మీరు లేరు. ఇంకా పావు గంట చూసి వెళ్ళిపోదామనుకుంటున్నాను. ఇంతలో మీరొచ్చేశారు."

లాల్ బాధగా చూశాడు. "ఇబ్బంది పడ్డారు.... వచ్చేముందు ఫోన్ చేసి వస్తే బాగుండేది."

"నాకా ఆలోచన రాలేదు."

ఆమెని చూస్తున్న కొద్దీ జాన్ ముఖంలో క్షణ క్షణం రంగులు మారుతున్నాయి. గబుక్కున తలుపువైపు మళ్ళి, తాళం తీయసాగాడు.

"రండి" అన్నాడు లాల్, ఆఫీసులోకి నడుస్తూ.

అప్పుడు మళ్ళీ ఇద్దరూ చూపులు మార్చుకున్నారు. జాన్ ఏదో హెచ్చరిక చేశాడు కళ్ళతో.

లోపలికొచ్చి ఆమె లాల్ ఎదురుగా టేబుల్ ముందు కూర్చుంది. లాల్ ఆసక్తిగా చూశాడు. ఆమె నిదానంగా చూసింది.

"చెప్పండి, ఏం కావాలి మీకు?" అడిగాడు లాల్ చివరికి. "మీరెలా వచ్చారు, కారులో వచ్చారా?"

"ఎందుకలా అడిగారు?" అందామె ముఖం చిట్లిస్తూ.

"కింద పార్కింగ్ కష్టంగా వుంది. ఎక్కువసేపు వుంచడానికి వీల్లేదు."

"ఓహ్, నేనింటి నుంచి కార్లో నే బయల్దేరాను. ఇక్కడ డ్రాప్ చేసి వెళ్ళిపోయాడు డ్రైవర్. మళ్ళీ రానవసరం లేదన్నాను. ఆటోలో పోతాను...."

లాల్ ఓరకంట జాన్‌ని చూశాడు.

జాన్ కోరగా ఆమెని చూశాడు.

ఆమె చెప్పింది, "మీరొక సహాయం చేయాలి. నా స్నేహితురాలు ఇబ్బందుల్లో వుంది. ఆమె మీ దగ్గరికి నన్ను పంపింది...."

"మీ స్నేహితురా లెవరు?"

"సునీత."

డిటెక్టివ్ల ముఖాలు కందిపోయాయి.

"ఐసీ.... చెప్పండి, ఆమెకేమైంది?" అడిగాడు లాల్ కుదుటపడుతూ.

"ఆమె భర్తవల్ల చాలా యిబ్బందులు ఎదుర్కొంటోంది. వివాహమైన ఈ నాలుగేళ్ళలో ఏ రోజు ఆమె సుఖపడలేదు. భర్తతో విసిగి వేసారిపోయింది...."

"భర్త ఎవరు?"

"నరేష్‌కుమార్. జైకో ఆటో మొబైల్స్‌లో మార్కెటింగ్ మేనేజర్."

"ఎలా వుంటాడు?"

నవ్వింది ఆమె, "మల్లాది నవలలో హీరోలా వుంటాడు."

"వివరంగా చెప్పండి."

ఆమె నవ్వుతూనే చెప్పింది, "ఎలా చెప్పాలి! సిల్లీగా వుంటుంది....అతనికి చదువూ, అందం, సంస్కారం అన్నీ వున్నాయి. కానీ మనుషుల్లో మెలగడం తెలియదు. బిడియం, తెలివితేటలు అంతంత మాత్రం. ఓ వ్యాపకం, సరదా లేవు. తెలీవు. ఖాళీ సమయాన్ని ఎలా గడపాలో కూడా తెలియదు. ఇతరుల అవసరాలే కాదు, తన అవసరాలు కూడా గుర్తించని మొద్దుగకం. అన్నీ భార్య చెప్పాలి, చేసిపెట్టాలి. భార్యతో ఎలా కాలక్షేపం

చేయాలో తెలియదు. యింట్లో వున్నంత సేపూ నిద్ర పోతాడు. యెంతో అవసరమైతే తప్ప ఆమెతో మాట్లాడడు. ఇక షికార్లు సినిమాలనేవి అతను కలలో కూడా తలచని విషయాలు...."

"చాలా కష్టం" జాన్ అన్నాడు.

"ఆమె విసిగిపోయింది, డిటెక్టివ్ గారూ. యిలాంటి మనిషితో ఎంత కాలం వేగుతుంది? విరక్తితో అతనిమీద పడి అరిచేది. అది పద్ధతి కాదని నేను మందలించాను. మంచిగా, నెమ్మదిగా, సహనంగా మార్చుకోవాలన్నాను. ఆమె అంటే అతనికిష్టం లేదని కాదు. ఆ మనిషికి తన యిష్టాయిష్టాలేమిటో తెలియదు. అసలే టేస్టూ లేదు. ఈ టైపు మనుషులే అంత. తీసికెళ్ళి ఏ అడవిలో వది లేసినా అక్కడే బతికేస్తారు, దుంపలూ వేళ్ళూ తింటూ!"

"ఆ అవసరం రాదేమో!" జాన్ అన్నాడు, ఆమెను సూటిగా చూస్తూ.

"ఎలా తెలుసు, వచ్చిందేమో!" అందామె తనదైన ధోరణిలో, "ఇప్పుడీ పరిస్థితి చూస్తే అలాగే జరిగినట్లుంది. ఆమె వ్యవహారం బాగా ముదిరింది. ఈ మధ్య అతన్ని కొట్టడమే మొదలెట్టింది, డిటెక్టివ్ గారూ. సహనం ఎంతకని వహిస్తుంది, ఆ బుద్ధావతారంతో? చేతికందిన వస్తువుని అతని మీదికి విసిరి కొట్టడం నేర్చుకుంది.... అతను బెదిరి పారిపోతాడు. తిరిగి రెండు రోజులదాకా రాడు, ఆమె కోపం తగ్గేవరకూ. అంతే గానీ ఆమెని అదుపు చేయడు. కనీసం అనునయించలేదు కూడా. ఆమె మీద అధికారం చూపడానికే భయపడతాడు..."

"పై చేయి ఒకరిదే అవుతుంది" జాన్ అన్నాడు.

"అతనంత పిరికివాడు, డిటెక్టివ్ గారూ. తనంటే ఇంత భయపడే మొగుడూ ఓ మొగుడేనా అని ఆమె నా దగ్గర వాపోతుంది. తను ప్రేమగా దగ్గరికి తీసుకున్నా దూరంగా వెళ్ళిపోతాడు. చివరికామె విసిగి—మొన్న స్నానం చేయిస్తున్నప్పుడు—చెంబుతో కసిగొద్దీ నెత్తి మీద మొట్టిందట! గట్టిగానే మొట్టింది. తల చిట్లి నెత్తురు బొటబొటా కారుతూంటే—అది చూసి అతనక్కడే మూర్ఛపోయాడట!"

"దటీజ్ టూ మచ్!" అన్నాడు జాన్.

లాల్ మౌనంగా వింటున్నాడు.

ఆమె తిరిగి చెప్పింది. "అంతే, అప్పుడు లేచి—నువ్వు పెళ్ళానివి కావు, పిశాచివి! నన్ను బతకనివ్వవు, చంపేస్తావు! నేనిక్కడ వుండను, నీకిక కన్పించను!—అంటూ పరుగెత్తాడట వీధిలోకి....

"అలా వెళ్ళినవాడు ఇంతవరకూ జాడలేడు, డిటెక్టివ్ గారూ. నాలుగు రోజులైంది. ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో తెలియదు. ఆమె అన్నిచోట్లా వెతికింది. అందర్నీ అడిగింది. లాభం లేకపోయింది. ఎవరూ చూడలేదన్నారు. ఆఫీసుకు కూడా నాలుగు రోజుల నుంచీ వెళ్ళడం లేదట. అతనికి మతి చలించి ఏ ఊళ్ళమ్మట తిరుగుతున్నాడోనని ఆమె ఒకటే భయపడుతోంది....

"అలా జరిగి వుండదు" జాన్ అన్నాడు.

"ఏమో, ఎలా తెలుస్తుంది? అసలే పిరికి మనిషి. ఎంత షాక్ తినివుంటాడో మీరే వూహించండి. ఇక ఆమె పోలీసు రిపోర్టు యివ్వడం మంచిదనుకుంది. సాయంత్రమే నా దగ్గరకొచ్చి చెప్పింది. ఆ పని వద్దన్నాను. రాద్ధాంతం అవుతుంది. నలుగురికీ తెలిస్తే

నవ్వుతారు. అతన్ని రహస్యంగా వెతికించి సమస్య పరిష్కరించుకోమన్నాను. మార్గం చెప్పమంది. నేను మీ దగ్గరికి వెళ్ళమన్నాను. కానీ ఎందుకో ఆమె భయ పడింది. నన్నే వెళ్ళమంది. ఫోటో కూడా ఇచ్చి పంపింది...."

"చూడండి, ఇతనూ ఆమె భర్త" అందామె బ్యాగు తెరిచి ఫోటో తీసిస్తూ, "ఇదీ పరిస్థితి. ఇక మీరేం చేయ మంటారో చెప్పండి? ఈ కేసు మీరు తీసుకుంటారా? ఫీజు ఎంతైనా ఫరవాలేదు. అతన్ని మీరు వెతికి తీసు కొస్తారా? లేక పోలీసులకి తెలిపే అవసరం వుం టుందా....?"

లాల్ సాలోచనగా ఆ ఫోటోలోని రూపాన్ని చూస్తూ అన్నాడు, "ఇప్పుడు పోలీసులకి తెలిపే అవ సరం లేదు. ఇప్పుడామె యెక్కడుంది?"

"నాతో మాట్లాడి యింటికెళ్ళి పోయింది, నేనిటు వచ్చేశాను."

"ఎన్ని గంటలకి వెళ్ళింది?"

"అయిదున్నరకి."

"అయిదున్నరకా!"

"అవును, ఎందుకలా అడిగారు?"

"మీ దగ్గర్నుంచి ఆమె తిన్నగా ఇంటికే వెళ్లిందా?"

"నాతో అలాగే చెప్పింది. ఇంకెక్కడికీ వెళ్ళదు."

"ఎందులో?"

"ఆమె కారులో."

"ఎంత సమయం పట్టవచ్చు?"

"అర గంటలో చేరుకోవచ్చు."

"అంటే ఆరులోపు ఆమె ఇంట్లో వుండొచ్చన్న

మాట?"

"అవును....ఎందుకీ ప్రశ్నలు?"

లాల్ చెప్పేలోపు ఫోన్ మోగింది. "ఎక్స్‌క్యూజ్ మీ...." అంటూ దాన్నందుకున్నాడు. ఒక నిమిషం అవతలి మాటలు విని, మాట్లాడి పెట్టేశాడు.

"ఎక్కడ్నుంచి?" అడిగాడు జాన్, కుతూహలంగా చూస్తూ.

"కృష్ణన్ నుంచి" చెప్పి ఆమెవైపు తిరిగాడు లాల్. "వెల్, మీరు చెప్పడంలో ఎక్కడో పొరపాటు జరిగి నట్లుంది, మాడమ్. మీరు చెప్పిందంతా నిజమేనా? నా ఉద్దేశ్యం, మీ స్నేహితురాలు చెప్పిందాంట్లో మీకే సందేహమూ లేదుగా?"

"లేదు. ఆమె అబద్ధాలు చెప్పే రకం కాదు."

"సారీ, మిసెస్...."

"వనజ."

"లుక్ మిసెస్ వనజ, మీ స్నేహితురాలు అర గంటకే ఇంటికి చేరుకోలేదు. ఇంకా ఆలస్యంగా, అరు న్నరకి వెళ్ళి, ఇంట్లో రక్తం మడుగులో భర్త పడి వుండడాన్ని చూసినట్లు ఫోన్ చేసి మాకు చెప్పింది."

"ఏమిటీ!" అదిరిపడిందామె.

"అవును, మిసెస్ వనజ. అలా జరిగింది."

ఇంట్లో ఆమె భర్త....ఆమె భర్త....ఓహ్!"

"హత్య చేయబడ్డట్లు మాకు ఫోన్ చేసి వెంటనే రమ్మంది. కానీ మేం వెళ్ళేసరికి అక్కడ లేదు. కారులో ఎక్కడికో వెళ్ళిపోయింది....ఆ కారు నెంబర్ మీకు తెలుసా, మిసెస్ వనజ?"

ఆమె గుటకలు మింగుతోంది, మొహమంతా చెమటనే

పట్టేసి.

"తెలుసు .... తెలుసు .... కానీ మీరేమంటున్నా రసలు!"

"మిమ్మల్ని భయపెట్టడం నా అభిమతం కాదు, మిసెస్ వనజ, నెంబర్ చెప్పండి...."

" APL 3868 !!"

"గుడ్. ఇందాక వచ్చిన ఫోన్ కాల్ పోలీసుల నుంచి."

"పోలీసుల నుంచా! ఏమని?"

"ఆ కారు యాక్సిడెంట్ కి గురయిందట, కూకట్ పల్లి దగ్గర" చెప్పాడు లాల్, ఆమెను సానుభూతిగా చూస్తూ.

# 4

కారు శరవేగంగా దూసుకెళ్తోంది.

జాన్ చాకచక్యంగా డ్రైవ్ చేస్తున్నాడు ట్రాఫిక్ లోంచి. లాల్ అతని ప్రక్కన నోట్లో సిగరెట్ తో, సూటిగా రోడ్డుమీదికి చూస్తూ కూర్చున్నాడు. వెనుక సీట్లో ఆమె ఉద్రిక్తంగా కూర్చుని రకరకాల ప్రశ్నలు వేస్తోంది....

ప్రమాద స్థలానికి చేరుకునేసరికి పదిన్నరయింది.

అక్కడ రోడ్డువారగా ఆగి వున్న రెండు పోలీసు వాహనాలు, కొంత దూరంలో పెద్ద రావిచెట్టు దగ్గర గుమిగూడి వున్న మానవాకారాలూ, ఆ రాత్రివేళ నిర్జనంగా, నిశ్శబ్దంగా వుండే ఆ పరిసరాల్లో ఉద్రేకపూరిత వాతావరణాన్ని సృష్టిస్తున్నాయి.

బొంబే హైవే మీద ఆ సమయంలో ఎందుకో ట్రాఫిక్ మందకొడిగా వుంది.

లాల్ కారు దిగుతూ ఎదురొచ్చిన ఒక సబిన్స్

పెక్టర్ని అడిగాడు, "ఎనీ క్యాజువాలిటీస్?"

"నో సర్, కార్లో ఎవరూ లేరు."

లాల్ అతనితో వెళ్ళి ఆ కారుని చూశాడు. వెనుక జాన్, వనజ దిగి వెళ్ళారు. ఆ కారు సరిగ్గా రెండు హెడ్ లైట్ల మధ్యగా చెట్టుకు గుద్దుకొని ఆగి వుంది. తెల్ల రంగు ఫియట్ కారు. డ్యామేజి ఏమీ జరగలేదు. రోడ్డు పూర్తిగా దిగిపోయి, కుడివైపు ఒరిగి వుంది. లైట్లన్నీ ఆఫ్ చేసి వున్నాయి. ముందు డ్రైవింగ్ సీటు వైపు డోరు, వెనుక ఎడమ వైపు ప్యాసింజర్ డోరూ తెరచి వున్నాయి. పోలీసుల చేతుల్లో టార్చిలైట్ల వెలుగు కారు లోపలా మీదా అంతటా ప్రసరిస్తోంది....లోపల ఎటు వంటి వస్తువులూ లేవు.

ఆ కారుని గుర్తించి వనజ, "ఓహ్, సునీత ఏమైంది!" అనరిచింది.

ఒక పోలీసు అధికారి ఆమె వైపు తిరిగాడు, "సునీత ఎవరు?"

"ఈ కారు ఓనరు" చెప్పాడు లాల్. "ఆమె ఒక హాత్యా స్థలం నుంచి పారిపోయి వచ్చింది."

"మై గాడ్! సో దిసీజ్ మర్డర్ బిజినెస్."

"ఈ యాక్సిడెంట్ రిపోర్టెవరిచ్చారు?"

"ఎవరో లారీ డ్రైవర్, తను వస్తూంటే ఇలా కనిపించిందట....అజ్ఞాతంగా వుండి ఫోన్ చేశాడు.

"ఎన్ని గంటలకి?"

"ఎనిమిదిన్నరకి."

"మీరొచ్చి ఎంత సేపయింది?"

"అర గంట."

"అప్పటి ఎప్పీయరెన్స్ ఎలా వుంది?"

"కారు ఇదే పొజిషన్‌లో వుంది. దీన్నిలాగే వుంచి ఈ చుట్టుపక్కలంతా చూశాం. చాలా దూరం వెతికాం యెవరూ కన్పించలేదు గాయాలతో. కేసు బుక్ చేసి సిటీకి టో చేద్దామనుకుంటున్నాం కారుని. ఇంతలో మీరొచ్చేసి యిలా అంటున్నారు...."

"వెల్, ఆమె వెళ్ళిపోయే తొందర్లో యాక్సిడెంట్ చేసి వుంటుంది. దీన్నిక్కడ వదిలేసి మరో వెహికల్‌లో లిఫ్ట్ అడిగి వెళ్ళిపోయుంటుందేమో..చాలా దూరం వెళ్ళిపోయి వుంటుంది ఈ పాటికి. కారుని టో చేసే ముందు వేలి ముద్రలు చూడండి. ఫోటోగ్రాఫ్స్ కూడా తీసుకుంటే మంచిది...."

"కానీ మిస్టర్ లాల్, కారు ఇలా రాంగ్ సైడ్‌లో వచ్చి ఎలా గుద్దుకుంది?

"రాంగ్ సైడ్‌లో వచ్చింది కాబట్టే గుద్దుకుంది" అన్నాడు లాల్, జాన్ వైపు తిరుగుతూ. "నువ్విక్కడ చూసుకో, వేలిముద్రలు చాలా ముఖ్యం. క్షుణ్ణంగా చూడు. యాక్సిడెంట్‌లో వాస్తవికత ఎంత వుందో చూడు. నిజంగా జరిగిందా? సృష్టించబడిందా? నేను బయల్దేరుతాను...."

"ఎక్కడికి?"

"వచ్చి చెప్తాను."

## 5

కారు స్టార్టుచేసి పోనిస్తూ లాల్, ప్రక్కన వనజని చూశాడు. "చెప్పండి, ఎటు పారిపోవాలనుకుందామె?"

"అదే నాకూ తెలియడం లేదు."

"ఆమెదే ఊరు? తల్లిదండ్రు లెక్కడున్నారు?"

"మెదక్ దగ్గర ఏదో ఊరు."

"ఐ సీ.... దారి కూడా ఇదే. కానీ దురదృష్టం కొద్దీ ప్రమాదంలో చిక్కుకుంది."

"మరి కారు వదిలేసి ఎక్కడికి వెళ్ళిపోతుంది?"

"అదే ఆలోచిస్తున్నాను.... పోలీసులు చుట్టుపక్కలంతా వెతికామన్నారు. జాడ దొరకలేదు. ఇప్పుడామె అసలు అపాయంలో వుందనుకోవాలి, వనజ."

"అంటే!"

"మీరా కారు తీరు చూశారా — ముందు డోరు, వెనుక డోరూ తీసి వున్నాయి? వెనుక సీట్లో మరొకరుండే అవకాశ ముందనుకుంటున్నాను. అలా వెళ్తున్నప్పుడు వాళ్ళిద్దరు యెందుకో గొడవపడి వుండాలి. అప్పుడు పెనుగులాడ్డం వల్ల గతి తప్పి కారు అలా రాంగ్ సైడ్‌లో వెళ్ళి గుద్దుకుంది— వాళ్ళిద్దరు చెరో వైపునుంచి కిందకు దూకి పరుగెత్తి వుండాలి— పట్టుకోడాని కొకరు, తప్పించుకోవడాని కొకరూ."

"ఓహో, ఆమె కారులో ఇంకెవరున్నారు?"

"ఎవర్ని తీసుకెళ్తుందామె తన ఊరికి?"

"ఇక్కడ బంధువు లెవరూ లేరామెకు!"

"స్నేహితులు?"

"నేనే."

"మరి ఆమెతో ఎవరుండవచ్చు?"

"మీ వూహా తప్పేమో...ఆమె ఒంటరిగానే ప్రయాణిస్తోందేమో. వెనుక డోర్ ఆమె తీసిందేమో దేనికో... లేకపోతే కారు గుద్దుకున్నప్పుడు అదే తెరచుకుందేమో."

"ఏమో.... వేలిముద్రలు వస్తేగాని తెలియదు. కానీ ముందామెని మనం వెతకాలి. ఆమె ప్రమాదంలోనే వుందనుకోవా లిప్పుడు...."

"మీరెక్కడికి కడుతున్నారిప్పుడు?"

కారుని పడిపోవు కన్పిస్తున్న పెట్రోలు బంకులోకి తిప్పాడు లాల్.

కారాగగానే సర్వీస్ కుర్రాడు పరుగెత్తుకొచ్చి అడిగాడు, "ఎన్ని సార్?"

"పది."

కుర్రాడు పంపు అందుకుని, కారు టాంకు కేసి హుషారుగా కదిలాడు.

లాల్ సిగరెట్ తీసి వెలిగించాడు. ఆమె మౌనంగా గమనిస్తోంది లాల్ని. అప్పుడు లాల్ పర్సుతీసి, అందు లోంచి డబ్బు తీయసాగాడు. పూర్తయ్యాక కుర్రాడు బిల్లు పట్టుకొచ్చి లాల్కిచ్చి, లాల్ ఇచ్చిన డబ్బు తీసికెళ్ళి మిగిలిన చిల్లరతో వచ్చాడు.

లాల్ ఆ చిల్లర వాడికి టిప్‌గా యిస్తూ, "ఇవ్వాళ సాయంత్రం నించీ ఇటు ఎన్ని బళ్ళు వచ్చి వుంటాయి?" అనడిగాడు.

వాడు అర్థంగాక చూశాడు.

"నువ్విక్కడ వచ్చేపోయే బళ్ళని చూస్తూంటావా, రోడ్డు మీద?"

తలూపాడు వాడు. "చూస్తూంటాను, సార్."

"ఎనిమిది గంటలకి ఏం చేస్తున్నావ్?"

"రోడ్డు మీదే చూస్తున్నాను, సార్."

"అప్పుడేయే బళ్ళు వెళ్ళడం చూశావు?"

"సిటిలోకా, సార్?"

"సిటీ నుంచి."

"మూడు లారీలు, రెండు బస్సులు సార్."

"ఇంకా?"

"ఒక మోటార్ సైకిలు....ఒకటీ ఇటు మళ్ళ లేదు!"

"ఇంకేం వెళ్ళాయి?"

"ఈ కారు మీదేనా, సార్?"

"అవును."

"ఇలాటిదే వెళ్ళింది."

లాల్ ముందుకు జరిగాడు, "ఎలా వెళ్ళింది, చాలా వేగంగానా?"

"కాదు, మెల్లిగా మీద ఉండొచ్చు."

"అందులో యెవరున్నారు?"

"ఒక ఆడ మనిషి నడుపుతోంది. అందుకే బాగా గుర్తుంది."

"ఇంకెవరూ లేరా?"

"లేరు సార్, ప్రమాణం చేసి చెప్తాను...."

"ప్రమాణం చేయక్కర్లేదు. ఒక్క ఆడ మనిషినే చూశావా?"

"అంతే, సార్."

"ఎలా వుందామె?"

"అది కన్పించలేదు, సార్. ప్రమాణం చేసి...."

"ప్రమాణం చెయ్యకు! వెనుక సీట్లో సరిగ్గా చూశావా?"

"చూశాను, సార్. యెవరూ లేరు."

"ఇక వెళ్ళు."

కారుని పోనిచ్చాడు లాల్.

"మీ అనుమానం తప్పయింది....ఆమె ఒంటరిగానే వెళ్ళింది!" అంది వనజ ఆందోళనగా.

"కావచ్చు."

"ఇప్పుడెక్కడికి?"

"మీరు మీ ఇంటికి, నేను నా ఇంటికి."

"మరి ఆమె—"

"ఆమె కథ కంచికి."

"అలా జోక్ చేయకండి!"

"వెల్, దటీజ్ పోలీస్ బిజినెస్, మాడమ్. ఆమె వంటరిగానే వెళ్ళి వుంటే ఇప్పుడామెకు ఏ అపాయం లేదనుకోవచ్చు. చట్టం నుంచి తప్పించుకోవడానికి మాత్రమే ఆమె పారిపోయింది. ఆమెని పోలీసులే పట్టుకుంటారు."

"ఆమె హత్య చేసిందంటే నమ్మలేను!"

"మీకు నమ్మడానికి బంధుత్వాలడ్డువస్తాయి. మాకు సాక్ష్యాధారాలు పెనుభూతాల్లా కనిపిస్తాయి. నమ్మక పోతే మాకు మీద కొడ్తాయి."

"ఏమిటా సాక్ష్యాధారాలు?"

"మొదటిది—ఆమె పారిపోవడం, అది పెద్ద తప్పు. అలా నేరాన్ని చాటుకోవడమే అవుతుంది. రెండవది—మాకు ఫోన్ చేసి అబద్ధం చెప్పడం, మీ అంచనా ప్రకారం ఆమె ఆరు గంటలకి చేరుకోవాలి ఇంటికి. కానీ ఆమె ఆరున్నరకి చేరుకున్నట్లు ఫోన్‌లో నమ్మించింది. అసలేం జరిగిందంటే, ఆమె ఆరులోపే ఇంటికి చేరుకుంది. అప్పుడనుకోని విధంగా భర్త వచ్చేశాడక్కడికి. మళ్ళీ యెందుకో ఇద్దరికీ వాదన జరిగింది. అది తీవ్ర రూపం దాల్చడంతో కత్తి దూసి అతన్ని ఖతం చేసింది. ఆమె ఆవేశం మీకే తెలవిచ్చారుగా? అలా జరిగింది. అప్పుడు మాకు ఫోన్ చేసి, దూసుకెళ్ళి పోయింది—పారిపోయింది కారెక్కి."

"మీకెందుకు ఫోన్ చేయాలి?"

పొరపాటు — మీరు మమ్మల్ని కలుసుకుంటారని ఆమెకు తెలుసు. అది మనసులో వుండిపోయి అసంకల్పితంగా ఆ పని చేయించింది. నేను పోలీసుల్ని పిలవమని చెప్పగానే వంటిమీద స్పృహ వచ్చి తనేం చేస్తోందో తెలిసి వుంటుంది—పారిపోయింది."

"ఇదంతా నేను నమ్మలేకపోతున్నాను."

"వెల్, ఒక వేళ ఆమె మమ్మల్ని కాంటాక్టు చేస్తే, తక్షణం మాకు తెలియజేయడం మీ ధర్మమని మరువకూడదు" అన్నాడు లాల్ స్పీడు పెంచుతూ.

## 6

ఇంటికి తిరిగి వచ్చి లాల్, అర్ధ రాత్రిపూట ఆలిండియా రేడియోలో ఏదో ప్రోగ్రాం వింటున్నప్పుడు ఫోన్ మోగింది.

వెళ్ళి రిసీవరెత్తాడు.

జాన్ గొంతు పలికింది అవతల్నుంచి, "నీకెన్ని వేలి ముద్రలు కావాలి, లాల్?"

"ఎన్ని రకాలున్నాయి నీ దగ్గర?"

"చాలా! .... కారు వంటి తిరిగే ప్రాపర్టీ మీద అసంఖ్యాకంగా లభిస్తాయి. వెళ్ళిన చోటల్లా ఇన్నేసి అంటించుకొస్తుంది. వాటన్నిటితో కబడ్డీ ఆడక్కర్లేదు మనం. ముందు ముఖ్యమైన భాగాలమీద-అంటే, డోర్ హాండిల్స్, స్టీరింగ్ వీల్, గేర్ లివర్, హార్న్ పుష్, డాష్ బోర్డు, సీట్లు మొదలైన చోట్లలోనివి పరిశీలిస్తే తేలికవుతుంది పని."

"అవును, చెప్పు."

"ఈ నే చెప్పిన ప్రతి భాగం మీద రెండు రకాల వేలి ముద్రలున్నాయి, పార్ట్నర్."

"అన్నిచోట్లా జంటగా కలిసి వున్నాయా?"

"అవును. చాలా చోట్ల ఓవర్ లాప్ అయ్యాయి. ఓవర్ లాప్ అయిన వాటిని లేటెస్టువిగా భావించవలసి వుంటుంది—అంటే ఆఖరుసారిగా కారుని ఉపయోగించిన వ్యక్తివి."

"అవును, చెప్పు."

"అలాటి ముద్రలు-ఓవర్ లాప్ అయినవి—డ్రైవింగ్ వీల్ మీద, హార్న్ పుష్ మీద, గేరు లివర్ మీద, ముందు సీటు మీద, వెనుక సీటుమీద, ముందూ వెనుకా డోర్స్ మీదా వున్నాయి.

"ఇక వెనుక సీటు మీద, డోర్ మీదా వున్న రెండో రకం వేలిముద్రలు, ముందు భాగాల మీద ఓవర్ లాపింగ్ కి లోనయిన రకానికి చెందినవే."

"ఓహ్! వెల్, ఇంకా?"

"అంతే, పార్టనర్. ఈ పోలీసులకి తొందరెక్కువ!"

"ఏం చేశారు?"

స్పాట్ కి చేరుకోగానే అక్కడ అడుగుజాడలేమైనా తగలడాయేమో చూసుకోలేదు. అంతా దున్ని పారేశారు!"

"ఆ యాక్సిడెంట్ కి పూర్వ రంగం వాళ్ళకి తెలిస్తే కదా!" అన్నాడు లాల్, "వెల్, ఇంకేమిటి కార్లో క్లూస్?"

"ఏమీ లేవు. వస్తువులేవీ వదిలిలేవు. పగిలిన గాజు ముక్కలు, పీకిన వెంట్రుకలు, వూడిన వూరేకులు—నథింగ్, యాక్సిడెంట్ లో అవాస్తవికత ఏమీ లేదు. రోడ్డు మీద సడన్ బ్రేకు వేసిన చార స్పష్టంగా వుంది. చెట్టుకి బలంగా వెళ్ళి గుద్దుకున్నట్టు బాగా బెండ్ అయిన

ముందరి ఫెండర్ చెప్తుంది. దటీజ్ ప్యూర్ యాక్సి డెంట్. లాల్, దారి దోపిడిగాళ్ళు ఎక్కువయ్యారీ మధ్య. ఈమెని వాళ్ళవరైనా అటకాయించబోతే, ఆ కంగారులో యాక్సిడెంట్ చేసి పారిపోయిందేమో దిగి? లేకపోతే యాక్సిడెంట్ యెందుకు జరుగుతుంది? దొంగ లామెను ఎత్తుకుపోయి వుంటారు."

"పార్టనర్ —"

"ఏమిటి, లాల్?"

"ఆ వేలిముద్రలు యెవరివో తెలిసేవరకు నీ నోరు— మూసి—వుంచుకో!"

"అలాగే, మరి నీ అయిడియా ఏమిటి?"

"నిశ్చయంగా చెప్పలేను. సాక్ష్యాలు కలవడంలేదు. ఆమె ఒంటరిగా ప్రయాణిస్తూండగా చూశాడొక సాక్షి. కానీ జంటని సూచిస్తున్నాయి ఇప్పుడీ వేలి ముద్రలు. వాటి అన్వయింపు పూర్తయితే గానీ యెవరు నడుపు తున్నారో, ఎవరు వెనుక కూర్చుని వెళ్ళారో తెలియదు. అప్పుడు యాక్సిడెంట్ కి సరయిన కారణం దొరుకుతుంది. ఆమె ఆ మార్గం పట్టిందంటే తన ఊరికి వెళ్ళిపోవాలనే. కృష్ణన్ కి ఇందాక ఫోన్ చేసి ఆమె వూరి పోలీసులకి ఇన్ఫార్మ్ చేయమన్నాను. ఆమె ఊరేదో తెలీదు. ఇంట్లో ఉత్తరాలుండొచ్చు చూడమన్నాను. కృష్ణన్ వెంటనే చేస్తానన్నాడా పని—"

"కానీ జాన్, ఆమె ఊరికెళ్ళి వుండదు. ఈ పరిస్థితుల్లో అది వీలు కాదు. వెనక్కి సిటీలోకి వచ్చేసి వుండాలి. ఓ ట్రక్కులోనో యెక్కి అలా వస్తే స్నేహితురాలు వనజని కలుసుకోవచ్చు. వనజని ఇప్పుడు నమ్మ

లేను. ఆమె అడ్రసు ఇస్తాను, నువ్వామె యింట్లో ఓ
మాపువేసి వస్తావా, జాన్?"

"ఓ. కే, పార్టనర్ చెప్పు."

చెప్పాడు లాల్.

# 7

ఉదయం పదకొండున్నరకి ఇన్‌స్పెక్టర్ కృష్ణన్, తన
ఆఫీసుకు వచ్చిన డిటెక్టివ్‌లని ఆహ్వానించాడు.

"హలో, జ్ఞాపకంలో నే వచ్చారు. మూడు కేసులు—
ఆరు ఫీజులతో వరిల్లండి!"

"అలా దీవించకండి కృష్ణన్. ఇందులో ఫీజు లేదు
మాకు" అన్నాడు లాల్.

"క్లయంట్‌కి గాలం వేయాలి!" జాన్ అన్నాడు.

కృష్ణన్ నవ్వాడు. "రాత్రి ఏమైంది?"

"లాల్ నన్ను వనజ దగ్గరికి పంపాడు. అనుమానించి
నట్టు సునీత అక్కడికి రాలేదు."

"ఓహ్, ఆమె తన ఊరికి కూడా చేరుకోలేదు."

"నే చెప్పిందే జరిగి వుండాలి...."

"ఏమిటి?"

"దొంగలు ఎత్తుకుపోయి వుంటారు."

"దేనికి?"

"డోంట్ బి సిల్లీ!" మధ్యలో అన్నాడు లాల్,
"వేలి ముద్రల గురించి ఇప్పుడు మీరేం చెప్తారు?"

కృష్ణన్ కొన్ని ఫోటోలు తీసిచ్చాడు. "ఇవి ఆ కారు
మీద హత్యా స్థలంలో కొన్ని వస్తువులమీద తీసిన
ప్రింట్స్."

మరి కొన్ని తీసిస్తూ, "ఇవి వెరిఫికేషన్ కోసం ఇంట్లో
కొన్ని ప్రైవేట్ స్థలాల్లో, వస్తువుల మీదా సేకరించిన

హతుడి భార్య శాంపిల్ వేలిముద్రలు, మిస్టర్ లాల్"
అన్నాడు గంభీరంగా.

లాల్ అతన్ని ఓమారు చూసి తల దించుకున్నాడు.

"టాలీ అవుతున్నాయా?"

"కృష్ణన్ గంభీరంగానే అన్నాడు, "చక్కగా చూడండి, ఈ కత్తి మీద ఫోను మీద, ముందు తలుపు మీద, ఇంకా కారు వెనుక సీటు మీద కూడా కొన్ని ఈ రెండో రకం వేలి ముద్రలున్నాయి. ఆ వ్యక్తి ఎవరో ఇంతవరకు తెలియదు."

"స్త్రీయే కావచ్చు."

"ఎలా అంటున్నారు?"

"చూసిన సాక్షి వున్నాడు. అయితే ఈ సాక్షి కార్లో ఆ ఒక్క స్త్రీనే చూశానన్నాడు. కూడా మరింకెవరూ లేరు."

"కాంప్లికేషన్ మిస్టర్ లాల్."

"హతుడి గురించి చెప్పండి."

"హతుడు నరేష్‌కుమార్, కైకో ఆటో మొబైల్స్‌లో మార్కెటింగ్ మేనేజర్. అయిదు రోజుల క్రితం భార్య కొట్టిందని ఇల్లు విడిచిపోయి, నిన్న సాయంత్రం తిరిగి వచ్చాడు. వచ్చినప్పుడు అతన్ని వీధిలో గమనించని సాక్షులున్నారు. ఆటోలో వచ్చాడు. సమయం అప్పుడు ఆరూ పదిహేను."

"అయితే అంతకుముందే, సుమారు పావుగంట క్రితం, అతని భార్య సునీత బయటనుంచి కారులో వచ్చి ఇంట్లో వుంది. దీనికీ సాక్షులున్నారు. కానీ ఆ తర్వాత ఇంట్లో జరిగిందానికి మాత్రం లేరెవరూ సాక్షులు.

"ఫ్రెండ్స్, అంతా గుట్టుగా జరిగిపోయింది. నో

అరుపులు, నో కేకలు — సారీ ఫర్ ది లాంగ్వేజ్. అప్పుడు చీకటిపడ్డాక, ఆరున్నర ప్రాంతాల, ఇంట్లోంచి ఆ కారు బయటికి వెళ్ళడం మాత్రం చూశారు కొందరు. అందులో ఆమె ఒక్కతే వుంది, డ్రైవ్ చేస్తూ. చాలా స్పీడుతో వెళ్ళిపోయిందట....

"ఓ.కే, మనం లోపలికెళ్ళినప్పుడు నరేష్‌కుమార్ శవ రూపంలో తాజాగా కనబడ్డాడు. వంటిమీద ఆరు గాయాలు, కత్తి కడుపులోనే వుంది. అది ఇంట్లోదే. అన్ని పోట్లు పొడిచినప్పుడామె మీద తప్పకుండా రక్తం చిమ్మి వుండాలి. ఆమె అలాగే పారిపోయి ఇప్పుడు అజ్ఞాతంలో వుంటే, ఆ మరకలంటిన బట్టలతో ఎక్కువ కాలం వుండలేదు. ఇంట్లోంచి బట్టలేవీ తీసుకుపోలేదు."

"కత్తిమీద ఆమె వేలి ముద్రలున్నాయి. టెలిఫోన్ మీద ఆమె వేలిముద్రలున్నాయి. బయట తలుపు మీద ఆమె వేలిముద్రలున్నాయి. హతుడి జేబుల్లో వస్తువులేవీ లేవు, కొంత డబ్బు తప్ప. జుట్టు చెదరలేదు. వంటిమీద బట్టలు—ఆ రక్తం మరకలు తప్పి స్తే—శుభ్రంగా మాయకుండా వున్నాయి...."

"మాయకుండా వున్నాయా?"

"అవును, ఎందుకలా అడిగారు?"

"ముందు చెప్పండి—ఇంకా ఏం తెలిశాయి?"

"పోస్టుమార్టమ్ గురించి చెప్పడానికేం లేదు. ఇంట్లో వస్తువులు చిందరవందరగా లేవు. డైరెక్ట్ ఎటాక్, అంతే."

"నరేష్ ఇల్లు విడిచి పోతున్నప్పుడు బయట ఎవరైనా చూశారా?"

"చూశారట."

"అప్పుడే డ్రెస్సులో వున్నాడు?"

"ఇదే డ్రెస్సులో—ఏమిటి డ్రెస్సు మిష్టరీ?"

"ఏమీ లేదు, మీరా మెను వెతికే ప్రయత్నాలు ఇంకా గట్టిగా చేయండి. ఆమె ఫోటో ఒకటి సంపాదించండి, చాలా ఉపయోగం."

"మీరిప్పుడేం చేస్తారు?"

"ఏమీ చేయను, ఆఫీసుకెళ్తాను. కమాన్ జాన్, లెట్స్ గో!"

లేచి జాన్‌తో బయటికి నడిచాడు లాల్.

## 8

ఆఫీసుకు తిరిగివచ్చి రాగానే ఫోన్ మోగనారంభించింది....

లాల్ ఎత్తి రెస్పాన్స్ ఇచ్చాడు.

"నేను జైకో ఆటో మొబైల్స్ జనరల్ మేనేజర్ చిబ్బర్‌ని మాట్లాడుతున్నాను, మిష్టర్ లాల్" అంది అవతలి గొంతు.

"మాట్లాడండి" అన్నాడు లాల్.

"మీతో పర్సనల్‌గా మాట్లాడాలి. ఇప్పుడు అక్కడికి రావచ్చా?"

"విత్ ప్లెజర్, మిష్టర్ చిబ్బర్."

అవతల మనిషి థాంక్స్ చెప్పి పెట్టేశాడు.

లాల్ కూడా పెట్టేసి జాన్‌కు చెప్పాడు.

"రానివ్వు!" అన్నాడు జాన్ విని.

"వెల్ జాన్, యిప్పుడు విను — నరేష్‌కుమార్ ఆ నాలుగు రోజులూ వంటిమీద ఒక జత బట్టలతో, అవి మాయకుండా, ఎక్కడ యెలా వున్నాడంటావు నీవు?"

జాన్ కళ్ళు పెద్దవయ్యాయి, "అవును, దట్స్ ఎ

గుడ్ క్వశ్చన్. ఎక్కడ గడిపాడు ఆ నాలుగు రోజులూ? అసలు ప్రతిసారీ అలా వెళ్ళినప్పుడు యెక్కడ గడిపి వస్తూండేవాడు? ఫ్రెండ్స్? హోటల్? లవర్? పార్టనర్, చివరిది అనువుగా వుంది..లవర్ అయితేనే అతని దుస్తుల గురించి, పరిశుభ్రత గురించీ శ్రద్ధ తీసుకుంటుంది."

తలుపు దగ్గర అలికిడయింది. తిరిగి చూశారు. ఒక మనిషి హడావుడిగా లోపలికొచ్చాడు. అతనికి యాభై ఏళ్ళుంటాయి. ముఖమంతా ఉద్రేకంగా వుంది.

వస్తూనే అతను అరిచాడు. "ఏం జరుగుతోందిక్కడ! ఏమిటిదంతా! ఈ హత్యలూ ఘోరాలూ ఏమిటీ! ఏమైంది నా సునీతకు!"

డిటెక్టివ్‌లు కలవరంగా చూసుకున్నారు.

"సునీత యెవరు?" అడిగాడు లాల్.

"నా బిడ్డ!"

"ఓహ్, అలా కూర్చోండి."

అతను కూర్చుని కోపంతో ఇంకా వూగిపోయాడు. "చెప్పండి! మాట్లాడండి మీరు! నరేష్‌ని ఎవరు చంపారు? నా బిడ్డనేం చేశారు? వాటీజ్ దిస్—ఇదంతా!"

"ఇదంతా....విధి ఆడిస్తున్న వింత ఆట!"

అతను గిరుక్కున జాన్ వైపు తిరిగాడు. "మీరెవరు? మధ్యలో?"

"ఆయనున్నాడగండి!" లాల్‌ని చూపించాడు జాన్.

"నా పార్టనర్ జాన్" చెప్పాడు లాల్.

అతను లాల్‌ని మింగేసినట్టు చూశాడు. "చూడండి, నాతో సరసాలాడకండి. నేను చాలా చాలా సీరియస్ మనిషిని. ఫ్రాంక్‌గా చెప్తున్నాను. నా కోప్పం వస్తే కేసులు పెడతాను. నా పేరేమిటో చెప్పానా మీకు?"

"లేదు."

"కేస్ట్రావ్!"

"బాగుంది."

"ఇప్పుడు—గంటలోగా—నా బిడ్డను నాకప్పగించక పోతే కేసు పెట్టేస్తాను!"

"సారీ, మిమ్మల్ని నిరుత్సాహపరుస్తున్నాం."

"ఎందుకు?"

"మీ బిడ్డను మేం మీ నుంచి తీసుకోలేదు. అసలామె యెవరో, యెలా వుంటుందో కూడా మాకు తెలియదు."

"నేను కేసు పెడితే అంతా తెలుస్తుంది!"

"ఏం కేసు పెడతారు, కేస్ట్రావ్ గారూ?"

"మా లాయర్నడిగి చెప్తాను."

"నేను చెప్తాను—దీనికి కేసు వుండదు."

వుండకపోతే సృష్టించమంటాను!"

"అలాగే సృష్టించుకోండి, వెళ్ళండి!"

అతను మాట్లాడలేదు. లాల్ కూడా మాట్లాడలేదు. యెవరూ మాట్లాడలేదు. క్షణాలు నిశ్శబ్దంగా దొర్లుతున్నాయి....చివరికి అన్నాడు లాల్, "ఇంకా ఏమైనా చెప్తారా?"

"నరేష్‌ని చంపి పారిపోయిందనుకుంటున్నారా నా బిడ్డ?"

"మరి మీరెలా అనుకుంటున్నారు?"

"నా బిడ్డ అలాటి పని చెయ్యదు?"

"ఆవేశంలో ఆమె మీకేం తీసిపోలేదు."

"ఓహ్, పోలీసులు చెప్పింది విన్నారా? నాన్సెన్స్ అదంతా! యెవరో చంపితే, అది చూసి భయపడి నా బిడ్డ పారిపోతే హత్య అంటగడతారా? పాపం చుట్టు

వుంటుంది! ఆమె మనసు మీకేం తెలుస్తుంది? కన్న తండ్రిని నాకే తెలుస్తుంది."

"ఏ తండ్రికీ తన బిడ్డల మనసు తెలియదు. అసలు తెలుసుకుందుకు ప్రయత్నించడు."

"యెవరన్నారు?"

"నేనంటాను."

"మరి యెవరికి తెలుస్తుందని మీ ఉద్దేశ్యం?"

"కని పెంచిన తల్లికి."

"యూ ఆరే ఫూల్!"

"ఏమన్నారూ?"

"యూ ఆరే ఫూల్!"

"ఎలా?"

"నా పిల్లలకి తల్లీ తండ్రీ అన్నీ నేనే అయి పెంచాను. వాళ్ళ మనసు నాకెలా తెలియకుండా ఉంటుంది, నాన్సెన్స్ గాకపోతే!"

"మీ అమ్మాయి ఆవేశపరురాలు కాదంటారు."

"చాలా నెమ్మదస్తురాలు."

"హత్యకు నాలుగు రోజుల ముందు, మీ అమ్మాయి మీ అల్లుడిగారి నెత్తిమీద చెంబుతో మొట్టి, నెత్తురు చిందించింది...."

"ఎవరన్నారు?"

"మాకు తెలిసింది."

"బనాయిస్తున్నారు! కేసు బనాయించడానికి కారణాలు వెతుకుతున్నారు! ఆ పని చేయడానికామెకెంత-"

"ధైర్యం వుండాలంటారు. కానీ ధైర్యం సాహసాలకి క్షణికావేశంతో సంబంధం లేదు. ఆమె ఏ పరిస్థితిలో అతన్ని గాయపర్చిందో, అదే పరిస్థితుల్లో హత్య

చేసింది. వాళ్ళ మధ్య సంబంధాలెలా వున్నాయో తెలుసా మీకు?"

"తెలుసు, బాగా తెలుసు! వాళ్ళ మధ్య సంబంధాలు చెడాయని యెవరన్నారు? పాపం చుట్టుకుంటుంది! చూడండి మిస్టర్ డిటెక్టివ్, నేను చాలా సీరియస్ మనిషిని. మీరు కల్లిబొల్లి మాటలతో నన్ను జోకొట్టకండి. నిజాలన్నీ నాకు తెలుసు. నాన్సెన్స్ మాట్లాడకండి!"

అతను లేచి మళ్ళీ అన్నాడు కళ్ళెర్రజేస్తూ, "అమ్మాయి కన్పిస్తే నాకప్పజెప్పకుండా కేసుపెట్టి నిర్బంధించారో, మర్యాద దక్కదు జాగ్రత్త!"

అరిచి అతను గబగబా బయిటికి వెళ్ళిపోయాడు.

డిటెక్టివ్‌లు ఒకరొన్నకరు చూసుకుంటూ వుండిపోయారు.

జాన్ ఉలిక్కిపడ్డాడు, "పార్ట్‌నర్ —"

"ఏమిటి?" లాల్ తేరుకున్నాడు.

"గాయం — నరేష్ తలమీద భార్య కొట్టినప్పటి గాయం—"

"అవును—"

"అదేమైంది? పోస్టుమార్టమ్‌లో కృష్ణన్ యెందుకు ప్రస్తావించ లేదు?"

"అదుగతన్నీ!" అన్నాడు లాల్, ఉలిక్కిపడి లేస్తూ.

జాన్ ఫోన్ ఎత్తి చకచకా డయల్ చేశాడు.

"నో, జాన్" కృష్ణన్ అన్నాడు అవతలి నుంచి, "తలమీద ఏ గాయం అయినట్టు ఆనవాలేవీ లేవు...."

జాన్ ముఖం తెల్లబడింది.

"అబద్ధం చెప్పింది!" అన్నాడు ఫోన్ పెట్టేస్తూ.

# 9

ఒక పొట్టిగా, లావుగా వున్న మనిషి లోనికొచ్చి చెయ్యి చాపుతూ అన్నాడు, "అయాం చిబ్బర్."

"గ్లాడ్ టు మీట్ యూ!" అన్నాడు లాల్ చేయి కలుపుతూ.

జాన్ కూడా కలిపాడు, "బి సి టెడ్, మిష్టర్ చిబ్బర్."

మిష్టర్ చిబ్బర్ కూర్చుంటూ చెప్పాడు, "జంటిల్ మెన్, నేనిక్కడి కొచ్చిన కారణం మీకు తెలుసు. మా ఎంప్లాయీ నరేష్‌కుమార్ ట్రాజడీ విషయంలో వచ్చాను. నరేష్‌కుమార్ చనిపోయే ముందు నాలుగు రోజులు ఆఫీసుకు రాలేదు. ఏమయ్యాడని భార్య నడిగితే, ఆమె సింపిల్‌గా తనతో పోట్లాడి వెళ్ళిపోయాడని చెప్పింది. యెక్కడి కెళ్ళాడో, ఏం చేస్తున్నాడో తనకు తెలియదంది. అతని గురించి అడుగవద్దంది."

"అతడలా మాకు చెప్పకుండా వెళ్ళిపోవటం నెలలో రెండు మూడుసార్లు మా కనుభవమే. అప్పుడు కూడా... అదేదో ఫ్యామిలీ వ్యవహారమనుకుని అతనొచ్చే వరకు మేం వూరుకునే వాళ్ళం. అతను వచ్చి ఏవో సంజాయిషీలు చెప్పుకునేవాడు....అవి నమ్మశక్యంగా వుండేవి కావు. మేం వార్నింగ్ ఇచ్చేవాళ్ళం."

"అయినా అతడలా పోతునే వున్నాడు. అయితే ఈసారి చాలా రోజులు పోవడంతో, అతని భార్యని పదేపదే అడిగాం. పోలీసు రిపోర్టు ఇమ్మని మరీ మరీ అన్నాం—అతడెక్కడా కన్పించటం లేదని అంటే, అయినా ఆమె ఆ పని చేయలేదు. ఆమె ప్రవర్తన మాకర్థంగాలేదు. భర్త కనిపించకపోతే ఆమెకే దిగులూ

లేదు. ఆమె తీరు అంతుపట్టక ఇక మేమే పూనుకోవాలనుకున్నాం. కానీ పోలీసు రిపోర్టు ఇవ్వడానికి—కంపెనీ ఇప్పుడున్న సున్నిత పరిస్థితుల్లో మా ప్రివిలేజెస్, బిజినెస్ ఇంట్రెస్ట్సు దెబ్బ తింటాయని సంకోచించాం.

"మిస్టర్ లాల్, నరేష్‌కుమార్ ఈ రకమైన ప్రవర్తన గత మూడు నెలల నుంచే ప్రారంభమైంది. ఈ సారి మొదటి రెండు రోజులు నేను మామూలుగానే పట్టించుకోలేదు. అప్పుడు రెండు రోజుల్లో తిరిగొచ్చేసేవాడు. ఇప్పుడు రెండు రోజులు గడిచినా రాకపోవటంతో, కారణాలు వెతకసాగాను. ఆలోచిస్తోంటే, నాకెన్నో సందేహాలు కలిగాయి....ఆమె...ఆమె అసహజ ప్రవర్తన, అతని అంతుపట్టని అంతర్ధానం చూస్తోంటే, వీళ్ళిద్దరు కలిసి ఏదో నాటకమాడ్డం లేదు కదా అనిపించింది...."

అతను ఆగి, డిటెక్టివ్‌లని సూటిగా చూశాడు.

"వెల్, చెప్పండి" అన్నాడు లాల్.

"ఈ అనుమానంతో, మిస్టర్ లాల్, నేను అప్‌సెట్ అయ్యాను. అయినా పోలీసు రిపోర్టు ఇవ్వలేను. అందుకని.. అందుకని....అతని వ్యవహార మేమిటో తెలుసుకోవాలని ఒక ప్రైవేట్ డిటెక్టివ్‌ని ఎన్నుకున్నాను...."

"వెరీ వెల్, చెప్పండి."

"ఆ డిటెక్టివ్ పేరు వెల్లడించడానికి అభ్యంతరం లేదు. దివాకర్. నేనతన్ని నరేష్ భార్య చర్యల్ని వాచ్ చేయమని నియమించాను, నిన్న ఉదయం. నరేష్ ప్రవర్తన యిప్పుడేదో ఫ్యామిలీ గొడవలకి సంబంధించిందని నాకనిపించలేదు."

"ఎందుకంటే, జంటిల్‌మెన్, మా కంపెనీ ఇప్పుడొక కొత్త పథకాన్ని — ప్రాజెక్టుని చేపట్టింది. ఒక కొత్త

మోడల్ మోటైక్‌ని రూపొందించే సన్నాహాల్లో వుంది, జపనీస్ సహకారంతో.

"మా రీసెర్చి అండ్ డెవలప్‌మెంట్ సెంటరు ఇక్కడే వుంది, మిస్టర్ లాల్. డిజైన్స్ కాపీరైట్ గురించి ఇటీవల బజాజ్ వర్సస్ పియాగో కేసు గురించి మీకు తెలిసే వుంటుంది...."

"గతంలో పియాగో సహకారంతో మన దేశంలో వెస్పా స్కూటర్లని తయారు చేసిన బజాజ్ కంపెనీ, ఆ జాయింట్ వెంచర్ ముగిసి పదేళ్ళకు పైనే గడిచినా, ఇప్పటికీ అవే యింజన్ డిజైన్స్‌ని తమ స్వంత మోడల్స్‌కి యథేచ్ఛగా వాడుకుంటూండడాన్ని సవాలు చేస్తూ యునైటెడ్ స్టేట్స్‌లో కేసు వేసింది, ఆ ఇటాలియన్ కంపెనీ పియాగో."

"ఆ కేసు గెలవలేదనుకోండి, అది వేరే విషయం. అయితే ఇప్పుడదే విదేశీ కంపెనీ తిరిగి మన దేశంలో— ఇక్కడ ఆంధ్రప్రదేశ్ స్కూటర్స్‌తోనూ, నార్తులో మరో కంపెనీతోనూ కొలాబరేషన్‌కి సిద్ధపడుతోంది...."

"మిస్టర్ లాల్, అగ్రిమెంట్ ముగిసినప్పుడే తిరిగి తమ స్వంత డ్రాయింగ్స్‌ని వాపసు తీసుకోకపోవడం వీక్ పాయింట్ వల్లనే కేసు ఓడిపోయింది పియాగో. ఇలాటి పొరపాటు ఇంకెక్కడెక్కడ చేసిందో గానీ, ఇహ మాత్రం చెయ్యకుండా పాఠం నేర్చుకుంది. తమ పేటెంట్ గురించి వాళ్ళకే అంత పట్టింపు లేనప్పుడు, ఇక ఇండస్ట్రియల్ యెస్పియొనేజికి యెంత అవకాశ మంటుందో మీరే చూడండి—"

"అలాటి అవకాశం—మిస్టర్ లాల్—అవగింజంతైనా లేకుండా మేమిప్పుడు చేయి కలుపుతున్న జపనీస్ ఫర్మ్

జాగ్రత్త తీసుకుంటోంది. మాకు చాలా కఠిన నిబంధన లున్నాయి. వాళ్ళందించిన డ్రాయింగ్స్ ఏ పరిస్థితుల్లో నయినా మా ద్వారా మరో గమ్యానికి చేరుతున్నాయని అనుమానం వస్తే — ఓహ్ — మేం వూహించలేనంత మొత్తంలో దావా నెదుర్కోవలసి వుంటుంది. చాలా దెబ్బ తింటాం.

"అందుకని జంటిల్ మెన్, మేం సెక్యూరిటీ మెజర్స్‌ని యెంతో పకడ్బందీగా అమలు జరుపుతున్నాం. మూడు నెలల క్రితమే మొదటి మీటింగ్ జరిగింది, మా కొలాబరేటర్స్‌తో. అప్పుడే డీల్ మొత్తం సెటిలై పోయింది. వాళ్ళు మా ప్లాంట్‌ని చూసి కొన్ని మార్పులూ చేర్పులు సూచించారు. దానికి మూడ్నెల్లు టైం తీసుకున్నాం. అప్పుడే డిజైన్స్ అందిస్తామన్నారు. ఈ మీటింగ్‌లో నేనూ, మా బోర్డాఫ్ డైరెక్టర్స్, డిజైన్స్ ఆఫీసర్‌తో పాటు నరేష్‌కుమార్ కూడా పాల్గొన్నాడు. అఫ్‌కోర్స్, నా సెక్రటరీ మిస్ మీనా కూడా వుందనుకోండి...."

"ఇది జరిగిన వారం రోజుల నుంచే నరేష్ ఆఫీసు ఎగ్గొట్టడం మొదలెట్టాడు .... మా కొలాబరేటర్స్‌తో మాకు ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి.. మొన్న వాళ్ళు వ్రాసిన ఉత్తరానికి మేము ఈ నెల ఇరవై తొమ్మిదిన డిజైన్స్ అందించడానికి వస్తోన్న వాళ్ళ రిప్రెజంటేటివ్‌ని రిసీవ్ చేసుకోడానికి సిద్ధంగా వున్నామని నిన్న వ్రాశాం...."

"ఈ సమయంలోనే నరేష్ మిస్టీరియస్‌గా ప్రవర్తించడం మొదలెట్టాడు. ఇతన్ని చూస్తే నాకొక్కటే అనుమానం కల్గింది—ఇతను ఇండస్ట్రియల్ ఎస్పియోనేజికి పాల్పడుతున్నాడా ఒక వేళ?

"మిష్టర్ లాల్, నరేష్ మా కంపెనీలో చేరి ఒక్క సంవత్సరమే అయింది. అతడి నియామకం పొరపాటున జరిగింది. అతడీ ఉద్యోగానికి అర్హుడు కాడు. అన్‌ఫిట్. మార్కెటింగ్ మేనేజర్కి ఉండాల్సిన చురుకుదనం, తెలివితేటలు శూన్యం. డల్ ఫెలో. డిమ్ పర్సనాలిటీ. అతని తొలగింపు గురించి ఆలోచిస్తున్నాం.... ఇంతలో అతనిలా ప్రవర్తించడం మొదలెట్టాడు. కనుక ఇతని వ్యవహార మేమిటో తెలుసుకోవాలని ఈ డిటెక్టివ్‌ని కోరాను...."

లాల్ తలూపాడు, "చెప్పండి, ఏం చేశాడు డిటెక్టివ్?"

"నిన్న ఉదయం నుంచీ ఆమెను ఇంటి దగ్గర కని పెట్టాడు నరేష్ భార్యను. ఆమె సాయంత్రం ఇల్లు కదిలింది. సోమాజిగూడులో వనజ అనే ఆమెని కలుసుకొని తిరిగి ఇంటి కొచ్చేసింది—ఇక ఆమె ఇంకెక్కడికీ వెళ్ళదనుకొని ఇతను విరమించు కొచ్చేశాడట. కానీ అప్పుడే హత్య జరిగింది. ఇది తెలిసినప్పట్నుంచీ వర్రీ అవుతున్నాను. డిటెక్టివ్ యెంతవరకు నిజం చెప్పాడు? అతన్ని నమ్మొచ్చా? ఏదైనా దాస్తున్నాడా? క్లయింట్స్‌కి నెగటివ్ రిపోర్టిచ్చి నేరస్తుల్ని బ్లాక్ మెయిల్ చేసి డబ్బు తీసే డిటెక్టివులుంటారని విన్నాను. ఇతనూ అలాంటి వాడేనా?"

"మిష్టర్ లాల్, ఇప్పుడు నేను కోరేదేమిటంటే, ఈ డిటెక్టివ్‌ని మీ డిటెక్టివ్‌లు పరిశోధించి నిజం తెలుసుకోమని. అప్పుడు మీకూ ఈ హత్య పరిష్కారం కావచ్చు. మా కంపెనీ ప్రయోజనాల్ని కాపాడిన వార వుతారు. దీనికి మీరు కోరినంత ఫీజు యివ్వడానికి

సిధంగా....''

జాన్ అడ్డు తగిలాడు. "ఇండస్ట్రియల్ ఎస్పియా నేజి అన్నారు-ఆ డిజైన్స్ నరేష్ చేతికి ఎలా వస్తాయంటారు? మీరు టైట్ సెక్యూరిటీ అని కూడా అన్నారు...."

"అవును — కానీ — ఆ రోజు — ఇరవైతొమ్మిదన ఏదైనా అనుకోని సంఘటన జరగవచ్చు, ఆ కాన్ఫరెన్స్‌లో."

"అక్కడ్నించీ డిజైన్స్ మాయమవుతాయంటారా—కాదు. మరేదో జరుగుతుంది. ఆ కాన్ఫరెన్స్‌లో యెవరెవరు పాల్గొంటారు?"

"నేను, మా డిజైన్స్ ఆఫీసర్, పొడక్షన్ మేనేజర్, ఇంకా నా సెక్రటరీ."

"ఓహ్ మీ సెక్రటరీ, ఆమెతో నరేష్‌కుమార్ ఎంత క్లోజ్‌గా వుండేవాడు?"

ఆతను కలవరంగా చూశాడు. "వాళ్ళెప్పుడూ క్లోజ్‌గా వుండలేదు."

"ఓహ్, అవును, వుండకూడదు.." అదోలా నవ్వాడు జాన్, "ఆమె మీ గదిలోనే వుంటుందా?"

"అవును, నా ఎడమవైపునే ఆమె టేబుల్ వుంది."

జాన్ కళ్ళు గుండ్రంగా తిప్పుతూ ఈలవేశాడు.

చిబ్బర్ ఇంకా కలవరంగా చూశాడు, "ఏమిటి, మిష్టర్ జాన్?"

జాన్ నవ్వి లాల్‌ని చూశాడు. లాల్ ఎటో చూస్తూ వేళ్ళు టకటకలాడిస్తున్నాడు టేబుల్ మీద.

"మిష్టర్ చిబ్బర్" అన్నాడు తను, "కొన్ని ఆధారాల వల్ల నరేష్‌కుమార్ అజ్ఞాతంలోకి వెళ్ళినప్పుడు ఒక యువతి దగ్గర గడుపుతుండవచ్చని అనుకున్నాం. మీ

రిప్పుడు అతను ఎస్పియొనేజికి పాల్పడ్డాడని అనుమా నిస్తున్నారు. ఈ సిట్యువేషన్‌లో మీ సెక్రటరీని కూడా యెందుకు అనుమానించకూడదు? ఎందుకు ఆమె నరేష్‌తో కలిసి పని చేయకూడదు?"

"ఓహ్, నేనలా అనుమానించలేదు."

"ఆమె ఇప్పుడెక్కడుంది?"

"ఈ రోజు లీవు పెట్టింది."

లాల్ సూటిగా చూశాడు. "ఎందుకు?"

"ఆరోగ్యం బాగా లేదంది."

"మిష్టర్ చిబ్బర్, మనం యిప్పుడు మీ ఆఫీసు కెళ్తున్నాం."

"ఎందుకు?"

"చెప్తాను."

"మరి దివాకర్ —"

"అతన్ని మేం ఏమీ చేయలేం. తోటి డిటెక్టివ్‌ల కడుపు కొట్టడం మా పద్ధతి కాదు. హత్యలో అతనికీ పాత్ర వుందని తెలిస్తే పోలీసులకి చెప్తాం. వాళ్ళు చూసు కుంటారు" లాల్ లేచి ఫ్యానాఫ్ చేశాడు, బయల్దేర డానికి.

# 10

చిబ్బర్ తన ఆఫీసు తెరచి, డిటెక్టివ్‌లని తీసు కెళ్ళాడు.

"రండి, జంటిల్ మెన్. నా ఆఫీసులో మీకేం కావాలో తెలియడంలేదు."

నవ్వాడు జాన్, "మా క్కావల్సినవి మీకు బాగా తెలిసిన చోట్లలోనే వుంటాయి."

"మీకేం కావాలి?"

లాల్ తన ప్రక్కన బద్ధకంగా వున్న మనిషిని చూపించాడు, "మీట్ మిస్టర్ స్వామి, మిస్టర్ చిబ్బర్. అవర్ ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్."

స్వామి చేయి చాపాడు. కరచాలనాలు జరిగాయి.

"ఇప్పుడు స్వామి మీ సెక్రటరీ మిస్ మీనా వేలి ముద్రలు తీసుకుంటాడు, ఆమె టేబుల్ దగ్గర. కదులు స్వామీ" అన్నాడు లాల్.

అతను కదిలాడు తన సరంజామాతో.

అతనక్కడ తంటాలు పడుతోంటే, డిటెక్టివ్‌లు చిబ్బర్ యెదురుగా కూర్చుని ఓపిగ్గా చూస్తున్నారు.

పావు గంట తర్వాత కదిలి వచ్చాడు స్వామీ, "దొరికాయి, తీసుకున్నాను. ఆఫీసుకెళ్ళి టాలీచేసి చెపాను...." అన్నాడు.

"వెళ్ళిపో!" అన్నాడు లాల్ అసహనంగా.

అతను వెళ్ళిపోయాక చిబ్బర్ వైపు తిరిగాడు. "నిల్ నిన్న మీ జపాన్ కొలాబరేటర్స్‌కి పంపిన లెటర్ కాపీ ఏదీ?"

"ఎందుకు?" చిబ్బర్ కలవరంగా అడిగాడు.

"అభ్యంతరం లేకపోతే చూపించండి."

అతను లేచి వెనుక ఫైలింగ్ క్యాబినెట్ తెరిచాడు.

జాన్ కూడా లేచి సెక్రటరీ టేబుల్ దగ్గరికి కదిలాడు.

చిబ్బర్ ఒక ఫైలుతీసి, తెరచి, లాల్ ముందు పెట్టాడు.

"ఈ కరెస్పాండెన్స్ అంతా మిస్ మీనా టైప్ చేస్తోందా?" అడిగాడు లాల్.

జాన్ ఆ టేబుల్ దగ్గర టైప్ రైటర్‌ని పరిశీలిస్తున్నాడు.

డిటెక్టివ్‌ల చర్యల్ని అయోమయంగా గమని
లాల్ ప్రశ్నకి తలూపాడు చిబ్బర్.

లాల్ ఆ ఫైల్లో ఉత్తరాలు పరిశీలిస్తున్నా
అందులో పది వున్నాయి. వాటిని కళ్ళకు దూరం దగ్గరగా పెట్టి చూస్తూ, "మరో కరెస్పాండెన్స్ ఫై అందుకోండి!" అన్నాడు.

చిబ్బర్ అయోమయంగా మరో ఫైలు లాగి ఇచ్చా
లాల్ దాన్ని తెరచి చూడసాగాడు. ఆ రెం ఫైళ్ళలోని ఉత్తరాల్ని దగ్గరగా పెట్టి చూస్తూ, "ఎ మిషన్స్ ఉపయోగిస్తున్నారు?" అనడిగాడు.

"ఆ ఒక్కటే!" అన్నాడు చిబ్బర్ చూపిస్తూ.

లాల్ ప్రశ్నలు వింటూంటే జాన్ టైప్‌రైటర్ వదిలేసి, టేబుల్ సొరుగు లాగాడు.

"వెల్, చూడండి మిష్టర్ చిబ్బర్" లాల్ అన్నాడు. "ఈ రెండు ఫైళ్ళలోని ఉత్తరాలు ఒకే రైటర్ మీద టైప్ చేయబడ్డా యంటున్నారు. కానీ ఈ రెండింటికీ తేడా గమనించారా? ఈ ఫైల్లో అక్షరాలు సన్నగా వే పడ్డాయి. కానీ మీ జపాన్ కొలాబరేటర్‌కి చెందిన ఫైల్లో మాత్రం ముద్దగా పడ్డాయి. కొంచెం లావుగా వున్నాయి .... చూస్తున్నారా? యెందుకిలా జరిగింది?"

చిబ్బర్ కళ్ళు చిట్లించి చిట్లించి చూడసాగాడు.

జాన్ సొరుగులోంచి కార్బన్ షీట్స్ పెట్టె తీసి చూడసాగాడు. దాన్ని తెరచి ఒక్క క్షణం గడ్డం గోక్కున్నాడు. ఆ తర్వాత వాటిని గబగబా లెక్కపెట్ట సాగాడు.

"అవును, తేడా కన్పిస్తోంది...." అన్నాడు చిబ్బర్. "అయితే మీ రేమని అనుమానిస్తున్నారు?"

"ఆ కార్బన్ షీట్ పెట్టె యెప్పుడు తెరిచారు?"

"అది కొత్త బాక్స్. నిన్ననే తెరిచింది మిస్ మీనా."

"మీ కొలాబరేటర్స్‌కి చివరి ఉత్తరం నిన్ననే వ్రాశారు కదూ?"

"అవును—ఇందులో వుంది."

"చూశాను."

జాన్ లెక్కించడం పూర్తిచేసి, పైన ట్రేలో షీటు అందుకుని చూశాడు. అది బాగా రఫ్ అయి వుంది.

"ఎన్ని పార్టనర్?" అడిగాడు లాల్ అతన్ని.

"తొంభై ఎనిమిది బాక్స్‌లో, ట్రేలో ఒకటి."

"మిస్టర్ చిబ్బర్, ఈ ఉత్తరం ఎన్ని కాపీలు తీశారు?"

"ఒక్కటే."

లాల్ ముఖం వెలిగింది. "ఈ ఫైల్లో ఉత్తరాలన్నీ ఫస్టు కాపీలు. అయినా అక్షరాలు ముద్దగా పడ్డాయి. ఆమె మరో కాపీ తీసి వుండాలి మీకు తెలియకుండా."

"యెందుకు తీస్తుంది?"

"ఇక్కడ్నించి పంపే సమాచారమంతా ఆమె పార్టనర్ కవసరం కదా?"

"లేదు! నేనిక్కడ వుండగా....మరో కాపీ తీసే వీలులేదు!"

"తీస్తుంది, కాగితంమీద కాదు. కాబ్బన్ షీటుమీద. ఈ ఫైల్లో కాపీని డబుల్ షీట్స్ పెట్టి తీసింది..అందుకే అక్షరాలు ముద్దగా పడ్డాయి. ఫస్టు షీట్‌ని తన పార్ట్‌నర్‌కి పంపుతుంది. రెండవది ఇక్కడుంటుంది. అందుకే నిన్న కొత్తగా తెరిచిన బాక్స్‌లో ఒక షీటు తక్కువ వుంది...."

"ఓహ్, ఆమె ఇలా చేస్తుందంటే నమ్మలేక పోతున్నాను!"

"అఫ్‌కోర్స్, ఇది మా గెస్ వర్క్. ఆ కార్బన్ షీటుని ట్రేస్ చేసేవరకు ఈ క్లూ కచ్చితమని చెప్పలేం. కానీ నమ్ముతున్నాం. ఆమెను ప్రశ్నించడానికి ఈ బాక్స్ పట్టుకెళ్తున్నాం. ఆమె ఇంట్లో ఫోన్ వుందా?"

"లేదు."

"ఇల్లెక్కడ?"

చెప్పాడు చిబ్బర్.

## 11

బ్లూ మూన్ ఎపార్టుమెంట్స్ నాలుగో అంతస్తులోని మిస్ మీనా ఫ్లాట్‌కి చేరుకునేసరికి సాయంత్రం అయిదయింది.

ఫ్లాట్‌కి తాళంవేసి వుంది.

జాన్ తాళం తీశాడు మారు తాళాలతో. ఇద్దరూ లోపలి కెళ్ళిపోయి తలుపు మూశారు.

"క్విక్, త్వరగా చూడు!" అన్నాడు లాల్.

జాన్ విసురుగా కదిలి, రెండు గదులూ వెతికేసి, వెనుక గదిలో కబోర్డులోంచి వాటిని పట్టుకొని పరుగెత్తుకొచ్చాడు.

లాల్ వాటిని పట్టి పట్టి చూసి, టేబుల్ మీద పడేశాడు.

"క్విక్, కార్బన్ షీటు!" అన్నాడు మళ్ళీ.

జాన్ సొరుగులన్నీ లాగి వెతకసాగాడు. పై సొరుగులో లాల్ ఏదో చూసి అందుకున్నాడు. కళ్ళు పెద్దవయ్యాయి. దానిమీద అక్షరాల్ని చదివాడు. "దివాకర్.... డిటెక్టివ్" అన్నాడు.

"దివాకర్?" అన్నాడు జాన్, తలెత్తి చూసి.

క్లిక్‌మన్న శబ్దంతో చటుక్కున తెరచుకుంది తలుపు. డిటెక్టివ్‌లు తిరిగి చూసేలోపులో వాళ్ళిద్దరు లోపలి కొచ్చేశారు.

తృళ్ళిపడి, వెంటనే తేరుకుని ముందుకు దూసుకు వచ్చాడు తను. లాల్ పక్కకు తప్పుకోబోయాడు. కానీ పిడికిలి వచ్చి మొఖాన గుద్దుకుంది. ముఖం పట్టుకుని టేబుల్ మీద ఒరిగిపోయాడు. జాన్ అతన్ని ఆపే లోపులో కాలువచ్చి అతని కడుపులో తగిలింది. వెళ్ళి వెనుక గోడకి కొట్టుకున్నాడు.

ఆమె కొయ్యబారి చూస్తోంది.

అతని చేతిలో రివాల్వర్ ప్రత్యక్షమైంది. లేస్తూ అది చూసి జాన్‌ని వారించబోయాడు లాల్. కానీ ఆలస్యమైంది. జాన్ కోలుకుని మెరుపులా వచ్చి కాలితో రివాల్వర్‌ని ఎగరగొడుతూ, చేతులతో దవడ వాయించేశాడు.

అతను గట్టిగా అరిచి కిందపడ్డాడు.

ఆమె కెవ్వుమని తలుపు దగ్గర కురికింది.

జాన్ ముందుకు గెంతి రివాల్వర్‌ని అందుకున్నాడు.

లాల్ విసురుగా కదిలి వెనుక నుంచి ఆమె చేతులు పట్టి లాగాడు.

జాన్ అతనికి రివాల్వర్ గురిపెట్టి, "కదలకు, బాస్టర్డ్" అన్నాడు.

లాల్ ఆమెని కుర్చీలో కూలేశాడు. "చెప్పు! నరేష్‌ని ఎందుకు చంపావు?"

"నేను చంపలేదు!" అర్చిందామె.

"ఇప్పుడు బుకాయించలేవు!"

"నన్నొదలండి—మీ రెవరసలు?"

"లాల్ అండ్ జాన్."

"ఓహ్!"

"నువ్విప్పుడు బుకాయించలేవు! నిన్న సాయంత్రం నువ్వు నరేష్‌ని అతనింట్లో చంపి, పెద్ద నాటకమాడావు. అతని భార్యని తెలివి పోగొట్టి, ఆమె వేలి ముద్రలు అక్కడంతా అద్ది, ఆమె గొంతులో నాకు ఫోన్ చేసి, ఆమెను కారులో వేసుకొని పారిపోయావు!"

"నోర్ముయ్యండి!"

"కానీ సిటీ దాటుతున్నప్పుడు ఆమెకు తెలివి వచ్చింది. లేచి వెనుక నుంచి నీమీద దాడిచేసింది. నువ్వు చెట్టుకి పెట్టేశావు. ఆమె దిగి పారిపోతూంటే వెంబడించావు—యెక్కడో పట్టుకున్నావు. ఏం చేశావామెని?"

"చెప్పను! మీరు చెప్పేదంతా అబద్ధం!"

"ఆ కారులో నీ వేలిముద్రలున్నాయి. నువ్వి కబోర్డులో దాచిన బట్టల మీద రక్తం మరకలున్నాయి. యెలా అబద్ధమంటావు?"

టేబుల్ మీద ఆమె చీరా జాకెట్టు, ఆమె ఒళ్ళోకి విసిరాడు లాల్.

"ఇవి నావి కావు!" అర్చిందామె.

జాన్ ఆ మనిషిని అడిగాడు, "నువ్వెవరివి, మిష్టర్?"

అతను తల అడ్డంగా వూపాడు.

"నువ్వు డిటెక్టివ్వి!"

"నో!"

"నీ పేరు దివాకర్!"

"నో!"

"మరి ఎలా వచ్చింది నీ దగ్గర ఈ రివాల్వర్?"

అతను మాట్లాడలేదు.

"సెర్చ్ హిమ్!" అన్నాడు లాల్.

జాన్ అతని జేబులు వెతికి ఒక కవరు తీశాడు. దాన్ని తెరచి చూసి, "పార్ట్‌నర్, కార్బన్ షీటు" అన్నాడు.

"ఇలా తే!" అన్నాడు లాల్.

జాన్ కవరు లాల్ మీదికి విసిరాడు. లాల్ అందుకుని అందులోంచి షీటు తీశాడు. దానిమీద స్పష్టంగా వున్న మేటరుని చూస్తూ, "వెల్, వెల్, గుడ్ అయిడియా! వన్ ప్లస్ వన్ టైపింగ్‌కి ఒక షీటే అవసరమవుతుంది. ఇదే మేటరున్న కార్బన్ షీటు నీ ఆఫీసులోనూ వుంది. ఇద్దన్న మాట నీ మోడస్ ఓపరెండి ..." అంటూ ఆమె ముఖంలోకి చూశాడు.

ఆమె ముఖం పాలిపోయింది. దించుకుంది.

"ఓ.కే, ఇక బయల్దేరదామా సునీత దగ్గరికి?"

ఆమె ఆ మనిషివైపు గాభరాగా చూసింది.

అతని ముఖంలో కోపం, కసి వెల్లడవుతున్నాయి.

"కమాన్!" లాల్ ఆమె రెక్క పుచ్చుకు లాగాడు. "పార్ట్‌నర్, కిందికి వెళ్ళి నేను కృష్ణన్‌కి ఫోన్ చేస్తాను. అతనొచ్చే వరకు ఇతనికి కాస్త వినోదం కల్గిస్తూ వుండు!"

# 12

కారు స్టార్టుచేస్తూ అడిగాడు లాల్, "చెప్పు, ఎటు పోవాలి?"

ఆమె నీరసంగా పలికింది, "మార్కెట్ పల్లివైపు పోనివ్వండి."

"గుడ్ —" పోనిచ్చాడు లాల్. కారు పోతున్నప్పుడు అన్నాడు మళ్ళీ, "నరేష్‌ని యెందుకు చంపావో చెప్పనే

లేదు."

"మాకు అడ్డొచ్చాడు" అందామె.

"ఓహ్, అతను నీ పార్ట్‌నర్ కాదన్నమాట!"

"కాదు."

"మరెలా వచ్చాడు అడ్డు?"

"మా రహస్యం తెలుసుకున్నాడు. మొదట్లో ఆఫీసు ఎగ్గొడ్తూంటే భార్యతో గొడవలనుకున్నాను. ఎక్కడో గడిపి వస్తున్నాడనుకున్నాను. కానీ నిన్న ఉదయమే తెలిసింది, అతను మా కలాపాల్ని కనిపెడ్తున్నాడని. ఆఫీసు మాని బొంబే వెళ్ళి వస్తున్నాడని. అక్కడ అతన్ని—మీరిప్పుడు పట్టుకున్నతన్ని గురించి ఆరాలు తీస్తున్నాడని. అతని పేరు గుల్‌తాజ్ మొహిద్దీన్. పాకిస్తానీ ఏజెంట్ అతనే నా పార్ట్‌నర్. మూడు నెలల క్రితం పరిచయమయ్యాడు. జపాన్ కొలాబరేషన్‌కి సంబంధించిన వివరాలు అందిస్తూంటే మంచి బహుమానం, పారితోషికం ఇస్తానన్నాడు...."

లాల్ ఆమెని ఓ క్షణం సూటిగా చూశాడు. "వెల్! అప్పుడు?"

ఆమె చెప్పసాగింది, "ఆ పాక్ ఏజెంట్ నన్నలా కోరాడు. మా కొలాబరేటర్స్‌తో కరస్పాండెన్స్ తనకు అందిస్తూండమని చెప్పాడు. వాళ్ళకు మేం పంపే లెటర్స్‌ని డబుల్ కార్బన్స్‌తో టైపుచేసి, అందులో ఒకటి తనకు బొంబాయి అడ్రసుకు పోస్టు చేస్తూండమని అన్నాడు.

"అలాగే చేస్తున్నాను. మా బాస్‌కి తెలియదు. ఆ ఏజెంట్‌కా డిజైన్స్ మీద కన్నుంది. అవి యెప్పుడు యెక్కడ మాకందజేస్తారో, ఆ వివరాలు కావాలి

ముఖ్యంగా. వాటి సెక్యూరిటీ విషయంలో కంపెనీ తీసుకుంటున్న జాగ్రత్తల్ని గురించి నిన్ననే డాక్యుమెంట్ పంపడం జరిగింది, జపాన్‌కి. అందులోనే ఆ డిజైన్స్‌ని అందించడానికి ఈ నెల ఇరవైతొమ్మిదన వస్తున్న వాళ్ళ మనిషిని రిసీవ్ చేసుకోడానికి సిద్ధంగా వున్నామని కూడా తెలుపడం జరిగింది. దీని కాపీ నేను తీసి వుంచాను, తాజ్‌కు పంపాలని. కానీ అతను నిన్న ఉదయమే ఫోన్ చేశాడు బొంబాయినుంచి—"

"ఏమని?" అన్నాడు లాల్. అతని కళ్ళు డ్రైవింగ్ మిర్రర్‌లో వెనుక కన్పిస్తున్న టాక్సీ మీద పడ్డాయి. వేగం తగ్గిస్తూ దాన్ని దగ్గరగా, అనుమానంగా చూశాడు. వెంటనే అతని ముఖంమీద నవ్వు వెలిసింది. వేగం పెంచుతూ అడిగాడు మళ్ళీ, "ఏమని ఫోన్ చేశాడు?"

"మన సంగతి యెవరికో తెలిసిపోయిందని! అదెవరో కాదు—ఈ నరేష్‌కుమారే! మొన్న రాత్రి బొంబాయిలో తాజ్ ఫ్లాట్‌లో రహస్యంగా సోదాచేస్తూ, అప్పుడే తాజ్ రావడంతో అతన్ని కొట్టి పారిపోయాడట! అతన్ని గుర్తుపట్టి తాజ్ వెంటనే చంపేయాలనుకున్నాడట. కానీ బొంబాయిలో అతని చావు కాంప్లికేషన్స్ తెస్తుందని విరమించుకున్నాడట. అతని చావు అతని ఇంటి దగ్గరే, అతని కుటుంబ కారణాలవల్లే జరిగినట్లు సృష్టిస్తే బాగుంటుందనుకున్నాడట—"

"బాగానే అనుకున్నాడు" అన్నాడు లాల్, వెనుక ఆ టాక్సీని గమనిస్తూ.

"ఆ పని నన్ను చెయ్యమని చెప్పి, చెయ్యకపోతే నాకొచ్చే ప్రమాదాన్ని హెచ్చరించాడు. అదెలా చేయాలో కూడా చెప్పాడు ఫోన్‌లోనే! నాకు తప్ప

లేదు. నరేష్‌వల్ల నా ఉద్యోగానికే కాదు — ఉనికికి కూడా ప్రమాదం వుంది....నిన్న సాయంత్రం గుట్టుగా అతనింటికెళ్ళాను. ఇంట్లో ఎవరూ లేరు. అతను బొంబాయి నుంచి వచ్చాడో లేదో తెలియదు. నేను వెనుక దాక్కున్నాను, అప్పుడే సునీత వచ్చింది కారులో. ఆమె చాలా ఆందోళనగా కన్పించింది ....కానీ అప్పుడే వచ్చేశాడు!"

"అప్పుడేం చేశావ్?"

"నేను వాళ్ళ మాటలు విన్నాను, కిచెన్‌లో దాగి. వాళ్ళు హాలులో వున్నారు. అతడెలా తప్పించుకొచ్చాడో చెప్తున్నాడు. రాత్రే ఆమెకు ఫోన్ చేశాడట బొంబాయి నుంచి, ఉదయం వచ్చేస్తున్నట్టు. అతడలా రాకపోతే ఆమె చాలా ఆందోళన చెంది, వనజ అనే ఆమె దగ్గరికి వురికిందట. ఆమె మీ డిటెక్టివ్‌ల సహాయం కోరుతానని వెళ్ళిందట....ఈ మాటలు నాకెంతో బాగా తోచాయి. వాళ్ళు తాము పోట్లాడుకుని దూరంగా గడుపుతున్నట్లు నమ్మిస్తున్నారు. ఇప్పుడతను చస్తే వేరే మోటివ్ వెతకనవసరం లేదు పోలీసులు, ఆమే చంపిందనుకోవడానికి!"

"అవును."

"అప్పుడాలస్యం చేయకుండా కిచ్‌లోంచి కత్తితో పరుగెత్తుకెళ్ళి అతన్ని కడుపులో పొడిచాను, అంతే. ఆమె అడ్డొస్తే తల పట్టి గోడకి బాదాను. తెలివి తప్పి కిందపడింది. అతడింకా ప్రాణాలతో వుంటే పొడిచి—పొడిచి—చంపేశాను."

"అప్పుడు?"

"మీరన్నట్టు కత్తి మీదా ఫోను మీదా ఆమె వేలిముద్రలు అద్దాను. ఆమె పేరుతో మీకు ఫోన్ చేశాను. ఆమెను కారులో వెనుక సీటు కింద వేసుకొని వెళ్ళి

పోయాను."

"ఏం చేద్దామని?"

"హత్యా నేరం ఆమె మీద సృష్టించాం, ఆమె సజీవంగా ఉండకూడదన్నాడు తాజ్. కూకట్ పల్లిలో అతనొక ఇల్లు అద్దెకి తీసుకుని ఉంచుకున్నా డెప్పుడో. అక్కడ బంధించమన్నాడు. మర్నాడు తనొచ్చి చంపుతానన్నాడు. నేనలాగే తీసికెళ్తుంటే మధ్య దారిలో ఆమె లేచి నన్ను కొట్టి పారిపోయింది. నేనెలాగో వెతికి పట్టుకుని ఈడ్చుకెళ్ళి ఆ యింట్లో పడేశాను — ఇప్పుడక్కడే వుంది."

"ఈ ఏజెంట్ యెప్పుడొచ్చాడు?"

"మధ్యాహ్నమే, ఇంకా ఆ యింటికి వెళ్ళలేదు. అతని కోసం లీవు పెట్టి వున్నాను. రాగానే అతడికా కార్బన్ అందించాను. ఇరవై తొమ్మిదన ఆ డిజైన్స్ మా కందించేటప్పుడు నేనూ అక్కడ వుంటాను కాబట్టి వాటిని రహస్యంగా ఫోటోలు తీయమన్నాడు. మినియేచర్ కెమేరా ఇస్తానన్నాడు."

"కానీ—అక్కడ్నుంచి సునీత తప్పించుకుంటే?" అన్నాడు లాల్. వెనుక ఆ టాక్సీని చూస్తూ, "ఆమెను అప్పుడే చంపేస్తే మంచిది కదా?"

ఆమె చటుక్కున లాల్ని చూసింది. ఆమె కళ్ళల్లో ఏవో భావాలు వ్యక్తమయ్యాయి.

"నేనలాగే అనుకున్నాను. కానీ తాజ్ తనే చంపుతానన్నాడు వచ్చి. ఆడవాళ్ళని చంపే పద్ధతి వుందట... వూరికే చంపేయడట...."

"ఓహ్, హి మస్టు బి ఎ సెక్స్ మేనియక్."

"అవును, నన్నూ వదల్లేదతను!"

"నీమీద సానుభూతి లేదు నాకు, మేనియక్స్‌తో సావాసం చేసేవాళ్ళు మృగాలుగా మారిపోతారు. మరి దివాకర్ సంగతేమిటి—?"

"దివాకర్ ఎవరు?" యెదురు ప్రశ్నించిందామె.

"బ్లడీ డిటెక్టివ్."

"నాకు తెలియదు."

లాల్ నవ్వాడు, "ఇంకా బుకాయింపు లెందుకు? నీ ఫ్లాట్‌లో అతని విజిటింగ్ కార్డు దొరికింది..."

ఆమె ముఖం ఎర్రబడింది. తీక్షణంగా చూసింది.

లాల్ నవ్వాడు, "బహుశ ఈ రోజే అతను నీ ఫ్లాట్‌ని దర్శించి బిజినెస్ మాట్లాడాడు. నువ్వు హత్య చేసి పారిపోతుండగా చూశాడు. పచ్చ కాయితాలు దొరుకుతాయనుకున్నాడు. నీ దగ్గర హాజరువేశాడు. నువ్వు భయపడి లొంగివుంటావు. కానీ నీ ఏజెంట్ ఇప్పుడా క్రూక్‌కి పచ్చ కాగితాలకి బదులు మెడకి ఉచ్చు బిగించాలనుకొని వుంటాడు—లేక బిగించేశాడా అప్పుడే?"

ఆమె ముఖం మరింత ఎర్రబడింది. నోరు విప్పలేదు.

"వెల్, కనీసం సునీత దక్కిందా! ఆమె నీకేమేం చెప్పింది?"

"పిచ్చిగా వాగింది! మా అంతు చూస్తుందట! నేను నమ్మలేదు. భర్త తన ఉద్యోగం కోల్పోయే పరిస్థితి ఏర్పడితే, మేనేజిమెంట్ మెప్పు పొందడానికి అనుకోకుండా తగిలిన ఈ ఎడ్వెంచర్‌కి పూనుకున్నాడట! ఆమె సహకరించిందట! అతను బ్రతికివుండి సాధిస్తే కంపెనీ సత్కరించేది! కానీ...."

"మీరు సహకరించలేదు" పూర్తిచేశాడు లాల్.

ఆమె సూచనలిస్తోంటే డ్రైవ్ చేసి ఆమె చెప్పిన

ఇంటిముందు కారాపాడు. ఇద్దరూ దిగారు.

ఆమె ముందు నడిచింది. లాల్ వెనుక వెళ్ళాడు.

పరిసరాలన్నీ నిశ్శబ్దంగా, నిర్జనంగా ఉన్నాయి.

ఆమె తలుపు చేరుకొని చిన్నగా కొట్టింది. లాల్ ఆమె ప్రక్కన నిలబడ్డాడు.

గబుక్కున తలుపు తీసి ఒక మనిషి వెలుపలికొచ్చాడు.

అతని చేతిలో రివాల్వర్ వుంది, "హేండ్సప్, మిష్టర్ లాల్!" అన్నాడతను గురిపెట్టి, క్రూరంగా.

లాల్ కలవరంగా ఆమెని చూశాడు. ఆమె ఆ మనిషి వెనక్కి గెంతింది.

"మిష్టర్ లాల్!" హెచ్చరించాడా మనిషి మళ్ళీ.

"దివాకర్?" అన్నాడు లాల్, చేతులెత్తుతూ.

"యస్, నేనిక్కడ గార్డు చేస్తున్నాను. ఈ జాబ్‌కి ఈమె అదనంగా ఇస్తానంది. కానీ మీరొచ్చి చెడగొట్టేశారు. టు హెల్ విత్ ఇట్! చెక్కేస్తున్నాను. కమాన్ మీనా, పారిపోవాలి!"

అతడామె చెయ్యి పట్టుకుని అడుగులేశాడు.

"మిష్టర్ లాల్, మమ్మల్ని పట్టుకోకండి. మిమ్మల్ని షూట్ చేయడానికి వెనుకాడను!" హెచ్చరించాడు మళ్ళీ.

ఆమె లాల్‌ని చూసి హేళనగా నవ్వింది.

"టాటా, పూర్ డిటెక్టివ్!"

వాళ్ళిద్దరు వెళ్ళిపోతూంటే, లాల్ నోరు తెరచుకుని చూడసాగాడు.

తేరుకొని కసురుకుంటూ ఇంట్లో కురికాడు.

గదిలో ఆమె మంచంమీద కట్టిపడేసి వుంది. నోరు కూడా కట్టేసి ఉంది. జీవం లేనట్టు ఉంది.

లాల్ గబగబా కట్లు విప్పేశాడు.

"భయంలేదు, నేను డిటెక్టివ్‌ని. కమాన్, నాతో రండి!" ఆమె చేయిపట్టి లేపాడు.

"ఓహ్, వాళ్ళు హంతకులు! వాళ్ళెందుకు పోనిచ్చారు!" అర్చింద్దామె లేస్తూ.

"తప్పలేదు. పదండి వెళ్ళిపోదాం...."

టాక్సీలో వెంటాడిన మనిషి గబగబా ఇంట్లోకొచ్చాడు.

"మిష్టర్ డిటెక్టివ్! మర్యాదగా అమ్మాయిని అప్పగించండి" అన్నాడతను.

అతని చేతిలో దుడ్డు కర్ర ఉంది.

"నేనెవరో వాళ్ళకి తెలియదు. వెళ్ళిపోతూంటే వెనుక నుంచి తలలమీద కొట్టి, మీ కారులో పడేశాను. ఇదిగో రివాల్వర్" అన్నాడు మళ్ళీ, రివాల్వర్ అందిస్తూ.

ఉలిక్కిపడి, విస్మయంగా చూశాడతన్ని లాల్.

"నన్ను షాడో చేస్తూంటే నవ్వుకున్నాను. మీరింత గొప్ప ఘనకార్యం చేస్తారనుకోలేదు!" అన్నాడు అతన్ని చూస్తూ.

ముగ్గురూ బయటికి అడుగులేశారు.

——:అయిపోయింది:——

# హంతకు లెందరో?

బొమ్మిరెడ్డి అచ్చారావు

ఫోన్ గణగణ మోగింది.

ఇన్ స్పెక్టర్ శ్రీనివాస్ ఫోన్ ఎత్తి "హల్లో క్రైం బ్రాంచ్!" అన్నాడు.

అవతల ఎవరో చెప్పుకుపోతున్నాడు.

"నాగార్జున నగర్ యెనిమిదో ప్లాటుకి వెంటనే వెళ్ళండి. అక్కడ మీకో శవం దర్శనమిస్తుంది. ప్రాక్టికల్ జోక్ అని వెళ్ళటం మానేశారు గనుక! సెంట్ పర్సంట్ ఫాక్ట్!" అన్నాడా వ్యక్తి.

"హల్లో మీ రెవరు?" శ్రీనివాస్ గబగబ అడిగాడు.

సమాధానంగా అవతలనుంచి ఫోన్ పెట్టేసిన చప్పుడు.

శ్రీనివాస్ సార్జంటుని పిలిచి "జీప్ అరేంజి చెయ్యమని చెప్పు డ్రైవర్ తో. డాక్టరుకి, ఫోటోగ్రాఫర్ కి, వేలిముద్రల నిపుణులకి తెలియచెయ్యి. కేంప్ నాగార్జున నగర్ అని చెప్పు" అన్నాడు.

సార్జంటు సెల్యూట్ చేసి వెళ్ళిపోయాడు.

మరో పది నిమిషాల తర్వాత శ్రీనివాస్ ఎక్కిన జీవ్ నాగార్జున నగర్ ఎనిమిదో ప్లాటు ముందాగింది.

శ్రీనివాస్ జీప్ దిగి సార్జంట్కి సైగ చేసి చకచక గుమ్మం ఎక్కి తలుపులు తోశాడు. వెంటనే తెరుచుకున్నాయి.

ముందు గదిలోని దృశ్యం చూసి ఒక క్షణం ఆగిపోయాడు శ్రీనివాస్.

అక్కడ మంచానికి అడ్డంగా పడివుంది శవం!

అతని వెనకనే నిపుణులు ప్రవేశించారు.

డాక్టరు శవాన్ని చూస్తూనే, "జస్టు మర్డర్, ఓ గంట కూడా పూర్తిగా కాలేదు" అన్నాడు—బ్లడ్ వూజింగ్ పరీక్షగా చూస్తూ.

శ్రీనివాస్ తలూపాడు.

ఫోటోగ్రాఫరు, వేలిముద్రల నిపుణుడు తమ పనులు చకచక చేసుకుపోతున్నారు.

శ్రీనివాస్ శవం చుట్టుపక్కల పరిశీలనగా చూశాడు. అది బెడ్ రూం. మంచంకాక ఓ ఫోల్డింగు టేబిలు, రెండు ఛెయిర్స్ వున్నాయి గదిలో. అల్మెయిరా నిండా ఏవేవో పుస్తకాలున్నాయి. గోడలకి కేలండర్లు, ఓ పెయింటింగు వ్రేలాడుతున్నాయి.

సార్జంటుని పిలిచి ఏదో చెప్పాడు శ్రీనివాస్. అతను తలూపి వెళ్ళిపోయాడు.

శ్రీనివాస్కి ముఖ్యమైన ఆధారాలేవీ లభించలేదు. అయినా పట్టు వదలకుండా చూస్తూనే వున్నాడు.

సార్జంటు లోనికొచ్చాడు.

"ఇది కూర్మారావు అనబడే ఇన్కంటాక్స్ ఉద్యోగి యిల్లట సార్! అతనికి భార్యా, ఓ కొడుకు వున్నారట.

భార్య యెందుకో పుట్టింటికి వెళ్ళిందట. ఇప్పటివరకు కూర్మారావు చనిపోయిన సంగతి-అదే హత్య చెయ్యబడ్డ సంగతి—యెవరికీ తెలియనట్టే వుంది" అన్నాడు.

శ్రీనివాస్ తలూపాడు.

ఫోటోలు తీయటం పూర్తయింది. వేలిముద్రల నిపుణుడు తన పని పూర్తిచేసుకున్నాడు.

శ్రీనివాస్ సార్జంటువైపు తిరిగి, "కూర్మారావు దగ్గర వాళ్ళ అడ్రసు—అదే భార్య పుట్టింటి అడ్రసు—పక్కవాళ్ళెవరికైనా తెలుసునేమో కనుక్కో!..." అంటూ యింకా ఏదో అంటూండగానే యింటిముందు ఆటో ఆగింది. ఎవరో స్త్రీ ఆటో దిగి ఫేర్ చెల్లిస్తోంది. వెంట మూడేళ్ళ కుర్రాడున్నాడు. ఆమెకు దాదాపు యిరవై యిరవై రెండేళ్ళుంటాయి.

ఆమె యింటిముందు పోలీసు జీప్ ఆగివుండటం వింతగా చూస్తూ లోనికొచ్చింది. శ్రీనివాస్ ఆమె యెవరయిందీ అర్థం చేసుకున్నాడు.

"ఏమిటండీ, ఏమయింది?" అన్నదామె ఆత్రుతగా, అనుమానంగా పోలీసుల్ని చూస్తూ.

శ్రీనివాస్ ఆమె వంక జాలిగా చూసి, "మీరు కూర్మారావుగారి భార్య అనుకుంటాను. గుండె నిబ్బరం చేసుకోండి, మీ వారినెవరో హత్య చేశారు" అన్నాడు.

ఆమె మొదలు నరికిన చెట్టులా కూలిపోయింది. గుండెలు బాదుకుని ఏడ్చింది.

అందరు మౌనంగా చూస్తున్నారు. ఇంతలో చుట్టు పక్కల వాళ్ళు పోగయ్యారు. వాళ్ళకీ విషయం తెలిసి పోయింది.

పదినిమిషాల తర్వాత ఆమె తేరుకున్నది.

"యెవడు వాడు? యెవడు నా భర్తని పొట్టన పెట్టు కున్నది?" అన్నది హీన స్వరాన.

"అదే మేము తెల్సుకోవలసి వుంది. యెవరో ఫోన్ చేసి యిక్కడ హత్య జరిగిందని చెప్పాడు. బహుశా అతనికి హంతకుడెవరో తెలిసి వుండాలి. మేము వెంటనే బయల్దేరి వచ్చేసరికి మా కెదురయిన పరిస్థితి ఇది!" అన్నాడు శ్రీనివాస్.

"మీరు శ్రమనుకోక కొన్ని వివరాలు చెప్పాలి. ఇలాంటి పరిస్థితిలో మిమ్మల్ని విసిగిస్తున్నందుకు అన్యధా భావించవద్దు" అన్నాడు మళ్ళీ శ్రీనివాస్.

ఆమె మౌనంగా తలాడించింది. పక్కనే వున్న మూడేళ్ళ కుర్రాడు బిక్క మొహం వేసుకొని చూస్తూ న్నాడు. వాడికి అర్థం కానిదల్లా తల్లి ఎందుకేడుస్తుందో, యింటినిండా యింతమంది కొత్తవాళ్ళెందుకున్నారోనని!

"మీ వారేం చేస్తూంటారు?" అడిగాడు శ్రీనివాస్.

"ఇన్‌కంటాక్స్ డిపార్టుమెంటులో సీనియర్ ఎక్కౌంటెంటుగా వున్నారండి" అన్నదామె.

"పేరు?"

"కూర్మారావుగారు."

"మీ పేరు?"

"లలిత."

"ఈ యింట్లో యింకా యెవరెవరుంటున్నారు?"

"నేను, మావారు, బాబు అంతేనండి."

"మీరీ మధ్య యిక్కడలేరా?"

"పుట్టింటికి అమలాపురం వెళ్ళానండి. వారం రోజు లయింది. ఈయనకు హోటలు తిండిపడదు. రమ్మని

పెలిగ్రాం యిచ్చారు. బయల్దేరివచ్చేశాను. వచ్చేసరికి"
ఆమె మాటల్ని దుఃఖం మింగేసింది.

"సరే, మీవారికి వ్యక్తిగతంగా యెవరైనా గిట్టని వాళ్ళున్నారా?"

"నాకు తెలిసి యెవరితోను గొడవపడే మనిషి కాదండి. అందరితోను స్నేహ భావంతో నే మెలగుతుంటారు."

"బాగా గుర్తు చేసుకొని చెప్పండి. ఈ మధ్య ఎవరితోనైనా ఘర్షణ పడటంగాని. అలాంటి సంఘటన లేమైనా జరిగాయేమో కాస్త ఆలోచించి చెప్పండి."

లలిత రెండు క్షణాల తర్వాత చెప్పింది.

"ఈయనకు రజనీకాంత్ అనే స్నేహితుడున్నాడండి. యెందుకు చెడిందో యిద్దరికీ చెడిపోయింది. రజనీకాంత్ పేరు చెపితేనే యీాయన మండిపడేవారు."

"రజనీకాంత్ యెలాంటి స్నేహితుడు? అంటే చిన్ననాటి స్నేహితుడా, పరిచయస్థుడా లేక కొలీగా?"

"కొలీగ్. ఈయనతో పని చేస్తారు"

"యెందుకు చెడిందో చెప్పగలరా?"

"అడిగాను. ఈయన చెప్పలేదు. నేను రెట్టించలేదు."

"ఇదివరలో రజనీకాంత్ యిక్కడికొచ్చేవాడా?"

"వచ్చేవారండి, చెడాక రాలేదు."

సార్జంటు వచ్చి శ్రీనివాస్ ముందు నిలబడ్డాడు, శవాన్ని మార్చ్యురీకి తరలించమంటారా అని అడగడానికి.

శ్రీనివాస్ లేచి శవం వద్ద మరోమారు ఎక్స్‌రే కళ్ళతో పరీక్ష చేశాడు.

డాక్టరువంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"గాయం లోతు మూడున్నర అంగుళాలు. మల్టీ ఫుల్ ఇంజరీస్ కనీసం నాలుగుసార్లు పొడిచివుండాలి. మొదటి రెండు పోట్లకే రక్తం బాగా పోయి వుండాలి. ఛాతీలో సరాసరి పొడవటంవల్ల గుండెకు పోట్లు తగిలాయి. పోస్టు మార్టమ్ చేశాక పూర్తి వివరాలు యిస్తాను" అన్నాడు డాక్టరు.

"హత్యాయుధం దొరకలేదా?"

"బహుశా హంతకుడు తనతో తీసుకుపోయుండాలి"

వేలిముద్రల నిపుణుడు చెప్పాడు. "మంచం తల వైపున్న డెకోలం మీద, తలుపు హేండిలు మీద వేలి ముద్రలు దొరికాయి. అవి హతుడి ముద్రలు కావు. అతని భార్యవి కూడా కాదు. ఆమెవి తీసుకుని టాలీ చేశాను."

"గుడ్! కీప్ దెమ్" అన్నాడు శ్రీనివాస్. అతని చూపు ఓ చోట సిరంగా నిలిచిపోయింది. మంచానికి దిగువ ఎర్రటి అక్షరాలు కనిపించాయి. దగ్గరగా వెళ్ళి చూశాడు.

రక్తంతో రాసిన అక్షరాలు. రజనీకా... అని మాత్రం రాసి వున్నాయి. తర్వాత ఏం రాయలేదు. బహుశా హతుడు హంతకుడి పేరు తన రక్తంతో రాసి వుండాలి. రజనీకాంత్ పేరు రాయబోయాడన్నమాట.

శ్రీనివాస్‌కి మిస్టరీ విడిపోయింది. లలిత చెప్పిన దానికి, ఆ అక్షరాలకి పొంతన కుదిరింది.

ఫోటోగ్రాఫర్‌ని పిలిచి ఆ అక్షరాలు ఫోటో తీయించాడు.

ఆ తర్వాత లలితవంక తిరిగి, "రజనీకాంత్ అడ్రసు తెలిస్తే చెప్పండి" అన్నాడు.

లలిత చెప్పింది.

# 2

రజనీకాంత్ యింటిముందు జీప్ దిగాడు శ్రీనివాస్.

లోపలినుండి ఏడుపులు గోలగా వినిపిస్తున్నాయి.

విసుపోయాడు శ్రీనివాస్. లోపలికి వెళ్ళాడు. అక్కడ ఓ పాతికేళ్ళ యువకుడ్ని మంచంమీద నిండుగా దుప్పటి కప్పి పడుకోబెట్టారు.

శ్రీనివాస్‌ని చూడగానే ఏడుపులు ఆగిపోయాయి.

"రజనీకాంత్ యెవరు?" అడిగాడు శ్రీనివాస్.

పదహారేళ్ళ కుర్రాడు ముందుకొచ్చి, అన్నయ్య చచ్చిపోయాడు" అన్నాడు.

శ్రీనివాస్ విస్మయంగా చూశాడు.

"రజనీకాంత్ మీ అన్నయ్యా? ఎలా చనిపోయాడు?" అడిగాడు?"

కుర్రాడేదో చెప్పబోయేంతలో ఓ నడివయసాయన ముందుకొచ్చి, "ఆ అబ్బాయికి హార్టు కంప్లెయింట్ వుంది సార్. వాడు నా మేనల్లుడే!" అన్నాడు.

"మీ పేరు?" అడిగాడు శ్రీనివాస్.

"చలమయ్య" అన్నాడు రజనీకాంత్ మామ.

"అబ్బాయి చూడబోతే చిన్న వయసువాడిలా వున్నాడు. ఇంత చిన్నవయసులో హార్టు ఫెయిల్యూరా?" శ్రీనివాస్ చలమయ్య ముఖంలోకి సూటిగా చూశాడు.

"అవును సార్! చిన్న వయసుకే వాడికి నూరేళ్ళు నిండిపోయాయి" అన్నాడు చలమయ్య.

శ్రీనివాస్ శవం ముఖంమీది నుండి గుడ్డ తొలగించి చూశాడు. శరీరం నీలి రంగుగా కనిపించింది. శ్రీనివాస్ కళ్ళు మెరిశాయి. ఎస్. యిన్‌టాక్సికేషన్ సింప్టమ్స్.

శ్రీనివాస్ గుడ్లురిమి చూశాడు చలమయ్య వంక.

"నాతో హాస్యాలు, అబద్ధాలు కుదరవు. ఈ అబ్బాయికి యెవరో విషమిచ్చి చంపేశారు. పోలీసులకి తెలియచెయ్యాల్సిన బాధ్యత మీది. అలా చెయ్యకపోగా నేను స్వయంగా వచ్చి అడిగినా అబద్ధం చెప్పి చట్టం కళ్ళు మూయాలనుకుంటున్నారు. మీమీద రెండు కేసులు పెట్టి లాకప్ లో పెట్టిస్తాను" అన్నాడు.

ఓ నడివయసామె ముందుకొచ్చి చేతులు జోడించింది.

"ఇన్స్పెక్టర్ గారూ! క్షమించండి. నేను రజనీ తల్లిని. మా అన్న ఏదో తెలియక అలా అబద్ధం చెప్పాడు. చెట్టంత కొడుకుని పోగొట్టుకున్న నేను అబద్ధం చెప్పాల్సిన పనిలేదు. పోలీసులకు తెలిస్తే బిడ్డను కోసి పడేస్తారని, అంత్యక్రియలయినా ప్రశాంతంగా ముగిద్దామని మా తాపత్రయం" అన్నదామె.

శ్రీనివాస్ కి ఆ ముసలి తల్లి మీద జాలివేసింది.

"అసలేం జరిగిందో చెప్పండి" అన్నాడు.

"నిన్న రాత్రి వరకు బాగానే వున్నాడు బాబూ! రాత్రి రెండో ఆట సినిమా చూసి వచ్చాడు. నేనే తలుపు తీశాను. వచ్చి పడుకున్నాడు. తెల్లారేసరికి బిడ్డలో చలనంలేదు. బాగా పొద్దెక్కే వరకు లేవలేదు. సినిమా చూసిన బడలిక నిద్రలేమివల్ల అనుకున్నాం. ఉదయం పది గంటలయినా లేవలేకపోతే లేపుదామని వెళ్ళాను. మంచుగడ్డలా తగిలింది శరీరం" అన్నదామె.

శ్రీనివాస్ కి కూర్మారావు హత్యా సమయం మెదులోంది మనసంతా. కూర్మారావు రాత్రి పదకొండున్నర పన్నెండు గంటల మధ్య హత్య చేయబడినట్టు డాక్టరు నిర్ధారించాడు. ఆ సమయంలో రజనీకాంత్ ఇంట్లో లేడని అతని తల్లే చెపుతోంది. అయితే కూర్మారావుని హత్య

చెయ్యటానికే రజనీకాంత్ బయటకు వెళ్ళి ఆలస్యంగా యింటికొచ్చాడు. మరి విషప్రయోగం ఎలా, యెప్పుడు జరిగింది?

"మీ అబ్బాయికి పెళ్ళయిందా?" అడిగాడు శ్రీనివాస్.

"లేదు బాబుగారూ!"

"నిన్న రాత్రి మీ అబ్బాయి వచ్చినపుడు ఏ దుస్తులు ధరించి వున్నాడు?"

"ఇప్పుడు వాడి ఒంటిమీదున్నవే బాబూ!"

శ్రీనివాస్ దుప్పటి పూర్తిగా తొలగించి చూశాడు. దుస్తులమీద నెత్తుటి మరకలు పడకుండా జాగ్రత్త తీసుకుని వుండాలి! లేదా యింటికొచ్చి బట్టలు మార్చుకు నయినా వుండాలి. ముసలామెకు సరిగా గుర్తుండి వుండక పోవచ్చు.

"మీ అబ్బాయి నిన్న బయటికి ఎన్ని గంటలకు వెళ్ళాడు?"

"రాత్రి తొమ్మిది అయివుంటుంది."

"ఒక్కడే వెళ్ళాడా?"

"లేదు. మరో స్నేహితుడున్నాడు."

"అతని పేరు?"

"వినోద్. అబ్బాయితో కలిసి చదువుకున్నాడు."

"మీ అబ్బాయి ఏం చదివాడు?"

"ఎం. ఎస్సీ. పరీక్షలు ఈ సంవత్సరమే రాశాడు."

"నిన్న రాత్రి ఇంట్లో నే భోంచేశాడా?"

"అవును బాబూ! నేనే వడ్డించాను."

"మీ అబ్బాయి రాత్రి రెండో ఆట చూసివచ్చా డన్నారుకదా! అప్పుడతని స్థితి యెలా వుంది? తొందర

పాటుగాని, యెదయినా కలవరంగానీ వున్నట్టు కని
పించాడా?"

రజనీకాంత్ తల్లి వెంటనే మాట్లాడలేదు.

"చెప్పండి. నాతో చెప్పినందువల్ల మీకు ఉపయోగమే గాని ప్రమాదమేం లేదు."

"కొద్దిగా బ్రాందీ వాసనో, బీరువాసనో వచ్చినట్టని పించింది బాబూ!"

"అంటే మీ అబ్బాయి తరచు మత్తు పానీయాలు సేవిస్తాడా?"

"ఇదివరలో ఒక్కసారే ఇలా జరిగింది బాబూ! అప్పుడు నేను బాగా చీవాట్లు వేశాను. మానేశాడనే అనుకున్నాను. గత రాత్రి మళ్ళీ తాగినట్టున్నాడు."

"వినోద్ యెలాంటి వాడు?" అతనికీ తాగుడు అలవాటు వుందా?"

"అసలు వాడి మూలాన్నే వచ్చింది బాబూ వీడికీ పాడు అలవాటు."

"అంటే వినోద్ అలవాటు చేశాడంటారా?"

"అవును. వాడి గుణం కూడా మంచిది కాదు. అబ్బాయికి వాడే తాగుడు, సిగరెట్టు అలవాటు చేశాడు. వాడు జమిందారు బిడ్డ. ఏం చేసినా చెల్లుతుంది. పైగా అత్తవారినుండి బాగా ఆస్తి కలిసింది."

"వినోద్‌కి పెళ్ళయిందా!"

"అవును బాబూ. కావటానికి మావాడి ఈడువాడే! కాని అన్ని దుర్లక్షణాలూ వున్నాయి. ఓసారి మా అమ్మాయి ఉషను ఏదో తేలికమాట తూలాడట కూడా. అది నాకు చెప్పింది. నేను మా వాడికి చెప్పి వాడి స్నేహం మానమని చెప్పాను. ఆ తర్వాత వాళ్ళిద్దరు

ఘర్షణపడ్డారు కూడా."

"మరి తర్వాత కూడా ఆ వినోద్‌తో స్నేహంగానే వున్నాడా?"

"కొన్నాళ్ళు వినోద్ ఇక్కడికి రావటం మానేశాడు. పోనీలే పీడ విరగడైపోయిందనుకుంటే మళ్ళీ వారం రోజుల్నించి రాకపోకలు మొదలెట్టాడు."

"అంటే వారం రోజుల క్రితం వరకు యిద్దరూ మాట్లాడుకోవటం కూడా బంద్ చేశారన్నమాట!"

"అవును బాబూ! ఇంతలో మళ్ళీ రావటం మొదలెట్టాడు. వాడి తాగుడు అలవాటుకి మావాడు తలొగ్గి వుంటాడని నా కనిపించింది — రాత్రి వాడి పరిస్థితి చూశాక!"

"అయితే నిన్న రాత్రి మీవాడు వినోద్ కలిసి తాగి వుంటారని మీ అభిప్రాయమా?"

"కావచ్చు. అందుకే దగ్గరుండి వెంటబెట్టుకు వెళ్ళాడు గత రాత్రి."

"మీ అబ్బాయితో చనువుగా తిరిగేవాళ్ళ అడ్రసులు కొన్ని చెప్పండి. అలాగే వినోద్ అడ్రసు కూడా!" అన్నాడు శ్రీనివాస్.

"అవన్నీ మా రెండోవాడికి తెలుస్తాయి బాబూ!" అన్నదామె.

పదహారేళ్ళ కుర్రాడు ముందుకొచ్చి నాలుగు అడ్రసులు చెప్పాడు. రాసుకున్నాడు శ్రీనివాస్.

తర్వాత రజనీకాంత్ తల్లి వంక తిరిగి, "ఇప్పటికైనా మించిపోయింది లేదు. జరిగిన విషయం రిపోర్టు రాసి ఇవ్వండి. వీలైనంత త్వరగా పోస్టుమార్టం చేయించి మీ అబ్బాయిని మీకు అప్పగిస్తాను. అది హత్యో ఆత్మ

హత్యో మేము నిర్ధారణ చేసుకోవలసి వుంది" అన్నాడు శ్రీనివాస్.

రజనీకాంత్ తల్లి మౌనంగా తలూపింది.

చలమయ్య ఓ కాగితంమీద రిపోర్టు రాసియిచ్చాడు.

"ఓ పదినిమిషాల్లో మా సిబ్బంది మీ ఇంటికొస్తారు. వాళ్ళకేం చెయ్యాల్సిందీ చెప్పి పంపుతాను" అని లేచి బయటకి వచ్చేశాడు శ్రీనివాస్.

అతనికి జరిగిన విషయం గమ్మత్తుగా అనిపిస్తోంది. కూర్మారావుని రజనీకాంత్ హత్య చేశాడనటంలో యెలాంటి సందేహంలేదు. అందుకోసమే రాత్రి తొమ్మిది గంటలకు రజనీకాంత్ బయటికి వచ్చాడు. అయితే వినోద్ అనే స్నేహితుడికి కూడా ఇందులో ప్రమేయముందా లేదా అన్నది తేలాలి!

అయితే రజనీకాంత్ కి విషప్రయోగం ఎవరు చేశారు? వినోదా? కూర్మారావుని చంపిన తర్వాతనే ఇది జరిగి వుంటుంది. ఇద్దరు తాగుతున్న సమయంలో వినోద్ విషం కలిపి రజనీకాంత్ ని చంపివుంటాడు. అయితే వెంటనే ప్రాణం పోకుండా మోతాదు పరిమాసుకుని కలిపాడు. అందుకే రజనీకాంత్ ఇంటికొచ్చి పడుకుని—నిద్రపోయే వరకు బతికి వున్నాడు.

వినోద్ రజనీకాంత్ ని యెందుకు చంపాల్సి వచ్చింది? అసలు వినోద్ చంపాడా? కూర్మారావుని యిద్దరు కలిసి హత్య చేసివుంటే కూర్మారావు వాళ్ళిద్దరి పేర్లూ రక్తంతో ఎందుకు రాయలేదు? ఒక వేళ తర్వాత రాసేవాడేమో? రజనీకాంత్ పేరే పూర్తిగా రాయకుండానే ప్రాణం పోయి వుంటుంది. కూర్మారావు యింట్లో ఒంటరిగా వున్నాడు. సమయం చిక్కింది. ప్లాన్ చేసి ఇద్దరూ

చంపేశారు. అంతే, అదే అయివుంటుంది.

శ్రీనివాస్ జీప్ స్టార్టు చేశాడు.

పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేసి రజనీకాంత్ అడ్రసు చెప్పాడు.

## 3

ఓ ఇరవయ్యేళ్ళ యువతి తలుపు తీసింది.

యెదురుగా ఇన్‌స్పెక్టర్ని చూసి గతుక్కుమన్నది.

"మిష్టర్ వినోద్ యిల్లు ఇదేనా?" అడిగాడు శ్రీనివాస్.

"అవునండి. వారింట్లో లేరు అన్నదామె.

శ్రీనివాస్ చొరవగా లోపలికి వెళ్ళాడు. అది రెండంతస్తుల మేడ. కింద పైన సమానంగా కట్టబడ్డ గదులు. పైన యెక్కడైనా వుండివుంటే బయటికి కనిపించే అవకాశంలేదు. జీప్ చూసి దాక్కున్నాడేమో?

"ఈ యింట్లో యెవరెవరుంటున్నారు?" అడిగాడు శ్రీనివాస్.

"నేను, మావారు యిద్దరే!"

"ఇద్దరికోసం ఇంత పెద్ద ఇల్లా?"

"ఇది మా నాన్నగారు కట్టించి యిచ్చారు."

"మీ పేరు?"

"వీణావతి."

"వినోద్ యెప్పుడొస్తారు?"

"తెలీదు."

"పోనీ యెప్పుడు బయటికి వెళ్ళారు?"

"ఆ వివరాలన్నీ మీకెందుకడుగుతున్నట్టు?"

"ఓ కేసు విషయంలో దర్యాప్తు చేస్తున్నాను."

"పోలీసుల దృష్టిలో పదేంత నేరం ఏదీ చేయు

లేదాయన."

"పరిస్థితులు, అవకాశం మనిషిని నేరస్తుడిగా మార్చడం సర్వసాధారణంగా జరిగేదే!"

"అది కూటికి లేనివాళ్లు చేసేపని. మావారికి అంత ఖర్మం పట్టలేదు" అణువణువునా ఐశ్వర్యవంతులమనే అహంకారం మాటల్లో రూపం దాల్చుకుంటోంది.

శ్రీనివాస్‌కి ఆమె ఆంతర్యం అర్థమయింది. ఇప్పుడు తను ఇల్లు సోదా చేస్తానంటే ఆమె అంగీకరించదు కూడా.

"మీవారు రాత్రి తొమ్మిది గంటలనుండి అర్థరాత్రి వరకూ మీ యింటలేరు. యెక్కడికి వెళ్ళారో చెప్ప గలరా?"

ఆమె గతుక్కుమని అంతలోనే సర్దుకుంది.

"నో, ఆయన బయటకే వెళ్ళలేదు నిన్నరాత్రి. ఈ రోజు ఉదయం పదిగంటలవరకు బయట యెక్కడికీ కదల్లేదు."

శ్రీనివాస్‌కి ఆమె అబద్ధం చెప్తున్నదని అర్థమై పోయింది.

"మీరు నిజాన్ని దాస్తే చాలా బాధపడాల్సి వుంటుంది తరవాత!"

"బెదిరించనక్కర్లేదు. అసలు ఇంత సేపు మీరు నాతో అనవసరంగా వాగ్వివాదం పెట్టుకోవటం మర్యాదగా లేదు. మా నాన్నగారికి ఫోన్ చేస్తే మీ విషయం తేల్చు కుంటారు."

శ్రీనివాస్‌కి ఆమె ప్రవర్తనకు బాగా కోపం వచ్చింది.

"అలాగే చెయ్యండి. తన అల్లుడి ప్రయోజకత్వం గురించి తెలుసుకుని సంతోషిస్తారు."

"అయితేనెప్పుడూ ప్రయోజనమే!" ఆమె తల తిక్క సమాధానాలకు శ్రీనివాస్ తనని తాను అదుపులో పెట్టుకోలేక పోయాడు.

"మీ వారు ఓ హత్య కేసులో అనుమానితుడు. అతడిని హతుడితో చివరిసారిగా చూసినవాళ్ళు చాలా మంది సాక్ష్యమున్నారు."

"హత్య కేసా?"

"ఎస్. రజనీకాంత్ హత్య కేసు."

వినోద్ భార్య అదిరిపడింది. "రజనీకాంత్ హత్య చేయబడ్డాడా?" అన్నది అస్పష్టంగా.

"ఎస్. రజనీకాంత్, మీవారు, నిన్న రాత్రి మరో హత్య కేసులో పాల్గొన్నారు. తర్వాత విందు చేసుకున్నారు. ఆ తర్వాత మీ వారు రజనీకాంత్‌ని పరలోకానికి పంపించటానికి సర్వసన్నాహాలు స్వయంగా చేశారు."

"అబద్ధం."

"అబద్ధాలాడుతున్నది మీరు! మీ వారిని నిర్దోషిగా చూపించటానికి వృథా ప్రయాసపడుతున్నారు."

ఆమె వెంటనే మాట్లాడలేదు.

"ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ఓ పోలీసాఫీసరుతో నిజాన్ని కప్పిపుచ్చి చెప్పటంవల్ల మీ అంతమీరే నేరాన్ని పెంచుకుంటున్నారని మీరిప్పటికైనా గ్రహిస్తే మంచిది."

వీణావతి కొద్ది క్షణాలు మాట్లాడలేదు.

మీ వారేం చేస్తూంటారు?" ఆమె మెత్తబడుతోందని గ్రహించాడు శ్రీనివాస్.

"బిజినెస్. ఫైనాన్స్ కార్పొరేషన్ వుంది."

"ఈ మధ్య రజనీకాంత్ మీ వారితో కలిసి ఇక్కడికి వచ్చాడా?"

"వారం రోజుల క్రితం వచ్చాడు."

"మీ వారితో అతనికి మనస్పర్థలేమైనా వున్నాయా?"

"వాళ్ళిద్దరు క్లాస్ మేట్స్, ఆ మధ్య ఏదో మాటా మాటా అనుకున్నారట. తర్వాత మామూలుగా కలిసి పోయారు."

"ఆల్ రైట్ ఇంకో విషయం చెప్పండి. మీ వారు, రజనీకాంత్ యెప్పుడైనా ఇక్కడ తాగుతుండేవారా?"

వీణావతి శ్రీనివాస్‌కి చాలా విషయాలు తెలుసని అర్థం చేసుకుంది.

అవునన్నట్టు తలాడించింది.

"అందుకు మీరెన్నడూ అభ్యంతరం చెప్పలేదా?"

"లేదు. ఈ రోజుల్లో తాగటం ఫాషన్ గా. అదీగాక మా వారు బాగా డబ్బులో పుట్టి పెరిగిన మనిషి. పది మందిలోను స్టేటస్ సింబల్ గా డ్రింకింగ్ అలవాటు చేసుకున్నారు. అభ్యంతరం పెట్టాల్సినదేం లేదనిపించింది నాకు."

"మీ వారు తాగటం వేరు. స్నేహితుణ్ని యింటికి తీసుకొచ్చి తాగటం వేరు. ఆ తాగుడు మైకంలో ఆ స్నేహితుడే ఒకోసారి శత్రువులా ప్రవర్తించటం, అసభ్యంగా ప్రేలాపన చెయ్యటం జరిగితే మీకు ఇబ్బందిగా వుండదా?"

"నాకలా అనిపించలేదు."

వీణావతి మనస్తత్వం అర్థమవుతోంది శ్రీనివాస్‌కి.

"ఓ.కే. మీ వారు యెక్కడికి వెళ్ళారు ప్రస్తుతం?"

వీణావతి వెంటనే ఏం చెప్పలేదు. తర్వాత ఓ నిర్ణ

యానికొచ్చి చెప్పింది. "రాత్రినుండి ఇంటికి రాలేదు."

శ్రీనివాస్‌కి నమ్మకం కలగలేదు. ఆమె యెందుకో దాస్తోంది. బహుశా భర్త నేరాన్ని కప్పిపుచ్చాలనేమో!

వీణావతి శ్రీనివాస్ వంక చూసి, "మీకు నా మాట మీద నమ్మకం లేనట్టుంది. నిరభ్యంతరంగా యిల్లంతా సోదా చేసుకోవచ్చు" అన్నది.

శ్రీనివాస్ రెండు క్షణాలు ఆలోచించి, "నో, మీ మాటమీద నాకు ఆ మాత్రం నమ్మకం వుంది" అన్నాడు.

"ఇలా రాత్రిళ్ళు బయటికి వెళ్ళి ఇంటికి రాకపోవటం ఇదివరలో యెప్పుడయినా వుందా?"

"యెప్పుడైనా, ఒకోసారి!"

"రాత్రిళ్ళు యింటికి కూడా రానంత బిజీగా వుంటారా?"

"అవన్నీ నేనడగను. అడిగినా ఆయన చెప్పరు."

"ఓ.కే! మీ వారు రాగానే నాకు ఫోన్ చెయ్యండి. కేసు విషయం కొన్ని వివరాలు కావాలి."

"అలాగే" అన్నది వీణావతి.

## 4

ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ తన ఆఫీసు రూంలో కూచుని వుండగా ఫోన్ గణగణ మోగింది.

"నేను సార్జెంట్ శివాన్ని మాట్లాడుతున్నాను సార్! వినోద్ ఆచూకీ తెలిసింది."

"వెరీగుడ్ యెక్కడ?"

"ఊరి వెలుపల హంసల కొలనులో అతని శవం తేలి వుంది సార్. మేమంతా అంగుళం అంగుళం అతనికోసం గాలిస్తుంటే యీ శవం విషయం తెలిసింది. మీరిచ్చిన ఫోటోలోని పోలికలు శవం పోలికలు ఒకటే సార్!"

"ఆశ్చర్యంగా వుంది. నువ్వక్కడే వుండు. నేనిప్పుడే బయలుదేరి వస్తున్నాను" శ్రీనివాస్ ఫోన్ పెట్టేసి లేచాడు.

పదినిమిషాల తర్వాత అతను హంసల కొలను దగ్గరున్నాడు.

శవం వినోద్ దే!

పైకి తీసి ఒడ్డుమీద పడుకోబెట్టారు.

శ్రీనివాస్ సూటిగా అతని వంకే చూస్తున్నాడు. రజనీకాంత్ ని, అంత క్రితం కూర్మారావుని చంపిన మనిషి ఇప్పుడు శవరూపంలో వున్నాడు. యెంతలో యెంత విచిత్రం?

మొన్న రాత్రి కూర్మారావు, రజనీకాంత్ హత్య చేయబడ్డారు. మొన్న రాత్రే వినోద్ యింటినుండి బయటికి వెళ్ళాడు. ఆ తర్వాత అతన్ని చూసినవాళ్ళు లేరు. ఈ రోజు శవం కొలనులో తేలిందాన్ని బట్టి చూస్తే, వినోద్ కూడా అదే రోజు రాత్రి చనిపోయి వుండాలి. ఈ రోజు మూడో రోజు. శవం పైకి తేలిపోయింది.

శ్రీనివాస్ శవాన్ని పరిశీలనగా చూశాడు. ఎక్కడా ఒంటిమీద గాయంలేదు. కానీ శరీరం ఇతనిది కూడా నీలి రంగుకి తిరిగి వుంది. అంటే రజనీకాంత్ లాగానే ఇతనికీ విషప్రయోగం జరిగిందనుకోవాలి! రజనీకాంత్ కి ఇతను విషం కలిపి వుంటే, మరి ఇతనికి ఎవరు కలిపారు? యెప్పుడు? ఇక్కడ, ఈ కొలనులో అతనెందుకు మునిగినట్టు? చంపేసి ఈ కొలనులోకి తోసేశారా? కావచ్చును. అన్నిటికంటె అతడిని ఆశ్చర్యపరిచింది, తను హంతకులుగా ఊహించిన వాళ్ళు హతులుగా తేలటం!

డాక్టరు ప్రిలిమినరీ ఎగ్జామ్ పూర్తిచేశాడు.

శ్రీనివాస్ అతని వంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"క్లియర్ కేస్ ఆఫ్ ఇన్‌టాక్సికేషన్, విషప్రయోగం వలననే చనిపోయాడు. తర్వాత కాలనులో పారేశారు. కాలనులో పడేసరికి ప్రాణం పోయిందో, లేక ప్రాణం పోయాక కాలనులో పడేశారో పోస్టుమార్టమ్ అయాక తెలుస్తుంది" అన్నాడు డాక్టర్.

ఫోటోగ్రాఫర్ తన పని చేసుకుపోతున్నాడు.

శవం దగ్గిర యెలాంటి ఆధారాలు దొరకలేదు. కాని కాలను ఒడ్డున బురదలో దిగిన పాదాల గుర్తులు వేలి ముద్రల నిపుణుడు కనుగొన్నాడు. వాటిని ఫోటోలు తీశారు. అవి బాటా అంబాసిడర్ షూస్ గుర్తులుగా నిర్ధారించాడు నిపుణుడు.

శ్రీనివాస్‌కి బురదలో ఓ వస్తువు దొరికింది. దాన్ని తీసి భద్రపరిచాడు.

స్టేషన్‌కొచ్చి కూచుంటుండగానే సార్జెంటు మెసేజ్ ఇచ్చాడు—యెవరో అర్జంటుగా శ్రీనివాస్‌తో పర్సనల్‌గా మాట్లాడాలని ఫోన్ చేశాడని.

"ఫోన్ నంబరిచ్చాడా?" అడిగాడు శ్రీనివాస్.

"లేదు సార్, మళ్ళీ చేస్తానన్నాడు" చెప్పాడు సార్జెంటు.

శ్రీనివాస్ ముళ్ళమీద కూచున్నట్టు గడిపాడు పది నిమిషాలు.

ఫోన్ వంకనే చెవులు దృష్టి కేంద్రీకృతమయినాయి. అతనెవరో? అంత అర్జంటుగా మాట్లాడే పనేముంటుంది? ఏ కేసు విషయంలో?

ఆలోచన మధ్య ఫోన్ మోగటం వెంటనే, వినిపించుకోలేదు శ్రీనివాస్, చటుక్కున ఫోన్ ఎత్తాడు.

"హల్లో, క్రైం బ్రాంచ్?" అడిగాడు యెవరో అవతలనుండి.

"ఎస్, ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ స్పీకింగ్!"

"నమస్కారం యిన్‌స్పెక్టర్ గారూ! మీతో ఓ ముఖ్యమైన సమాచారం చెప్పాలి. చాలా అర్జంటు."

"చెప్పండి. మీరెవరు? యెక్కడనుంచి మాట్లాడుతున్నారు?"

"నా పేరు రామనాధం. ప్రకాశనగర్ నుంచి మాట్లాడుతున్నాను. పబ్లిక్ బూత్‌నించి."

"చెప్పండి."

"ఫోన్‌లో వద్దు. మీతో ముఖస్తంగా మాట్లాడాలి."

"ఏ విషయంలో?"

"ఇప్పటి వరకు జరిగిన మూడు హత్యల గురించి.

శ్రీనివాస్ నిటారుగా అయ్యాడు.

"హంతకుడు మీకు తెలుసా?"

"తెలుసు. ఆ విషయం చెప్పాలనే మీకు ఫోన్ చేశాను—మా ఇంటికొస్తే వివరంగా మాట్లాడుకుందాం."

"అడ్రసు చెప్పండి."

"రోడ్ నంబరు ఎనిమిది, ప్రకాశ్ నగర్, డోర్ నంబరు 8/32."

"ఓ.కే. పది నిమిషాల్లో అక్కడుంటాను. మీరు ఇంట్లోనే వుండండి" అన్నాడు శ్రీనివాస్. ఫోన్ క్రెడిల్ చేస్తూనే బయటకి ఉరికాడు.

ఇద్దరు సార్జెంట్సుతో శ్రీనివాస్ డ్రయివ్ చేస్తున్న జీపు పదినిమిషాల్లో ప్రకాశ్ నగర్ చేరింది.

రామనాథం అడ్రసిచ్చిన ఇంటికి దగ్గర్లో పెద్ద గుంపు కనబడింది. ట్రాఫిక్ ఆగిపోయి వుంది.

శ్రీనివాస్ జీప్ స్లో చేశాడు.

ట్రాఫిక్ కానిస్టేబుల్స్, ఇన్‌స్పెక్టర్లు హడావిడిగా కనిపించారు. శ్రీనివాస్‌ని చూసి విష్ చేశారు.

"ఏమిటి, ఏక్సిడెంటా?" అడిగాడు శ్రీనివాస్.

"అవును సార్! ఇదిగో ఈ లారీ రోడ్ క్రాస్ చేస్తున్న ఈ వ్యక్తిని కొట్టింది. స్పాట్ డెత్" అన్నాడు ట్రాఫిక్ ఇన్‌స్పెక్టరు.

శ్రీనివాస్ జీప్ దిగాడు. లారీ చక్రాలు కర్కశంగా తొక్కేశాయి ఆ వ్యక్తిని. నెత్తురు గడ్డలా వున్నాడు.

"లారీ డ్రయివర్ వెంటనే పారిపోయాడు. సరిగ్గా అదే సమయానికి ఎక్కడినుంచో 'స్కై బ్లూ కలర్ షెవర్లెట్ కారొచ్చి ఆగింది. డ్రయివర్ అందులో పరారీ అయిపోయాడు" చెప్తున్నాడు ఇన్‌స్పెక్టర్.

"అయితే ఇది ప్లాన్డ్‌గా జరిగిందన్నమాట. లారీ ఎవరిదో తెల్సుకుంటే డ్రయివర్ ఎక్కడికి పోతాడు?"

"అది కష్టం సార్! ఎందుకంటే ఈ లారీని యెవరో దొంగిలించినట్టు ఇదివరకే త్రీటౌన్‌లో కంప్లయింట్ బుక్కయింది. ఆ విషయం ట్రాఫిక్ కానిస్టేబుల్స్ అందరికీ మేము నిన్ననే కమ్యూనికేషన్ పంపాము. ఇదే నంబరు, ఇదే రంగు. అశోక్ లేల్యాండు ఎ.టి.వై. 2636."

"అలాగా. ఓనర్ ఎవరు?"

"ప్రముఖ పారిశ్రామిక వేత్త, నగరంలో కల్లా బాగా పలుకుబడిగల ప్రముఖుడు—జగన్నాథంగారు."

శ్రీనివాస్ తల విదిలించాడు.

"అయితే ఇది ప్లాన్డ్‌గానే జరిగింది. దొంగిలించిన లారీతో ఏక్సిడెంట్ చేశాడంటే హంతకుడు తనని తాను రక్షించుకోవటమేకాక హత్యా నేరం జగన్నాథంగారి మీదికి పోవాలని పథకం వేశాడు. బహుశా జగన్నాథం గారు హంతకుడికి విరోధి అయ్యుండవచ్చు" అన్నాడు.

"మేము అంత దూరం ఆలోచించలేదు గాని, యిది కావాలని చేసిన మర్డరేనని అనుకుంటున్నాం" అన్నాడు ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్.

"ఇంతకీ హంతకుడు యెవరో ఎవరైనా గుర్తుపట్ట గలరా?"

"ఇప్పుడే అతని పక్క ఇంట్లో వుంటున్న రాజారావు అనే వ్యక్తి శవాన్ని గుర్తుపట్టాడు. హతుడి పేరు రామనాథం. అదిగో ఆ 8/32 డోర్ నంబర్లో వుంటాడట."

శ్రీనివాస్ త్రుళ్ళిపడ్డాడు.

తనకి ఫోన్ చేసిన రామనాథం అదే ఇంట్లో వుంటున్నాడు. అతనే ఇతనా? మై గాడ్, ఉన్న ఒక్క ఆధారమూ శాశ్వతంగా లేకుండా పోయింది. ఈ 'మిష్టరీ మరింత బిగుసుకుపోయిందే!' అనుకున్నాడు శ్రీనివాస్.

## 5

"రాజారావుగారెవరండీ?" అనడిగాడు శ్రీనివాస్.

"నేనే సార్!" అన్నాడు రామనాథం పక్కింటాయన.

"ఇప్పుడు లారీ ఏక్సిడెంట్లో పోయిన రామనాథం మీకు తెలుసు కదా!?"

"మా పక్క పోర్షనే కదండీ! నేనే శవాన్ని గుర్తుపట్టి పోలీసులకి చెప్పాను."

"గుడ్! అతని గురించిన వివరాలు కావాలి."

"అడగండి."

"రామనాథం యెన్నాళ్ళుగా తెలుసు మీకు?"

"ఈ ఇంట్లోకి వచ్చినప్పట్నుంచీనండి."

"అంటే ...?"

"దాదాపు మూడేళ్ళుగా."

"ఏం చేస్తూంటాడు?"

"వాటర్ వర్క్సులో పని చేస్తాడండి. "చిన్న ఉద్యోగం!"

"పెళ్ళయిందా?"

"లేదని చెపుతాడుగాని, భార్య వదిలేసిందని చెప్తూ వుంటారు సార్ నలుగురూ."

"అయితే ఒక్కడే వుంటున్నాడా?"

"అవును సార్. తన మానాన తను పోతాడు. అందుకే పక్కన కుటుంబాల వాళ్ళం భార్యా బిడ్డలతో వున్నా, మధ్యలో అతన్ని ఉండటానికి అభ్యంతరం పెట్టలేదు."

"ఇతను వ్యక్తిగతంగా ఎలాంటివాడు?"

"పైకి బాగానే వుంటాడు సార్! ఇప్పటివరకు అతని గురించి చెడుగా వినలేదు. కాకపోతే డబ్బు కక్కుర్తి గుణం వున్నదని విన్నాం. అప్పుడప్పుడు తాగుతాడని వినటమేగాని, ఎప్పుడూ చూడలేదా స్థితిలో. అంతకుమించి అతని విషయాలు మేం పట్టించుకోలేదండి."

"ఈ రోజు ఈ సమయంలో అతను ఇంటి వద్దనే వున్నాడు. షిఫ్టు డ్యూటీలుంటాయా?"

"అవును సార్. రెండు షిఫ్టుల్లో పని చేస్తాడు సార్. ఓ వారం తెల్లవారు ఝామునుండి చేస్తే, మరో వారం సాయంత్రం నుండి రాత్రి పదిగంటలవరకు—ఇలా ఏవో వున్నాయండి వాళ్ళ అవస్సు."

"అలాగా!....ఈ పోర్షనే కదా, తలుపులు తాళం పెట్టి లేనట్టుందే!"

"ఓ గంట క్రితం పబ్లిక్ బూత్ నించి ఎవరికో ఫోన్ చెయ్యాలని వెళ్ళాడు సార్! ఫోన్ చేసి తిరిగొస్తున్నట్టున్నాడు. ఇంతలో ఏక్సిడెంటయిపోయింది."

"ఓ.కే. ఓసారి రామనాథం గది నేను చూడవచ్చా?" అన్నాడు శ్రీనివాస్.

"మీకు అభ్యంతరమేముంటుంది సార్, చూడండి."

శ్రీనివాస్ రామనాథం గది గొళ్ళెం తీసి లోనికి వెళ్ళాడు. లోపల ఓ మడత మంచం వాల్చి వుంది, పక్క అడ్డదిడ్డంగా వుంది. మంచంమీద తెలుగు వారపత్రికలు, మేగజైన్స్ చిందరవందరగా పడి వున్నాయి. గోడలకి శృంగాల చిత్రాల తాలూకు కాలెండర్లున్నాయి. ఓ కుర్చీ వారగా వుంది. ఓ మంచినీళ్ళ కూజా తప్ప యితర సామగ్రి ఏం లేదు. బయట ఎక్కడో తింటాడు గాబోలు, వంటగదికి కేటాయించిన గది ఖాళీగానే వుంది.

అతని తల వైపునున్న దుప్పటి తొలగించాడు శ్రీనివాస్. తలగడ కింద ఏమైనా ఉపయోగించే సమాచారం ఉందేమోనని చూశాడు. ఏం లేదు.

అలమరలో ఏవేవో పుస్తకాలు, పేక దస్తాలు వున్నాయి. మధ్య అరలో ఓ ఫోటో ఫ్రేం వుంది. దానిలో రామనాథం మరో వ్యక్తితో నించుని వున్నాడు.

శ్రీనివాస్ ఫోటో ఫ్రేం తీసుకుని చూశాడు.

పక్కనున్నది ఎవరో కాదు, కూర్మారావు!

అంటే కూర్మారావు, రామనాథం స్నేహితులన్న మాట.

శ్రీనివాస్‌కి అదే అరలో ఫోటో అతికించి వున్న మౌంట్ ఒకటి కనిపించింది. ఫ్రేం కట్టలేదు దానికి.

అది ఓ గ్రూపు ఫోటో. కాలేజీ బి.ఎస్సీ. గ్రాడ్యుయేట్స్ మూడవ సంవత్సరం చివర్లో దిగిన ఫోటో.

అందులో కూర్మారావు, రామనాథంతో పాటు రజనీకాంత్, వినోద్ కూడా వున్నారు.

శ్రీనివాస్ విస్మయంగా చూస్తున్నాడు. అయితే వాళ్ళు నలుగురూ స్నేహితులు, క్లాసు మేట్సన్న మాట!

కొత్త విషయాలు తెలిసేకొద్దీ కేసు మరింత జటిలమయినట్టు తోచింది శ్రీనివాస్‌కి. ఇప్పుడు కేసు కొనసాగించటానికి తనకీ గ్రూప్ ఫోటో చాలా ఉపకరిస్తుంది. అందులోని తక్కిన స్టూడెంట్సునిగాని, లెక్చరర్సునిగాని అడిగితే తనకి కావలసిన సమాచారం దొరుకుతుంది.

ఫోటోకి దిగువ ఖాళీగా వున్న మౌంట్ మీద దిగిన వాళ్ళ పేర్లన్నీ వున్నాయి. ముందు వరసలో కూచుని వున్న కాలేజి స్టాఫ్ పేర్లు, బ్రాంచెస్, వివరంగా ప్రింటు చెయ్యబడి వున్నాయి.

అయితే రామనాథం గ్రాడ్యుయేట్ అయినా ఉద్యోగం సరయినది దొరక్క ఏదో చిన్న ఉద్యోగంలో వున్నాడన్న మాట! రాజారావు అతను డబ్బు కక్కుర్తి మనిషి అని ఎందుకన్నాడు? రామనాథం లంచగొండా? వాటర్ వర్క్సులో పనిచేసే వాళ్ళకెవరూ లంచాలిస్తారు?

శ్రీనివాస్ అలమరలోని తక్కిన అరలు కూడా వెతికాడు. ఓ అరలో బట్టలు పెట్టుకునే సూట్ కేస్ వుంది. తాళం వేసిలేదు. తెరిచి చూశాడు.

ఓ నాలుగు షర్టులు, ప్యాంట్సు, బనియన్స్, అండర్

వేర్సులాంటి సరంజామా వుంది అందులో. ఓ. పాంటు అడుగున ఎనిమిది పదిరూపాయల నోట్లు, కొంత చిల్లర కనిపించింది. అంతకుమించి అందులో ముఖ్యమైనవేమీ దొరకలేదు.

అలమారలోనే అగ్గిపెట్టె, ఫోర్ స్క్వేర్ రాయిల్ సిగరెట్టు ప్యాక్ సరికొత్తది వుంది. అంటే రామనాథం ఖరీదైన సిగరెట్లు తాగుతాడన్నమాట. అతని దుస్తులు కూడా ఖరీదైనవే వున్నాయి. అందులో మరీ కొత్తగా వున్న జతలు రెండున్నాయి.

సార్జెంట్ శివం గదిలోకి తొంగి చూసి, "శవాన్ని మార్చ్యురీకి తరలిస్తున్నారు సార్, "మీరేమైనా చూడాల్సింది వుందా అక్కడ?" అనడిగాడు.

శ్రీనివాస్ తల అడ్డంగా తిప్పాడు. "సార్జంటు విల్సన్ ఎక్కడున్నాడు?" అడిగాడు.

"బయట జీప్ లో వున్నాడు సార్, పిలవనా?"

"పిలు. అతన్నిక్కడే వుండమని చెప్పాలి. నువ్వు ఇన్ స్పెక్టర్ కైలాష్ కి ఫోన్ చేసి వెంటనే నేను రమ్మన్నానని చెప్పు" అన్నాడు శ్రీనివాస్.

శివం వెళ్ళాడు.

శ్రీనివాస్ గ్రూప్ ఫోటోని పేపర్లో చుట్టాడు. కూర్మారావు, రామనాథం కలిసి తీయించుకున్న ఫోటో ఫ్రేంని కూడా పేపర్లో చుట్టాడు.

"ఏం సార్, పిలిచారుట?" అడిగాడు విల్సన్.

"నువ్విక్కడే వుండు. ఇక్కడికి ఎవరైనా వచ్చి పోతున్నారేమో గమనించాలి. రామనాథం గురించి యెవరైనా అడిగితే ఆ వ్యక్తుల వివరాలు తెలుసుకో! యూనిఫాం మార్చెయ్యి. మఫ్టీలో వుండు."

"ఫోన్ చేసి చెప్పాను సార్, వస్తున్నారు" అన్నాడు శివం లోనికొచ్చి.

"ఓ.కే. నువ్వు చెయ్యాల్సిన పని మరొకటుంది." అన్నాడు శ్రీనివాస్ సార్జెంటు శివంతో.

శివం శ్రీనివాస్ చెప్పిన సూచనలు జాగ్రత్తగా విన్నాడు. "అలాగే!" సార్ సెల్యూట్ చేసి వెళ్ళిపోయాడు.

సరిగ్గా అదే సమయంలో బయట మోటార్ బైక్ శబ్దం వినిపించింది. ఇన్‌స్పెక్టర్ కైలాష్ బుల్లెట్ దిగుతున్నాడు.

"గుడ్ మార్నింగ్ బాస్! యెందుకో అర్జంటుగా పిలిచారు?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కైలాష్ శ్రీనివాస్‌కి విష్ చేస్తూ.

"నీతో పనుంది బైక్ ఇక్కడే వదిలేసి నాతో జీపులో రా! కూర్మారావింటికి వెళ్ళాలి!" అన్నాడు శ్రీనివాస్.

జీపు కూర్మారావింటివైపు దూసుకుపోయింది.

## 6

కూర్మారావు యిల్లు తాళం పెట్టి వుంది.

కూర్మారావు భార్యాబిడ్డల్ని ఆమె పుట్టింటివారు తమతో తీసుకుపోయారు, బెంగటిల్లిపోయిందని.

శ్రీనివాస్ జీప్ ఆపి దిగాడు. వెనుకనే కైలాష్ దిగాడు.

శ్రీనివాస్ కూర్మారావు పక్కింటి తలుపు తట్టాడు. ఓ ముసలాయన తలుపు తీశాడు.

"యెవరు కావాలి సార్?" అన్నాడు పోలీసుల్ని చూసి.

"మీ పక్కింటి కూర్మారావుగారి కేసులో మీతో కొంచెం మాట్లాడాలి!" అన్నాడు శ్రీనివాస్.

ఆయన యిద్దర్నీ సాదరంగా ఆహ్వానించి లోపల కూర్చుండ చేశాడు.

"అడగండి సార్!" అన్నాడాయన.

"కూర్మారావు హత్యచేయబడిన విషయం మీకు తెలుసుకదా. ఆ రోజు అతనింటికి ఎవరయినా వచ్చి పోయారో మీకేమైనా గుర్తుందా?" అడిగాడు శ్రీనివాస్.

ఆయన ఇబ్బందిగా చూశాడు.

"సరిగ్గా గుర్తులేదు సార్!" అన్నాడు.

"పోనీ మీ ఇంట్లో ఎవరైనా చూశారేమో కనుక్కోండి."

"మా ఇంట్లో వున్నది నేను, నా భార్య, పెళ్ళి కాదిగిన కొడుకు—అంతే సార్! నేను రిటైరయిపోయాను. ఉదయం ఎనిమిది గంటల నుంచి రాత్రి ఏడు—ఎనిమిది వరకు ఈ వరండాలోనే పడక కుర్చీలో కూచుని వీధిలోకి చూస్తూ, పేపరు చదువుతూ గడిపేస్తూంటాను" అన్నాడాయన.

శ్రీనివాస్ గ్రూప్ ఫోటో ఆయనకు చూపించాడు.

"చూడండి ఈ ఫోటోలో వున్న అబ్బాయిలెవరైనా వచ్చారేమో చూసి చెప్పండి" అన్నాడు వినోద్ని, రజనీకాంత్ని వేలితో పాయింట్ చేస్తూ.

ఆయన తల అడ్డంగా తిప్పాడు.

తర్వాత రామనాథంని చూపించినా గుర్తుపట్టలేదాయన.

ఫోటో ఫ్రేం తీసి చూపించాడు శ్రీనివాస్. అందులో

రామసాధాన్ని పాయింట్ చేస్తూ, "ఎస్, ఇతను ఆ రోజో ఆ ముందు రోజో ఒకటి రెండుసార్లు కూర్మారావింటి ముందు అటు యిటు పచార్లు చేయటం నేను చూశాను. అదివరకు వాళ్ళిద్దరు కలిసి తిరుగుతుండేవారు. అందుకని గుర్తున్నాడు" అన్నాడు ముసలాయన.

"ఆ రాత్రి—అంటే హత్య జరిగిన రోజు రాత్రి—అతన్ని చూడలేదా మీరు?"

"అదే సరిగ్గా గుర్తులేదు సార్. రాత్రి ఎనిమిది తర్వాత నేను సాధారణంగా బయటకు రాను. చివరిగా నేను యెనిమిది గంటల ప్రాంతాల కూర్మారావుని చూశాను."

"రాత్రి బాగా పొద్దు పోయాక కూర్మారావు ఇంట్లోంచి కేకలుగాని, అరుపులుగాని ఏమీ వినిపించలేదా?"

"లేదు సార్! మేము నిద్రపోయాక ఏమయినా వినిపించాయేమో! మాకెలాంటి నిద్రాభంగం కలగలేదు."

"చాలా థాంక్సండీ. చాలా విషయాలు చెప్పారు" అన్నాడు శ్రీనివాస్ లేస్తూ.

ముసలామె కాఫీ కప్పుల్తో వచ్చింది.

"కాస్త కాఫీ తీసుకు వెళ్ళండి సార్!" అన్నాడాయన.

కాఫీ తాగాక ఇద్దరు బయటికి వచ్చారు.

కూర్మారావింటికి సరిగ్గా ఎదురుగా ఓ పాన్ షాప్ వుంది.

పాన్ షాపు అతను హంతకుడ్ని చూసి వుండొచ్చు.

శ్రీనివాస్ అతనికి కూడా ముసలాయనకి చూపించినట్టే ఫోటోలు చూపించాడు.

అతను రామనాథాన్ని గుర్తుపట్టి "ఈయన హత్య జరిగిన రోజు రాత్రి నా పాన్ షాపులో సిగరెట్టు ప్యాక్ తీసుకున్నాడు సార్! చాలాసేపు నా షాప్ దగ్గిర కూచున్నాడు. నేను పదకొండు గంటలకి షాప్ కట్టేశాను. ఆ తర్వాత ఏమయిందీ నాకు తెలీదు."

"నువ్వు కొట్టు కట్టే సమయానికి కూర్మారావు ఇంట్లో వున్నాడా?"

"లేదు సార్! అతనికోసమే ఈ అబ్బాయి నా షాపు దగ్గిర ఎదురు చూస్తున్నాడని నేననుకున్నాను."

"అంత క్రితం ఈ అబ్బాయి ఎప్పుడైనా కూర్మారా వింటికి వచ్చేవాడా?"

"వాళ్ళిద్దరు స్నేహితులేనండి. అప్పుడప్పుడు వస్తుండే వాడు. అందుకే ఫోటో చూడగానే గుర్తుపట్ట గలిగాను."

"సిగరెట్టు ప్యాక్ తీసుకున్నాడన్నావు కదా? ఏ బ్రాండ్?"

"ఫోర్ స్క్వేర్ రాయల్ ప్యాక్!"

శ్రీనివాస్‌కి రామనాథం ఇంట్లో చూసిన సిగరెట్టు ప్యాక్ గుర్తొచ్చింది. అదీ ఫోర్ స్క్వేర్ రాయల్ ప్యాక్!

అయితే కూర్మారావుని హత్య చేసింది రజనీకాంత్ కాదని అనుకోవాల్సి వస్తోంది. మరి అతను రక్తంతో రజనీకాంత్ పేరెందుకు రాసినట్టు?

అకస్మాత్తుగా శ్రీనివాస్‌కి స్ఫురించింది.

కూర్మారావు వెల్లకిలా పడి వున్నాడు మంచంమీద. అతను పేరు రాసిన పత్రంలో వేలు ఎలా అందింది? పేరు పూర్తిగా రాయకుండానే ప్రాణం పోయినట్టు వుంది! ఆ పరిస్థితిలో పేరు రాస్తూ బోర్లా పడి ప్రాణం వదలి

వుండాల్సింది! కాని మంచంమీద వెల్లికిలా పడి చని పోయాడు.

అదీగాక, తను సరిగ్గా గమనించలేదుగాని, చనిపోయే ముందు దస్తూరి చిందర వందరగా అలికేసినట్లుంటుంది. కాని తను చూసిన అక్షరాలు చాలా కుదురుగా, గుండ్రంగా వున్నాయి. కావాలనే పేరు, పూర్తిగా రాయలేదు.

పాన్ షాపు అతనికి ధన్యవాదాలు చెప్పి జీప్ దగ్గిరికి వచ్చేశారిద్దరు.

"కూర్మారావుని హత్య చేసింది రజనీకాంత్ కాదు" అన్నాడు శ్రీనివాస్. కైలాష్ ఆశ్చర్యంగా చూశాడు.

శ్రీనివాస్ వివరించాడు.

"యు ఆర్ రైట్ బాస్! మనకెవరికీ తట్టనేలేదు సుమా!....అయితే రామనాథమే హంతకుడా?"

"అనుమానం లేదు."

"మరి హంతకుల గురించి చెప్తానని మనకి అదే మీకు ఫోన్ చేసి రమ్మనటంలో అతని ఆంతర్యం?"

"బహుశా, నిజం చెప్పేద్దామని పిలిచి వుంటాడు. తనమీద హత్యా ప్రయత్నం జరగబోతోందని పసి గట్టాడు. అది తప్పించుకోవటం జరగదని అతనికి సందేహం బలంగా నాటుకుని వుంటుంది. అందుకే హంతకుల గురించి చెప్పెయ్యటానికి పిలిచి వుంటాడు."

"సరే, కూర్మారావుని రామనాథం చంపాడనుకున్నా, వినోద్ రజనీకాంత్ల నెవరు చంపారు? రామనాథాన్ని ఎవరు చంపారు? ఆ చిన్న కారు ఎవరిది?"

శ్రీనివాస్ సాలోచనగా తలూపి, "అదే యిప్పుడు మనం తెల్సుకోవాలి. వినోద్ రజనీకాంత్ని చంపి

వుంటాడని అనుమానించాను. కాని వినోద్ కూడా అదే పరిస్థితుల్లో మరణించాడు కదా! కాబట్టి ఆ ఇద్దర్నీ ఒకేసారి, ఒకే హంతకుడు చంపాడా? వేర్వేరా? అసలు రామనాధం కూర్మారావుని ఎందుకు హత్య చేశాడు? అందువల్ల అతనికి లాభించినదేమిటి? అన్నీ జవాబులేని ప్రశ్నలు. కేసు మరీ జటిలమవుతోంది. హత్యలు నాలుగు హంతకు లెందరో?" అన్నాడు.

కైలాష్ మౌనంగా వుండిపోయాడు.

ఇద్దరు జీప్ దగ్గిర నించుని మాట్లాడుకుంటున్నారు.

ఇంతలో సార్జెంటు శివం అక్కడికొచ్చాడు.

"ఏమయింది వెళ్ళిన పని?" అడిగాడు శ్రీనివాస్.

"లారీ జగన్నాధంగారిదే! కాని అంత క్రితం రోజు అది కాజేయబడింది. ఆ విషయం ఆయన పోలీసు రిపోర్టు యిచ్చారట కూడా 3 టౌన్ స్టేషన్లో. 3 టౌన్లో కనుక్కున్నాను. నిజంగానే రిపోర్టు ఇవ్వటం జరిగింది. మఫ్టీలో జగన్నాధంగారింటి దగ్గర ఎదురు చూశాను. యెవరూ రామనాధం గురించి ముచ్చటించటం లేదు. రామనాధం యెవరో వాళ్ళింట్లో ఎవరికీ తెలీదు. జగన్నాధంగారి పిల్లలు ఎవరూ రామనాధం అంత పెద్ద వాళ్ళు లేరు...." అన్నాడు సార్జెంటు శివం.

శ్రీనివాస్ తలూపాడు. ప్రశ్నార్థకంగా చూస్తున్న కైలాష్తో "జగన్నాధం ఇంటి వద్ద తిరిగి ఇన్ఫర్మేషన్ తెమ్మని శివాన్ని పంపాను. జగన్నాధం వాళ్ళింట్లో ఎవరికీ రామనాధం ఎవరో ఎలాంటివాడో తెలీదు. వాళ్ళెవరైనా కక్షకొద్దీ రామనాధాన్ని హత్య చేశారనటానికి ఏ మాత్రం వీలులేదు. ఎవరో ముందుగా పథకం వేసుకుని, జగన్నాధం లారీని దొంగిలించి, అదే లారీని

రామనాథాన్ని చంపటానికి వినియోగించి, చంపేసిన వెంటనే చిన్న కారులో పరారీ అయిపోయాడు" అన్నాడు.

కైలాష్ తలూపి, "పోతే రామనాథానికి శత్రువు లెవరున్నారో ఎంక్వయిరీ చెయ్యాలి, నా ఉద్దేశ్యంలో కూర్మారావుని చంపిన రామనాథమే వినోద్‌నీ, రజనీ కాంత్‌నీ చంపి వుండొచ్చుకదా! రామనాథం డబ్బు కక్కుర్తి మనిషని అతని పక్కింటి రాజారావు చెప్పాడు కదా! డబ్బుకోసం ఆశపడి ఈ హత్యలు చేసాదేమో?" అన్నాడు.

శ్రీనివాస్‌కి మస్తిష్కంలో మెరుపులు మెరిశాయి. హంసల కొలను దగ్గర షూస్ గుర్తులు, తనకు బురదలో దొరికిన వస్తువు మనసులో మెదిలాయి.

సార్జెంటు శివంతో ఏం చెయ్యాల్సిందీ చెప్పాడు.

తర్వాత జీప్ స్టార్టుచేసి రామనాథం ఇంటి వైపు దూసుకు పోయాడు.

రామనాథం ఇంటివద్ద సార్జెంటు విల్సన్ మఫ్టీలో వున్నాడు.

శ్రీనివాస్ రెండంగల్లో రామనాథం గది లోపలికి వెళ్ళాడు. తలుపు పక్కనే వున్న జోళ్ళపై అతని దృష్టి పడింది. ఓ జత అకు చెప్పులు, మరో జత షూస్ వున్నాయి. 'షూ' చేతిలోకి తీసుకుని చూశాడు.

సరికొత్త అంబాసిడర్ షూ—బాటా కంపెనీది.

వెనక్కు తిప్పి చూశాడు. సోల్ అడుగున వున్న డిజైన్ రంధ్రాలలో బురద అంటుకుని వుంది. ఎండి పోయి వుంది!

రాజారావుని పిలిచి అడిగాడు.

"చూడండి రాజారావుగారూ, ఒక ముఖ్యమైన సమాచారం కావాలి. రామనాథంకోసం ఆడవాళ్ళెవరయినా వస్తుండేవారా యిక్కడికి?" అనడిగాడు శ్రీనివాస్.

"ఓ ఆమె వస్తుండేదండి."

శ్రీనివాస్ ఆసక్తిగా తలెగరేసి, "ఆమె ఎవరో మీకు తెలుసా?" అడిగాడు.

"పేరు తెలీదనుకోండి. చాలా ధనవంతురాలు. షెవర్లెట్ కార్లో వస్తూండేది. ఆమె రాగానే రామనాథం మర్యాదగా లోనికి ఆహ్వానించేవాడు. ఓ పది నిమిషాలు మాట్లాడి వెళ్ళిపోతుండేది."

"షెవర్లెట్ కారా?"

"అవునండి లేటెస్టు మోడల్. స్కై బ్లూ కలర్. చాలా ముద్దొచ్చే కారు."

శ్రీనివాస్ మనసులో ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్ చెప్పిన మాటలు మెదిలాయి. రామనాథాన్ని చంపిన హంతకుడు లారీ వదిలేసి రెడీగా వచ్చిన స్కై బ్లూ కలర్ షెవర్లెట్‌లోనే పరారీ అయ్యాడు.

అంటే....?

అతనికి బురదలో దొరికిన వస్తువు గుర్తొచ్చింది.

"ఆమెని వర్ణించగలరా?" అన్నాడు శ్రీనివాస్.

రాజారావు వర్ణన వీణావతికి సరిపోయింది.

"ఆమె చెవులకు ఎలాంటి ఆభరణాలు ధరించేదో చెప్పగలరా?" అడిగాడు శ్రీనివాస్.

"శ్రీమంతురాలు కదండీ! ఒక్కో రోజు ఒక్కో అలంకరణ. అందుకు తగ్గ ఆభరణాలు, మాకే కళ్ళు చెదిరిపోయేవి చూస్తోంటే!"

శ్రీనివాస్ ప్యాంటు జేబులోనుండి ఓ జూకా తీసి రాజారావుకి చూపించాడు.

"ఇలాంటి జూకా ఆమె చెవులకు ఉండగా ఎప్పుడైనా చూశారా?" అడిగాడు శ్రీనివాస్.

రాజారావు ఆ జూకా వంక చూసి "చూసినట్లే గుర్తండి. నాకన్నా మా ఇంటావిడ అయితే నగల విషయం కరెక్ట్ గా చెప్పేస్తుందండి. ఎందుకంటే, ఆమె వచ్చి వెళ్ళినప్పట్నుంచీ మా ఇంటావిడ అన్ని పనులూ వదిలేసి ఆమె నగలు, చీరలు చూసి మురిసిపోతుండేది" అంటూ జూకాని లోపలికి తీసుకు వెళ్ళి చూపించి తెచ్చి, "ఇలాంటి జూకా ఆమెగారు ధరించి వస్తూండేదటండి. మా ఇంటామె కరెక్ట్ గా చెప్పేసింది" అన్నాడు.

"ఇంకొక్క విషయం, చెప్పండి. రామనాథం డబ్బు కక్కుర్తి మనిషని చెప్పారు. ఏ విధంగా? లంచ గొండా? లేక మరే విధమైన అక్రమ సంపాదనవల్ల సంపాదించేవాడా?"

"అదేం కాదండి. చెప్పాను కదండీ, శ్రీమంతురాలు వస్తూండేదని. ఆమె ఇతనికి ఏదో పని పురమాయిస్తూండే దనుకుంటానండి. రెండు మూడుసార్లు పర్సులో నుండి డబ్బుతీసి ఇవ్వటం దాన్ని రామనాథం వెంటనే పాంటు జేబులో దాచుకోవటం నేను మా ఇంటామె కూడా గమనించామండి. రామనాథం ఆమెతో చాలా చనువుగా వుండటం కూడా మేము గమనించాం" చెప్పాడు రాజారావు.

"చాలా మంచి ఇన్ఫర్మేషన్ ఇచ్చారండి, థాంక్యూ వెరీమచ్!" అంటూ లేచాడు శ్రీనివాస్.

సార్జంట్ విల్సన్‌ని పిలిచి, "రామనాథం గురించి ఎవరైనా వచ్చారా?" అనడిగాడు.

"ఎవరూ రాలేదు సార్! నేను వెయ్యి కళ్ళతో చూస్తున్నాను" అన్నాడు విల్సన్.

"ఈ షూస్ ప్యాక్ చేసి జీప్‌లో పెట్టు" అన్నాడు శ్రీనివాస్ అంబాసిడర్ షూస్ చూపించి.

విల్సన్ వెంటనే వాటిని ప్యాక్ చేసి జీప్‌లో వుంచాడు.

శ్రీనివాస్ కైలాష్ వంక తిరిగి "ఓసారి స్టేషన్‌కి వెళ్దాం. నీ బుల్లెట్ తీసుకో. సరాసరి స్టేషన్ కొచ్చెయ్" అన్నాడు.

"విల్సన్, నువ్వు ఇక్కడే సెంట్రీ ఈ రాత్రికూడా!" అన్నాడు శ్రీనివాస్.

"ఆల్ రైట్ సార్!"

"శివాన్ని రేపు సాయంగా పంపుతాను. నిన్ను రిలీవ్ చేస్తాడు" అన్నాడు శ్రీనివాస్.

శ్రీనివాస్ ఒక్కడు జీప్‌లో స్టేషన్‌కి దూసుకు పోయాడు.

స్టేషన్ కొస్తూనే వినోద్ పోస్టుమార్టమ్‌కి అటెండయిన పాదాల జిస్టుని ఫోన్‌లో కాంటాక్టు చేశాడు.

"ఎస్ డాక్టర్ హరీ స్పీకింగ్" అన్నాడాయన అవతలినుండి.

"ముఖ్యమైన ఇన్ఫర్మేషన్ కావాలి సార్! నేను ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ మాట్లాడుతున్నాను."

"చెప్పండి."

"వినోద్‌ని పోస్టుమార్టమ్ చేశారు కదా! అతన్ని మాంసల కొలనులో పడేశారు కదా. నీటిలో మునిగేసరికి

అతను ప్రాణంతో వున్నాడా? లేక ప్రాణం పోయాక నీటిలో పడేశారా?"

"ప్రాణంతో వుండగానే కొలను నీటిలో పారేశారు. అతని ఊపిరితిత్తుల్లో కొలను నీరు చేరింది. నీటిలో పడ్డ కాసేపటికి ప్రాణం పోయింది. అది ముఖ్యంగా విష ప్రభావం వల్లనే!"

"థాంక్యూ! రజనీకాంత్‌ని కూడా పోస్టుమార్టం చేశారు కదా! ఇద్దరి శరీరంలోను ఒకే రకమైన విషం వుందా? వేరు వేరా?"

"ఒకటే పొటాషియం సైనేడ్‌ని తక్కువ పర్సం టేజితో ఇచ్చారు. అందుకే వెంటనే ప్రాణం పోయి వుండదు. కొంత టైం తీసుకుంది. అంటే దాదాపు రెండు గంటలు. సాధారణంగా సైనేడ్ ప్రయోగించిన వెంటనే ప్రాణం తీస్తుంది. ఈ కేసులో కొంత ఆలస్యంగా అది తన ప్రభావాన్ని చూపించింది."

"థాంక్యూ డాక్టర్! థాంక్స్ ఎలాట్" అంటూ ఫోన్ పెట్టేశాడు శ్రీనివాస్.

సార్జెంట్ శివం వచ్చి సెల్యూట్ చేశాడు.

"రజనీకాంత్ వీణావతి ఇంటికి తరచు వెళ్తుండే వాడట సార్! వినోద్ లేనపుడు కూడా అతను యథేచ్ఛగా పోయి వస్తూండేవాడట. వీణావతి యింటి కెదురుగా వున్న టైలరింగ్ షాపులోను, వీణావతి ఇంటి వరుసలో వున్న మెడికల్ స్టోర్సులోను నమ్మకమయిన సమాచారం తెలిసింది. వీణావతి ఇంట్లో పనిచేసే పని పిల్ల ఇంకో సమాచారం కూడా ఇచ్చింది."

"ఏమిటది?" ఆసక్తిగా సీట్లో వంగాడు శ్రీనివాస్.

"రామనాథం అప్పుడప్పుడు వీణావతి ఇంటికి వచ్చి

వెళుతుండేవాడట. వినోద్, రజనీకాంత్ కలిసి అప్పు డప్పుడు వీణావతి ఇంట్లో మందు బిగించేవారట. రజనీ కాంత్ కి, రామనాధానికి పడదట. ఓసారి వాళ్ళిద్దరు కొట్లాడుకుని కాలర్లు పట్టుకు వేవరకు వచ్చిందట. వీణావతి సర్ది చెప్పి పంపేసిందట."

"అది సరే, వినోద్ రజనీకాంత్—ఆ రోజు, అంటే వాళ్ళిద్దరు చనిపోయిన రోజు రాత్రి వీణావతి యింట్లో పార్టీ చేసుకున్నారా?"

"అదే చెప్పబోతున్నాను సార్! వాళ్ళిద్దరు రాత్రి పదిగంటల నుండి పన్నెండు గంటల దాకా తాగుతూ కూచున్నారట. పన్నెండు గంటల ప్రాంతాన టైలరింగ్ షాపులోని కుర్రాళ్ళు రజనీకాంత్ తాగి తూలుతూ బయటకి రావటం చూశారు. పండగ సీజన్ మూలాన తెల్లవార్లు టైలరింగ్ చేస్తూనే వున్నారట వాళ్ళ కళ్ళబడ్డాడట. ఆ తర్వాత షెవర్లెట్ కారు బయటకి వెళ్ళటం కూడా చూశారట. ఓ గంట తర్వాత మళ్ళీ కారు లోపలికి రావటం కూడా వాళ్ళు చూశారు."

"స్కై బ్లూ కలర్ షెవర్లెట్ కారేనా? నువు చూశావా?"

"చూశాను సార్ గారేజ్ లో వుంది."

"వెరీ గుడ్! అవసరమయిన దానికన్నా చాలా ఎక్కువ సమాచారం—వెరీ వేల్యుబుల్ యిన్ఫర్మేషన్ తెచ్చావు. నీకు ప్రమోషన్ కి కాన్ఫిడెన్షియల్స్ పంపిస్తాను" అన్నాడు శ్రీనివాస్ ప్రశంసగా చూస్తూ.

సార్జెంట్ శివం వినయంగా నవ్వాడు.

"గెటప్ క్లైమాక్స్. కేసుకి తుది రూపం వచ్చింది. పద!" అన్నాడు శ్రీనివాస్ పరుగులాంటి నడకతో.

సార్జెంట్ శివం వేలిముద్రల నిపుణుడు కైలాష్‌తో బాటు శ్రీనివాస్‌ని అనుసరించాడు.

## 7

"మళ్ళీ ఎందుకొచ్చారు?" గుమ్మంలోనే నిలేసినట్లు అడిగింది వీణావతి.

"అబ్బే, ఏం లేదు. పతిని కోల్పోయిన దుఃఖంలో వున్న మిమ్మల్నోసారి పరామర్శించి పోదామని వచ్చాం" అన్నాడు శ్రీనివాస్ వ్యంగ్యంగా.

"నన్ను చీటికి మాటికీ డిస్టర్బ్ చెయ్యటం బావుండ లేదు. అసలే పుట్టెడు దుఃఖంలో వున్నాను" ఆమె కంఠం పూడుకుపోయింది.

"ఆ మాట నిజమే! రజనీకాంత్ నిష్కారణంగా చనిపోయాడు."

"రజనీకాంత్ విషయం యెవరడిగారు? మా వారి సంగతి నే మాట్లాడుతున్నది!"

"అవును. అదే నేనూ అంటున్నాను. పాపం రామ నాథం చనిపోయాడు నిష్కారణంగా."

"రామనాథం ఎవరు?"

"నీకోసం నీ ప్రలోభంలో పడి నువు ఆడమన్నట్లల్లా ఆడి, నీ మోచేతి నీళ్ళకు కక్కుర్తిపడి, చివరికి దారుణంగా నీవల్ల చచ్చిన రామనాథం సంగతే నే చెప్తున్నది."

"మిష్టర్ యిన్‌స్పెక్టర్. అధిక ప్రసంగం. మీరు వెంటనే మెంటల్ డాక్టర్ని చూడటం మంచిది."

"థాంక్స్ ఫర్ యువర్ అడ్వయిజ్" అంటూ శివానికి సైగ చేశాడు శ్రీనివాస్.

శివం చొరవగా ముందుకు వెళ్ళి గోడ బీరువాలను తనిఖీ చేయటం మొదలెట్టాడు.

"ఏమిటీ దౌర్జన్యం? నా యింట్లో నా అనుమతి లేకుండా జబర్దస్తీగా ప్రవేశించి అల్లరి చేస్తారా? మీ పోలీసుల ఆగడం జులుం నా దగ్గిర పనిచెయ్యవు."

"ఆ సంగతి తెలిసే సెర్చి వారంట్ తీసుకునే వచ్చాం మేడమ్! ఇదిగో చూడండి!" అన్నాడు కైలాష్ వారంట్ ఆమె ముందు పెట్టి.

"ఇదిగో సార్ బ్రాందీ సీసాలు, విస్కీ బాటిల్స్" అన్నాడు శివం డిస్కవరీ చేసినవాడిలా.

నిపుణుడు పౌడర్ చల్లి సీసాలమీద వేలిముద్రలు సేకరిస్తున్నాడు.

"అన్నీ అక్కర్లేదు. ఇదిగో సగం ఖాళీ అయిన యీ రెండు బాటిల్స్‌మీద, ఈ గ్లాసుల మీద ప్రయత్నించండి" అన్నాడు శ్రీనివాస్.

వీణావతి కోపంగా చూస్తోంది.

"రామనాథాన్ని ఎందుకు చంపించావు?" అడిగాడు శ్రీనివాస్.

"రామనాథం ఎవరు? నేను చంపించటమేమిటి?"

"ఇంకా ఎందుకు బుకాయిస్తావు మేడమ్! నేనే చెపుతానులే. రామనాథానికి నీ రహస్యాలు, ప్రేమ కలాపాలు బాగా తెలుసు. వినోద్‌ని హత్య చేసినపుడు హంసల కొలనులో పారెయ్యటానికి, కూర్మారావుని హత్య చేయటానికి అతన్ని బాగా ఉపయోగించుకున్నావు. నీమీది ప్రలోభంతోను, నువ్విచ్చే డబ్బుకు ఆశపడి రామనాథం నువ్వు చెప్పినట్లల్లా ఆడాడు. నీ రహస్యాలు బయట పెట్టకుండా శాశ్వతంగా అతని నోరు మూయించటానికి ఓ మనిషిని నియోగించావు. వాడు జగన్నాథం లారీని దొంగిలించి దాంతో రామనాథాన్ని,

చం పేసి సీధంగా వున్న నీ షెవర్లెట్ లో తప్పించుకు పారిపోయాడు...."

"అబద్ధం. అంతా ఉత్తది" అరిచింది.

కూర్మారావు నీ మాజీ ప్రియుడు. నువ్వు రజనీ కాంత్ తో ప్రేమాయణం మొదలెట్టాక అతన్ని నిర్లక్ష్యం చేశావు. నీ రహస్య కలాపాలు నీ భర్తకి చెపుతానని కూర్మారావు బెదిరించాడు. అతన్ని అడ్డు తొలగించటానికి అమాయకుడైన రామనాథాన్ని ఉపయోగించుకున్నావు. రామనాథం కూర్మారావుని అదును చూసి చం పేశాడు. అతనికి రజనీకాంత్ అంటే ఇష్టముండదు. ఇద్దరికీ ఏవో మనస్పర్థలున్నాయి. దాంతో అనుమానం రజనీకాంత్ మీదికి పోవాలని కూర్మారావు రక్తంతో శవం మంచం కింద నేలమీద రజనీకాంత్ పేరు కొంత భాగం రాసి అనుమానం రజనీకాంత్ మీదికి మళ్ళించాడు. ఆ సంగతి నీకు తెలీదు.

"నీ రెండో హత్యాకాండ వినోద్ ని అడ్డు తొలగించుకోవటం. నీ కార్య కలాపాలకు వినోద్ పెద్ద అడ్డంకి. రజనీకాంత్ నువ్వు పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నారు. ఫలితంగా రజనీకాంత్ వినోద్ మందు పార్టీ చేసుకుంటుండగా వినోద్ తాగుతున్న బ్రాందీలో విషం కలిపేశావు. కాని దురదృష్టవశాత్తు ఆ బ్రాందీ తాగుడు మైకంలో రజనీకాంత్ కూడా కొంత రుచి చూసేశాడు. ఆ సంగతి నువ్వు గమనించలేదు. విషం తన పని తను చేసింది. పార్టీ అయిపోయాక నీ ప్రియుడు యింటికి వెళ్ళిపోయాడు. నువ్వు ముందుగా రామనాథానికి చెప్పి వుంచావు. వినోద్ అప్పటికే స్పృహ తప్పిపోయాడు. అతన్ని కారులో వేసుకుని దార్లో రామనాథాన్ని

ఎక్కించుకుని హంసల కొలనుకి చేరుకున్నారు. అక్కడ రామనాథం సాయంతో వినోద్ ని కొలనులో ముంచేశావు. కాని ఆ హడావిడిలో నీ చెవి జూకా అక్కడే బురదలో జారి పడిపోవటం గమనించలేదు పాపం!....ఇదిగో నీ చెవి జూకా!" అన్నాడు శ్రీనివాస్, జూకా పైకి తీసి చూపిస్తూ.

వీణావతి నిలువెల్లా ఒణికిపోతోంది. ఆమె అందమైన ఫాలభాగం చిరు చెమటతో తడిసిపోయింది. ఉచ్ఛ్వాస నిశ్వాసల వేగం పెరిగింది.

"ఒక అబద్ధాన్ని కప్పిపుచ్చుకోవటానికి మరిన్ని అబద్ధాలు, ఓ హత్యను కప్పిపెట్టుకోవటానికి మరిన్ని హత్యలు తప్పనిసరి. అలాగే నీ హత్యాకాండ రామనాథాన్ని చంపటంతో ముగిసింది. రామనాథాన్ని చంపటానికి నువ్వెవర్ని నియమించావో అదీ బయటపడుతుంది" అన్నాడు శ్రీనివాస్.

వీణావతి వున్నచోటనే కుప్పలా కూలిపోయింది.

—:ఐ పో యి ం ది:—

# రక్తపుటేర్లు

## వసుంధర

(గత సంచిక తరువాయి)

మంగళ హోటల్లో తన గదిలోకి వెళ్ళింది. ఇద్దరూ విశేషాలు మాట్లాడుకున్నారు. రామకృష్ణ చేసిన దొంగ తనం కారణంగా వచ్చిన ఇబ్బందుల గురించి చర్చించు కున్నారు. ఈలోగా ఆ గదికి విజయబాబు వచ్చాడు. మంగళ దాక్కుంది. మధురిమ అక్కా చెల్లెళ్ళ రహస్యాన్ని మినహాయించి మిగతాది విజయబాబుకి చెప్పింది. పట్టరాని ఆగ్రహంతో అతడామెను కాల్చి చంపాడు.

"చంపడూ మరి! మధురిమ అజాగ్రత్త వలన అతడి జీవితం సర్వనాశనమైంది—" అన్నాడు రామకృష్ణ.

మంగళ చెబుతున్న కథ జాహ్నవికి చాలా విచిత్రంగా వుంది. మంగళ అనాకారితనాన్ని ప్రేమించాడన్న నెపంతో ఆమె బురఖా స్త్రీగా మారి ప్రతాప్ ఇంట్లో అడుగుపెట్టింది.

"ప్రతాప్‌కి మీ రహస్యం ఎలా తెలిసిపోయింది?" అంది జాహ్నవి.

"అతడికి మా రహస్యం తెలిసిందనుకోవటం మా పొరపాటు. ఆ ఒక్క పొరపాటు కథను ఎన్నో మలుపులు తిప్పింది....."

"మరి అతను అనాకారి మంగళను ప్రేమించినట్లు ఎందుకు నటించాడు?"

మంగళ నవ్వింది — "సృష్టిలో రకరకాల మనుషులుంటారు. వారి అభిరుచులు చిత్రవిచిత్రంగా ఉంటాయి. మనం తెలుపుచూసి మురిసిపోతాం. అమెరికన్ యువతులు నల్లని నీగ్రోలంటే అపరిమితమైన మోజు చూపిస్తారు..."

"అంటే?" అంది జాహ్నవి.

"ప్రతాప్‌కి నలుపన్నా, అనాకారితనమన్నా ఏదో చెప్పలేని ఆకర్షణ ఉన్నదని నా అనుమానం. మధురిమ చెప్పింది-అనాకారి రూపంలో ఉన్నతననతడు గాఢంగా ముద్దు పెట్టుకున్నాడని. మనిషి కాంక్షను ముద్దుతో అంచనా వేయవచ్చు. ఆ తర్వాత నేను అనాకారిననే భావంతో అతడు వారింటికి నేను చేరిన రాత్రి పెట్టుకున్న ముద్దు-అతడికి అనాకారితనంపట్లగల ఆకర్షణను చెప్పకనే చెబుతుంది—" అంది మంగళ.

ఈ సంభాషణ జాహ్నవికి అంతగా రుచించలేదు. ప్రతాప్ వేరే యువతిని ముద్దు పెట్టుకున్నాడన్న భావం ఆమె మనసును కలవరపరిచింది — "నువ్వు కల్పించి చెబుతున్నావు. ప్రతాప్ అలాంటివాడు కాదు...."

"అంటే?"

"పరాయి స్త్రీలను ముద్దు ..." అని ఆ మాట అనడానికే సంకోచంగా ఆగిపోయిందామె.

మంగళ తమాషాగా నవ్వింది—"ముద్దేం కర్మ—అతడి లీలలు అంతకంటే ఎక్కువే చూశాన్నేను...."

"ఏం చూశావ్?"

"అతడికి వంటమనిషి సావిత్రితో అక్రమ సంబంధముంది. నేను నా కళ్ళారా చూశాను. అయితే ఈ విషయం అతడి తలిదండ్రులక్కూడా తెలియదు...."

జాహ్నవికి కళ్ళు తిరుగుతున్నట్లనిపించింది—"నువ్వు

తిరుగుబోతుని. అందుకే నీ నోటికి హద్దూపద్దూ లేకుండా ఉంది—"

మంగళ చిన్నబుచ్చుకోలేదు. "నేను నర్తకిని. కొందరు నాట్యం చేసి శరీరాన్ని కదిలిస్తారు. నేను శరీరభాగాల్ని ప్రదర్శిస్తాను. మగవాళ్ళు నా చుట్టూ తిరిగే మాట నిజం. కానీ నేను నా చుట్టూ ఒక వలయం ఉంచుకుని ఆ వలయానికి అవతల నే మగవాళ్ళను నిలబెడుతున్నాను. ఆ విషయమై ఎవర్నీ నమ్మించాలని నేను అనుకోవడంలేదు. నా గురించిన నిజం చెబుతున్నాను. అంతే! సావిత్రి నాకులాగే నిజాయితీపరురాలు. ఆమె నడిగితే నీకు నిజం తెలుస్తుంది. ఆమె అబద్ధమాడదని నా నమ్మకం...."

ఏమనాలో తెలియలేదు జాహ్నవికి. రామకృష్ణ ఆమెకు సాయం చేశాడు — "నీ వృత్తిలో పవిత్రత అసాధ్యమేనని చాలామంది అనుకుంటారు. అలా అనుకోవడంలో తప్పులేదనుకుంటాను...."

మంగళ మళ్ళీ నవ్వింది—"జాహ్నవికి ప్రతాప్ బావ అవుతాడు. జాహ్నవి అందం చూస్తూంటే ఆడదాన్ని నాకే మతిపోతోంది. అలాంటిది ఆమె బావ ప్రతాప్ ఆమెను కాదన్నాడంటే నలుగురూ జాహ్నవి శీలాన్ని శంకిస్తే అందులో తప్పుంటుందంటారా?"

జాహ్నవి ముఖం ఎర్రగా అయింది. రామకృష్ణ జాహ్నవిని నొప్పింపజేసే జవాబు వచ్చే ప్రశ్న తను వేశానని బాధపడ్డాడు తప్పితే మంగళను ఏమీ అనలేక పోయాడు. ఆమె అడిగిన ప్రశ్న న్యాయంగానే ఉంది మరి!

మంగళ వెంటనే తనే అందుకుని—"ఊరికే వాదన కోసం అలా అన్నాను. ఈమెను చూస్తూంటే అలాంటి

మాట అన్నవారి నాలుకను చీల్చి వేయాలనిపిస్తుంది. మానవలోకంలో పుట్టాల్సిన మనిషి కాదీమె!" అంది.

జాహ్నవి సిగ్గుపడి-"నేను నిన్ను చెడ్డమాటలన్నాను. నువ్వు నన్ను మంచిమాటలంటున్నావు. నాకంటే నువ్వే గొప్పదానివి...." అంది.

"నువ్వనా్న నన్ను గొప్పతనం అంటదు. నీకూ నాకూ ఓ పెద్ద తేడా వుంది. ఎవడైనా నన్ను ప్రేమించా డనుకో. వాడు నా భుజంమీద చెయ్యి వేస్తాడు. నిన్ను ప్రేమించినవాడు నీ కాళ్ళమీద పడతాడు. నన్నిద్దరు ప్రేమిస్తే — వాళ్ళిద్దరు కూడబలుక్కొని వంతులుగా నన్ననుభవించాలనుకుంటారు. నిన్నిద్దరు ప్రేమిస్తే వాళ్ళలో వాళ్ళు పోరాడుకుని ఒకరినొకరు హతమార్చుకోవాలను కుంటారు. నాకోసం డబ్బు ప్రవహిస్తుంది. కానీ నీకోసం రక్తం ప్రవహిస్తుం...." అంది మంగళ.

"నువ్వు నిజమే చెప్పావు. జాహ్నవికి ఏ సంబంధం కుదిరినా వరుడు వెంటనే హత్యచేయబడుతున్నాడు..." అన్నాడు రామకృష్ణ.

"హంతకుడు దొరకలేదా?" అంది మంగళ ఆశ్చ ర్యంగా.

"ఇప్పుడా అనుమానం విజయబాబు మీద ఉంది—" అన్నాడు రామకృష్ణ-"అతడు చాలాకాలంగా జాహ్నవి మీద కన్నువేశాడు. ఆమెకు కుదిరిన ఒకో వరుడినే చంపాలని పథకం వేసుకున్నాడు. అలా కొందరు చచ్చేక ఆమె తనను కాదనలేదని అతడి ఆశ. అందుకు కొన్ని ఋజువులున్నాయి. విజయబాబు సగం ఒప్పు కున్నాడు...."

జాహ్నవి ముఖం పాలిపోయింది. "నా కోసం విజయ

బాబు అనేవాడు పథకంవేసి ఇలా వరుసగా ఒక్కొక్కరినే హత్య చేస్తున్నాడా? ఎంత ఘోరం? నాకోసం రక్తపుటేర్లు ప్రవహిస్తే అది నాకు సంతోషాన్నేలా ఇస్తుంది?"

"మనుషుల ఆలోచన అలాగే ఉంటాయి. ఒకవేళ ప్రతాప్‌కీ విషయం తెలుసునేమో! అందుకే అతడు జాహ్నవికి దూరంగా ఉంటున్నాడేమో? ఆమెతో వివాహం తన ప్రాణం తీస్తుందని అతడు భయపడుతున్నాడేమో?" అంది మంగళ ఆలోచిస్తూ.

జాహ్నవి కూడా ఆలోచనలో పడింది.

ప్రతాప్ తనలో ఏదో లోపముందన్నాడు.

అది ప్రాణభయమా?

లేక అతడి అనాకారితనమంటే మాత్రమే ఆకర్షణ ఉన్నదా?

జాహ్నవికి ప్రతాప్ మాటలు గుర్తుకువస్తున్నాయి. తనకు సంబంధం కుదిరితే అతడిలో స్పష్టమైన నమ్మకం కనిపించేది. ఆ వరుడు చావాలని తను కోరుకుంటే—చస్తాడని అతడు నమ్మేవాడు. ఆ నమ్మకంలో భయంలేదు. సంతోషం ఉండేది. అతడి నమ్మకమూ, సంతోషమూ చూస్తూంటే ఆ హత్య అతడే చేశాడా అనిపించేది. చావు వార్త విన్నాక అతడిలో ఆశ్చర్యం కూడా కనబడేది కాదు.

ప్రతాప్ తన లోపం గురించి మరీమరీ మాట్లాడేవాడు. నొక్కి చెప్పేవాడు. ఏమిటా లోపం?

ఆ లోపం సవరించుకుందుకు తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నానన్నాడు. కొద్ది రోజుల్లో ఫలితం కనబడవచ్చు కూడా అన్నాడు.

ఏమిటా ప్రయత్నాలు?

మంగళ, రామకృష్ణ చాలా చాలా మాట్లాడుకుంటున్నారు. మాటల మధ్యలో రామకృష్ణ అన్నాడు— "ఇప్పుడు జాహ్నవిని చేసుకోబోయేవాడు నిజంగా అదృష్టవంతుడు. ఆమెను ప్రేమించినవారి ఊళ్ళో చాలా మంది ఉన్నారు. వారిలో చాలామంది అసమర్థులు. కొందరు ప్రమాదకారులు. ప్రమాదకరమైన వారందరూ మధురిమ కారణంగా పట్టుబడి పోలీసు కస్టడీలో వున్నారు. ఇప్పుడు జాహ్నవిని వివాహమాడదల్చుకున్న వాడికి ఏ అడ్డూ లేదు—"

ఈ మాటలు జాహ్నవి చెవులబడ్డాయి. తనకూ, ప్రతాప్‌కీ మధ్య అడ్డంకులన్నీ ఒకటొక్కటిగా తొలగిపోతున్నాయా?

ఆమె ఆలోచిస్తూండగానే మంగళ చెప్పింది— "రామకృష్ణా! ప్రస్తుతం నా ఉనికిని బయటపెట్టకు. నీకే సాయం కావాలంటే అది చేస్తాను. నువ్వెలా మసులుకోవాలంటే అలా మసులుకుంటాను—"

"నువ్వు కొంతకాలం బురఖా యువతిగానే ఉండు" అన్నాడు రామకృష్ణ.

మర్నాటికి జాహ్నవి పెళ్ళికొడుకుల హత్య వివరాలు బయటకు వచ్చాయి. అదంతా తన పథకమేనని విజయబాబు ఒప్పుకున్నాడు. మధురిమలో మూడు పువ్వులూ, ఆరు కాయలూగా విలసిల్లిన తన స్మగ్లింగ్—జాహ్నవి రాకతో మరింత వృద్ధి చెందుతుందని అతడు భావించాడు. జాహ్నవి వంటి సజ్జనుల జోలికి వెళ్ళాలనుకోవడంవల్లనే తన పథకం బెడిసికొట్టిందని అతడు వాపోయాడు. ఈ వార్త జాహ్నవిని బాగా కృంగదీసినా—ఆ హత్యలకూ

ప్రతాప్‌కూ సంబంధం లేనందుకు ఆమె సంతోషించింది.

అయితే జాహ్నవి ఉండబట్టలేక ఆ ఉదయమే ప్రతాప్ ఇంటికి వెళ్ళింది. ఆమె వెళ్ళేసరికి ప్రతాప్ ఇంకా లేవలేదు.

"లేచినా మన మనిషి కాదమ్మా—వారం పదిరోజులు యెవర్నీ తన జోలికి రావద్దని అన్నాడు వాడు. భోజనం కూడా వాడి గదిలో పెట్టేసి వస్తున్నాను...." అంది లక్ష్మమ్మ కూర తరుక్కుంటూ.

అప్పటికి ఆ విషయం గుర్తించిన జాహ్నవి—"అత్తయ్యా—సావిత్రి లేదా?" అనడిగింది. సావిత్రి ఉంటే వంటపని లక్ష్మమ్మ చేయదు.

"లేదమ్మా—ఈ రోజే సెలవు తీసుకుని వెళ్ళిపోయింది. పదిరోజులు సెలవు కావాలంది. వదరదని అంటే ఎన్నడూ లేనిది ఎదురుతిరిగింది. పని మానేస్తానంది. అదృష్టం బాగుంటే ఈ అమావాస్య తర్వాత తన రోజులు మారతాయంది—" అంది లక్ష్మమ్మ.

"ఏముందీ-అమావాస్య తర్వాతా?" అంది జాహ్నవి ఉలిక్కిపడి. తనకు కూడా ప్రతాప్ అమావాస్య తర్వాత లోపం సవరించబడుతుందని చెప్పాడు.

"ఏం—అలా అడిగావ్?" అంది లక్ష్మమ్మ.

జాహ్నవి బదులివ్వలేదు. ఆమె ఆలోచిస్తూ—"అత్తయ్యా—బావ సావిత్రితో యెలాగుండేవాడు!" అనడిగింది.

లక్ష్మమ్మ వెంటనే ఏమీ చెప్పలేదు. కాస్సేపయ్యాక మాటలలో—ఓసారి అతడు ఏ సందర్భంలో సావిత్రిని పెళ్ళిచేసుకుంటానన్నాడో చెప్పింది. అది విని జాహ్నవి ఆశ్చర్యపడింది.

ప్రతాప్‌లో ఏదో రహస్యముంది?

"ఏమిటది?

మంగళ, నల్లగా, అనాకారితనంలో ఉంటే అతడు ఆమెను రోడ్డుమీద ముద్దుపెట్టుకున్నాడు. తనూ అలా గుంటే....

తను అనాకారి కాదు. తన వంటిరంగు నలుపుకాదు.

అయితే మంగళా అనాకారి కాదు. ఆమె వంటి రంగూ నలుపు కాదు.

హఠాత్తుగా తన ఆలోచనకి దారిని మళ్ళడానికి కారణమేమిటి?

అర్ధంకాలేదు జాహ్నవికి. ఎవరో చెప్పినట్లు హఠాత్తుగా తన బుర్రలో ప్రవేశించింది ఆ ఆలోచన.

జాహ్నవి ఆలోచిస్తోంది. అమావాస్య నాటితో తన లోపం సవరించబడుతుందని ప్రతాప్ అన్నాడు. అమావాస్యనాడు తను మంగళకులా నల్లగా, అనాకారిగా మారగలిగితే!

అమావాస్యనాడు....అమావాస్యనాడు....

ఎందుకు తనకలా అనిపిస్తోంది?

జాహ్నవి ప్రతాప్ ఇంట్లోంచి బయటకు వచ్చింది. రోడ్డుమీద ఆమెకు ముందుగా ఓ ముసలివాడు ఏవో గొణుక్కుంటూ నడుస్తున్నాడు. వాడి మాటలు జాహ్నవికి స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"అమావాస్యనాడు....అమావాస్యనాడు....

జాహ్నవి నడక వేగం పెంచి ఆ ముసలాణ్ని సమీపించి—"ఏయ్—ఎవర్నువ్వు?" అంది.

ఆ వృద్ధుడు తల వంచుకున్నవాడల్లా చటుక్కున తలెత్తి-"ఊఁ" అన్నాడు. అతణ్ని చూస్తూనే జాహ్నవి

ఉలిక్కిపడింది.

బ్రతికున్న పిశాచంలా ఉన్నాడతను.

"ఎవర్నువ్వు?" అంది జాహ్నవి మళ్ళీ.

"పంచమి, షష్టి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి—మొత్తం పది రోజులు. పదకొండోరోజు అమావాస్య. అమావాస్య నాడు...."

"ఊఁ అమావాస్యనాడు...." అంది జాహ్నవి.

"నల్లగా వుంటుంది. నలుపే ఓ పెద్ద అనాకారితనం."

నల్లగా....అనాకారితనం....జాహ్నవి బుర్రలో ఏదో మెదుల్తోంది. ఏదో సూచన ఆమెకు....

"ఎవర్నువ్వు?" అందామె.

"నన్నందరూ మంత్రగాడంటారు. కానీ బాబా అనిపించుకోవడమే ఇష్టం నాకు...." అన్నాడా వృద్ధుడు.

"ఎందుకని?" అంది జాహ్నవి.

"నేను కొన్ని శక్తుల్ని ఉపాసిస్తున్నాను. అందువల్ల నాకు కొన్ని శక్తులు సంక్రమించాయి. అందువల్ల చాలా మంది నన్ను మంత్రగాడంటారు. కానీ నేను నా మంత్ర శక్తుల్ని మానవ శ్రేయస్సుకే ఉపయోగిస్తాను. అందుకని బాబా అనిపించుకోవాలిగదా!"

"నీ శక్తుల్ని మానవ శ్రేయస్సుకుపయోగిస్తావని నమ్మకమేమిటి?" అంది జాహ్నవి.

"ఉదాహరణకు నీ సంగతి తీసుకో. నువ్వు ప్రతాప్ ని ప్రేమిస్తున్నావు. కానీ అతడిలో ఏదో లోపముంది. ఆ లోపం పోగొట్టి మీ ఇద్దర్నీ ఒకటి చెయ్యాలనుకోవడం సత్కార్యమేనా, కాదా?" అని అతడు ముందుకు

నడవడం ప్రారంభించాడు.

జాహ్నవి అతడిని అనుసరిస్తూ — "ఇవన్నీ నీకెలా తెలుసు? ప్రతాప్‌లోని లోపమేమిటి?" అని అడిగింది.

"అవన్నీ ఇప్పుడు చెప్పకూడదు...." అన్నాడు బాబా.

"పోనీ అతడి లోపం పోగొట్టడానికి నువ్వేం చేస్తున్నావ్?"

"అది కొంత చెబుతాను. వచ్చే అమావాస్య రోజున నల్లని దేహఛాయతో, అనాకారి రూపంలో ప్రతాప్‌కి కనిపించు. అతడేం చేసినా అభ్యంతరం పెట్టకు. అతడి లోపం తొలగిపోతుంది. నీ మనోవ్యథ కూడా తొలగిపోతుంది...." అన్నాడు బాబా నడుస్తూనే.

"అతన్నెక్కడ కలవాలి బాబా?" అంది జాహ్నవి.

"అది ఇప్పట్నించీ అడక్కు...."అన్నాడు బాబా— "ఇదంతా పెద్ద రహస్యం. నీకూ నాకూ తప్ప యెవరికీ తెలియకూడదు. గుర్తుంచుకో....అమావాస్యనాడు...."

బాబా వెళ్ళిపోయాడు.

జాహ్నవి ఇంటికి వెళ్ళింది. తను నల్లగా మారడానికి మంగళ సాయమూ, సలహా తీసుకోవాలని ఆమె అనుకుంది.

• • •

ఆ రోజు అమావాస్య.

జాహ్నవి ఆ రోజు చాలా ఉత్సాహంగా వుంది. తన జీవితంలో ఏదో గొప్ప మార్పు వస్తుందని ఆమె ఆశిస్తోంది.

మంగళ ఆమెకు నల్లగా తయారవడం యెలాగో చెప్పింది. కానీ ఆమె ఇప్పుడు ఇంట్లోలేదు. ఆమెను

రామకృష్ణ ఎక్కడికో రహస్యంగా పంపించేశాడు. అతడీ ఊరు వచ్చిన వ్యవహారాలన్నీ ఒకటొక్కటిగా ముగుస్తున్నాయి. ఇంక రెండు మూడు రోజుల్లో అతను మకాం ఎత్తేయవచ్చు.

"ఒకేఒక్క ముఖ్యమైన పని మిగిలిపోయింది. అదీ ముగిస్తే నా జీవితంలో ఇంత జయప్రదమైన ట్రిప్పు ఉండదు—" అన్నాడు రామకృష్ణ జాహ్నవితో.

"ఏమిటా మిగిలిపోయిన పని!"

"ఒకరోజున — అనగా మొదటిసారి మీ ఇంట్లో నేను అడుగుపెట్టిన రోజున మీ అమ్మగారు నేను ఢిల్లీ పెళ్ళికొడుకననుకుని మర్యాదలు చేశారు. ఆ విధంగా చూస్తే మీకై వచ్చిన మొదటి పెళ్ళికొడుకను నేనే.... అలా వచ్చి ఇంతవరకూ బ్రతికి ఉండడం కూడా నా అదృష్టం. మీకై వచ్చినవారంతా శవాలుగా మారి పోయారు. మీరు కాదంటే నేనూ బ్రతికున్న శవాన్నవుతాను. అవునంటే శవమైనా బ్రతికి వస్తాను...." అన్నాడు రామకృష్ణ.

జాహ్నవి నివ్వెరపోయింది — "మీరు....మీరు.... నన్ను ప్రేమిస్తున్నారా?" అందామె.

"మీరు నా ప్రేమను అంగీకరిస్తే అది నా అదృష్టం. నేను మిమ్మల్ని ప్రేమించడంలో ఆశ్చర్యమేముంది? అది సహజం—" అన్నాడు.

"ఏమో— నేను మీ గురించి ఎన్నడూ ఆలోచించ లేదు...."

"కానీ నేను ఈ గుమ్మంలో అడుగుపెట్టిన క్షణం నుంచీ మీ గురించే ఆలోచిస్తున్నాను. నా వృత్తిలో నేనెప్పుడూ ఇంతగా రాణించలేదు. మిమ్మల్ని చూసేక

నాలో ఉత్సాహం పొంగి—సమర్థత పూర్తిగా పైకి వచ్చింది. మేధకు పదును పండింది. జీవితంలో ఎన్నో సాధించి మీ మెప్పు పొందాలనుకున్నాను. ఊరు వదిలే టప్పుడు మీతో కలిసి కదలాలనుకున్నాను...."

జాహ్నవి ఇబ్బందిగా — "మనమీ విషయం రేపు మాట్లాడుకుందాం—" అంది.

"ఏమిటి రేపటి విశేషం?" అన్నాడు రామకృష్ణ.

"ఈ రోజు అమావాస్య కదా!" అన్నదామె.

రామకృష్ణ ఇంకేమీ అడగలేదు. ఆమెకు సెంటిమెంటు ఎక్కువ కాబోలనుకున్నాడు. అమావాస్య మంచిరోజు కాదు గదా!

అతను ఇంట్లోంచి బయటకు వెళ్ళిపోయాడు.

సుమారు పదిగంటల ప్రాంతాల జాహ్నవి ఒక్కతీ వీధిలో నిలబడింది. నెమ్మదిగా ఎక్కణ్ణించో బాబా వచ్చాడు.

"రాత్రి పన్నెండింటికి .... పాడుపడిన శివాలయం దగ్గర ....మరిచిపోకు....నీకు శుభం జరుగుతుంది....

బాబా త్వరగా వెళ్ళిపోయాడు.

అతడి మాటలు మననం చేసుకుంటూ జాహ్నవి లోపలకు వెళ్ళిపోయింది. అర్థరాత్రి పన్నెండింటికి శివాలయం దగ్గరకు వెళ్ళడంలోని ప్రమాదం గురించి ఆలోచించడంలేదు. ఆమె మనసులో ఎక్కడా భయమన్నది లేదు.

ఆమె ఆత్రుతగా — ఎప్పుడు చీకటి పడుతుందా, ఎప్పుడు రాత్రి పన్నెండవుతుందా అని ఆలోచిస్తోంది.

* * *

రాత్రి తొమ్మిది గంటలు.

శివాలయం దగ్గర బాబా గొయ్యి తవ్వుతున్నాడు. అతడికి దగ్గర్లో నే ప్రతాప్ వున్నాడు.

"బాబా— నేను సాయం చేయనా?"

"వద్దు. ఈ గొయ్యి నేనే స్వయంగా తవ్వాలి!"

బాబా చెమటలు కక్కుతున్నాడు. కానీ గొయ్యి తవ్వడం మానలేదు. ఆ పని ఇంకా అయిదారు గంటలు పట్టవచ్చు.

ప్రతాప్ చుట్టూ చూశాడు.

మొత్తం పదిగోతులుండేవి. ఇప్పుడెక్కడా ఒక్క గొయ్యి కూడా లేదు. ఏమయ్యాయా గోతులు?

సావిత్రి....నిర్మల....దమయంతి....కోమలి....

ఒకరు కాదు....ఇద్దరు కాదు....పదిమంది!

పది గోతుల్ని మాయం చేశారు.

ప్రతాప్ శరీరం జలదరించలేదు. అతడా రోజు కార్యక్రమానికి సన్నద్ధమవుతున్నాడు.

"గుర్తుంచుకో—నువ్వు మనిషివి కాదు....మృగానివి!" అంటున్నాడు బాబా మధ్య మధ్యలో.

"గుర్తుంది బాబా!" అన్నాడు ప్రతాప్-"ఈ రోజు వచ్చే ఆమె ఎవరో తెలుసుకోవాలని కుతూహలంగా వుంది—"

"మన పూజకు అన్నివిధాలా అర్హురాలైన యువతి ఆమె. ఇంతవరకూ పురుష స్పర్శ ఎరుగని పడతి ఆమె. బేతాళుడిని పూర్తిగా ప్రసన్నం చేసుకోగల రక్తపు ధారలు చిందించగల రమణి ఆమె. నువ్వు నిస్సందేహంగా విజృంభించు. పూజా విధి సక్రమంగా నిర్వహించు. కొన్ని దుష్టశక్తులామెను ఆవహిస్తాయి. నిన్ను తప్పుదారిని పెట్టడంకోసం ఆమె ఏవేవో అరుస్తుంది. నిన్ను మోసం

చేయడానికి ప్రయత్నిస్తుంది. మాయమాటలు చెప్ప డానికి ప్రయత్నిస్తుంది. నువ్వామె మాటలు వినడానికి ప్రయత్నించకు. ఏకాగ్రతతో-నీ దృష్టిని చేతలమీదకు పారించు...." బాబా గొయ్యి తవ్వుతూనే అన్నాడు.

బాబా ఒకో ముక్కా అంటూంటే ప్రతాప్‌లో భ్రాంతత్వం చోటు చేసుకుంటోంది. అతడిలో ఆవేశం రగు లోంది.

కాలం పరుగెడుతోంది.

బాబా గొయ్యి తవ్వడం సగం పూర్తయింది.

"ఉన్నట్లుండి — "అదిగో — ఆమె వస్తోంది!" అన్నాడు బాబా.

ప్రతాప్ చూశాడు. దూరంగా ఒక యువతి!"

"గుర్తుంచుకో....నువ్వు మృగానివి...."

• • •

సుకుమార్‌కి నిద్రపట్టడం లేదు. టైము పన్నెండు కావస్తోంది. పావుగంటో, ఇరవై నిమిషాలో ఉన్నట్లుంది. అతను కాసేపేదైనా నవల చదువుదామనుకున్నాడు.

పెర్రీమాసన్ నవల ఒకటి జాహ్నవి గదిలో వుంది. అది తెచ్చుకోవాలి .... సుకుమార్ జాహ్నవి గదిలోకి వెళ్ళాడు. గదిలో దీపం వేశాడు.

అక్కడ పుస్తకం వుంది జాహ్నవిలేదు.

ఈ సమయంలో ఆమె ఎక్కడికి వెళ్ళింది.

సుకుమార్ పెద్దగా కలవర పడలేదు. ఓ పావు గంట తర్వాత అతనే కాదు.... మొత్తం ఇంటిల్లపాదీ కలవరపడుతున్నారు.

రామకృష్ణ ప్రతాప్ ఇంటికి పరుగెత్తాడు. అతనెంతో హడావుడి చేస్తేగానీ ఇంటి తలుపులు తెరుచుకోలేదు.

సీతాపతి, లక్ష్మమ్మ—గాఢనిద్రలో వున్నారు. మొత్తం మీద సీతాపతి లేచి తలుపులు తీశాడు.

"జాహ్నవి ఇక్కడెందుకుంటుందీ?" అన్నాడాయన విసుగ్గా.

రామకృష్ణ తడబడకుండా—"ఆమెను వెదకడంలో అతడి సాయం కావాలి నాకు...." అన్నాడు.

అప్పటికి సీతాపతికి వ్యవహారం అర్థమయింది.

ఇంట్లో ప్రతాప్ లేడు.

ప్రతాప్ మంచంమీద ఓ పుస్తకం.... పేజీలు తెరచి ఉన్న పుస్తకం ... తెరచి వున్నచోట — "ఈ రోజు అమావాస్య. బహుశా రేపట్నుంచి నేనూ, జాహ్నవీ....

ఇంకేమీ రాసిలేదు.

రామకృష్ణ చటుక్కున ఆ పుస్తకం అందుకున్నాడు. ఓ పేజీ వెనక్కు తిప్పాడు.

నేనేం చేసినా....అంతా జాహ్నవికోసం....

ఈ రోజు....పాడుబడిన శివాలయం దగ్గర.... నేను చేసిన దానికి నేను కర్తను కాదు. భారమంతా బాబా మీద వేశాను....

చదువుతూంటే రామకృష్ణ కళ్ళు జలదరించింది.

"ఏమిటి బాబూ—అది!" అన్నాడు సీతాపతి.

"ఒకందుకొస్తే ఒకటి దొరికింది. నేను అర్జంటుగా పాడుపడిన శివాలయం వద్దకు వెళ్ళాలి. మీరు రఘురాం గారింటికి వెళ్ళి సాయపడండి.

రామకృష్ణ హడావుడిగా పరుగెత్తాడు.

* * *

"నా పేరు ప్రతాప్!" అన్నాడు ప్రతాప్.

"ఊఁ" అందామె.

"బేతాళుడి ఆజ్ఞ మీద నువ్వెక్కడకు వచ్చావు!"

"ఊఁ."

"నేను మనిషిని కాదు — పశువుని...." అన్నాడు ప్రతాప్.

"కాదు....మనిషివి...." అందామె చటుక్కున.

"నేనన్నదానికి నువ్వు కాదనకూడదు—" అన్నాడు ప్రతాప్. అతడు ఆమెతో తన పూజ ప్రాముఖ్యత గురించి చెప్పాడు.

"నీ సహకారం అర్థిస్తున్నాను. నీకు బాధగా వున్నా సహించాలి. నా చేతలన్నీ సహించాలి. ఇది నా జీవిత సమస్య...."

ఆమె తలాడించింది.

ఇద్దరూ బేతాళ విగ్రహాన్ని సమీపించారు. ఆ విగ్రహాన్ని చూస్తూనే ఆమె గతుక్కుమంది. అంత భయంకరమైన విగ్రహాన్నామె ఎప్పుడూ చూడలేదు.

దూరంగా బాబా గొయ్యి తవ్వుతున్నాడు.

"అక్కడెవరో ఉన్నారు...." అందామె.

"మనవాడే....బాబా!" అన్నాడు ప్రతాప్.

"ఏం చేస్తున్నాడక్కడ?"

మన పూజకోసమే స్వయంగా శ్రమిస్తున్నాడు...."

ఆమె మళ్ళీ బేతాళ విగ్రహాన్ని చూసింది. భయంతో కళ్ళు మూసుకుంది.

కళ్ళు తెరిచేసరికి ప్రతాప్ చేతిలో పైటకొంగు వుంది.

"ఏమిటిది?" అందామె.

ప్రతాప్ ఆమెను బలంగా హత్తుకున్నాడు. ఆమె

విడిపించుకోవాలని చూసింది. అతను సాగనివ్వలేదు.

ఆమె ఆలోచిస్తోంది. తానతన్ని అభ్యంతర పెట్టాలా? లేక మౌనంగా సహించాలా?

తను ప్రతాప్ కోసం కలలు కంటోంది. అతడి పూజకీ రోజు భంగం చేయవచ్చునా, కూడదా? కానీ ఇలా ఉందేమిటి?

ఎలా ఉంటేనేం? ప్రతాప్ తనవాడు....

ఆమె సందిగ్ధంలో పడుతూంటే ప్రతాప్ ఆలోచించ డంలేదు. అతనింకా పశువులా ప్రవర్తించలేదు. మనిషిలా ప్రవర్తిస్తూ అందుకు కావలిసిన సన్నాహాలు చేసుకుం టున్నాడు.

* * *

పాడుపడిన శివాలయం వివరాలకోసం రామకృష్ణ ఆ పుస్తకంతో పావుగంటసేపు గడపవలసి వచ్చింది. ఆ వివరాలు చదువుతూంటే అతడి గుండె ఆగిపోయినంత పనయింది.

ప్రతాప్ ఇలాంటివాడని తనూహించలేదు.

ఈ రోజతడి పాల్పడిన అమాయకురాలెవ్వరో!

తను త్వరపడాలి .... అతను జేబులోని రివాల్వర్ తడుముకున్నాడు.

* * *

"ప్రతాప్..హద్దు మీరుతున్నావు..నన్ను వదులు..."

"నేను నిన్ను వదలను...."

"ప్రతాప్...."

"పేరెట్టి పిలవకు.. నేను మనిషిని కాదు..పశువుని..."

ఆమె తెల్లబోయింది. ఆదేదో పెద్ద విశేషమైనట్లు చెబుతున్నాడు.

అయితే అతడి పశుత్వం ఆమెకు తెలుస్తోంది. తను అక్కడికి రావడం తప్పైనట్లు గ్రహించింది. అటూ యిటూ పరుగెత్తింది. అతనామెను క్రూరంగా తరుము తున్నాడు. గిల్లుతున్నాడు. రక్కుతున్నాడు. కరుస్తు న్నాడు. ఫలితంగా ఆమె కూడా అతణ్ని గిల్లి, రక్కి కరవాల్సి వస్తోంది. ఆ విషయంలో ఎంతో అనుభవమున్న వాడిలా ఒడుపుగా తప్పుకుంటున్నాడు.

అతడి పశుత్వాన్నెలా వారించాలో ఆమెకు తెలియు లేదు.

"ప్రతాప్! నేను....జాహ్నవిని...." అందామె.

"జాహ్నవి...." అన్నమాట వింటూ ప్రూన్పడి పోయాడతను.

జాహ్నవి తనకు లభించిన ఆ ఒక్క క్షణంలోనూ ఆయాసపడుతోంది. ప్రతాప్ తన పేరు విని ఆగిపోవడం ఆమెకు సంతసం కలిగించింది.

ప్రతాప్ ఆమెవంక పరిశీలనగా చూశాడు. ఎక్కడా ఆమెలో జాహ్నవి పోలికలు కనిపించడంలేదు. జాహ్నవి అయితే ఆ రంగు వలు పేమిటి? ఆ పళ్ళు ఎందుకు ఎత్తుగా ఉన్నాయి?

అతడికి బాబా మాటలు గుర్తుకొచ్చాయి. పూజను భగ్నంచేయడానికి ఆ యువతిని దుష్టశక్తులావహించి తనను మోసం చేస్తాయి.

ప్రతాప్ ఆమెమీదకు పులిలా లంఘించాడు—"నువ్వు జాహ్నవివని నాకు తెలుసు. ఆ పేరు చెప్పి భయపెట్టకు. నా జాహ్నవి నా పూజను భగ్నం చేయదు. చెప్పినట్లు వింటుంది...."

జాహ్నవి శతవిధాల ప్రయత్నిస్తోంది. అతణ్ని

చేతులో తీసేస్తోంది. నోటితో తిడుతోంది. వ్యాధి దొరికితే పరుగెడుతోంది. అసహాయస్థితిలో ఏడుస్తోంది.

ప్రతాప్ ....మనిషి కాదు....పశువు కాదు....రాక్షసుడు కాదు....

ఆ దుర్మార్గానికి పదం లేదు....

"ఎవ్వరూ నన్ను కరుణించకపోతే—....మృత్యు దేవతా....నువ్వైనా నన్ను కరుణించు...." అని వేడుకుందామె.

సరిగ్గా అప్పటికి బాబా గొయ్యి తవ్వడం పూర్తయింది. తనలో తను సన్నగా నవ్వుకుంటూ ప్రతాప్ ఉన్నవైపు వెడుతున్నాడు బాబా.

• • •

దూరంగా పాడుబడిన శివాలయం కనబడింది రామకృష్ణకి. ఏదో హడావుడి జరుగుతున్నట్లు కూడా వినబడుతోంది అతడికి. పరుగున అక్కడికి చేరాడు.

అక్కడకు చేరిన రామకృష్ణకు ఒక చేతిలో బ్యాటరీ లైటు....మరో చేతిలో రివాల్వర్ ఉన్నాయి.

"ఎవరక్కడ?" అరిచాడు రామకృష్ణ.

హడావుడి ఒక్కసారిగా ఆగిపోయింది.

"నువ్వెవరు?" అది ప్రతాప్ కంఠం.

"ప్రతాప్. నేను రామకృష్ణను. నీ సంగతంతా తెలుసుకుని ఇక్కడకు వచ్చాను" అన్నాడు రామకృష్ణ.

ఉన్నట్లుండి ఓ యువతి పరుగు పరుగున వచ్చి అతణ్ని వాటేసుకుంది—"రామకృష్ణా! సర్వశక్తులూ క్రోడీకరించుమని నీ దగ్గరకు వచ్చాను. ఈ రాక్షసుడు నా ప్రాణాలు తీసేస్తాడు...."

"ఎవన్నువ్వు?" అన్నాడు రామకృష్ణ.

బ్యాటరీ వెలుగులో ఆమె నగ్నంగా ఉండడమూ, వళ్ళంతా రక్తశిక్తమై ఉండటమూ గమనించాడతను. అతడామెను పొదివి పట్టుకుని-"ఎవరున్నవ్వు?" అన్నాడు.

"నేను—జాహ్నవిని...." అందామె.

"నువ్వు జాహ్నవివా—నమ్మలేను...."

ప్రతాప్ ముందడుగు వేయబోగా గాలిలో రివాల్వర్ పేల్చి వారించాడు రామకృష్ణ. ప్రతాప్ కసిగా రామకృష్ణను చూస్తున్నాడు.

నేను నిజంగా జాహ్నవిని. బాబా చెప్పాడు— నల్లగా, వికారంగా తయారుకమ్మనమని. మంగళ సలహా తీసుకుని ఈ రోజు అలా తయారై ఇక్కడికి వచ్చాను. ప్రతాప్‌లోని లోపం సవరించబడే అవకాశం నాకే వస్తోందని సంతోషపడ్డాను. కానీ...." ఆమె ఆయాసంతో ఆగింది.

"ఎంతపని చేశావు జాహ్నవీ!" అన్నాడు రామకృష్ణ.

"బాబా!" అరిచాడు ప్రతాప్.

"ఏం నాయనా—నా గొయ్యి తియ్యడం పూర్తయింది...." అన్నాడు బాబా అప్పుడే అక్కడ అడుగు పెడుతూ.

"నువ్విక్కడకి రప్పించింది నా జాహ్నవినేనా?"

"ఆమె అలా చెప్పిందా? ఆ మాటలు నమ్మకు...."

ప్రతాప్ బాబావంక క్రూరంగా చూశాడు—"ఆమె సంగతి అటుంచి, బేతాళుడిపైన ఆనవేసి ఆమె ఎవరో చెప్పు!" అన్నాడు.

"బాబా మాట్లాడలేదు."

"ఆమె జాహ్నవి. అవునా?"

బాబా మాట్లాడలేదు.

"ఎందుకిలా చేశావు—బాబా!"

"నీలోని రాక్షసత్వాన్ని నా స్వార్థానికి ఉపయోగించుకున్నాను. మనుషుల ఆలోచనలను ప్రభావితం చేయగల శక్తి నాకుంది. అంతకుమించి నా శక్తి పెరగాలంటే పదిమంది స్త్రీల రక్తంతో బేతాళుడికి అభిషేకం చేయాలి. అటుపైన ఒక కన్యను బలివ్వాలి.

ఆ కన్య పురుష స్పర్శ ఎరుగనిదిగానూ, పరమ పవిత్రురాలిగానూ, మహా సౌందర్యవంతురాలుగానూ, ఇరువది సంవత్సరాల లోపుగానూ ఉండాలి. అన్ని విధాలా అర్హురాలైనది జాహ్నవి. ఆమె గురించి నీ కారణంగానే నాకు తెలిసింది. నువ్వు నీలోని లోపం గురించి చెప్పగానే నేను జాహ్నవి గురించి పథకం వేశాను. జాహ్నవి గురించి ఆలోచిస్తున్న వారందరినీ తెలుసుకున్నాను. కేవలం నాకోసం నిన్ను పూజకు పురి గొల్పాను. ఆమెపై ఆశలు పెంచుకుంటున్న విజయబాబు ఆలోచనలను ప్రభావితం చేశాను. అతడు హత్యచేయడానికి అనువుగా హతుడి ఆలోచనలను ప్రేరేపించే వాడిని. చివరకు జాహ్నవి ఆలోచనలను ప్రేరేపించి ఇక్కడకు రప్పించాను.

చివరిలో పూజ భగ్నమవుతుందని బెంగపడకు. ఇప్పుడే నేను రామకృష్ణ ఆలోచనలను ప్రేరేపించాను. అతడు నిన్నేమీ చేయలేడు. నన్ను సర్వశక్తి సంపన్నుణ్ణి చేసే పూజా విధానం పూర్తిచేయి. జాహ్నవి గురించి బెంగపడకు. ఇటుపైన ప్రపంచంలో ఎప్పుడూ అనుభవించని సుఖభోగాలు నీకు కలిగేలా చేస్తాను....ఊ.... త్వరపడు...."

ప్రతాప్ కదలలేదు.

"అవతల గొయ్యి సిద్ధంగా వుంది. ఈ గొయ్యి ఫ్రెష్‌గా ఉండాలని ఇప్పటికిప్పుడు తవ్వాను. సజీవ సమాధికి ఏర్పాటు.... ఊఁ...."

"బాబా!" అని చెవులు దద్దరిల్లేలా అరిచాడు ప్రతాప్. అతడి చేతులు ఊహించని వేగంతో గాలిలోకి లేచి బాబా తలమీద వాలాయి.

బాబా కుప్పలా కూలిపోయాడు. అతడి తల రెండు చెక్కలయింది.

ప్రతాప్ అదే ఊపులో—"జాహ్నవీ!" అంటూ వాళ్ళిద్దరినీ సమీపించాడు. అప్పటికి రామకృష్ణ తేరు కున్నాడు.

ప్రతాప్ జాహ్నవి కాళ్ళమీద పడిపోయాడు— "జాహ్నవీ—నేను మనిషిని కాదు. పశువును...." ఈ మాటలన్నపుడు తొలిసారిగా అతడి కంఠంలో అవ మానం, వేదన, పశ్చాత్తాపం ధ్వనించాయి. అతడు మళ్ళీ- "నేను మనిషిని కాదు .... పశువును...." అన్నాడు. ఈసారి అతడు ఏడుస్తున్నాడు, మరోసారి—"నేను మనిషిని కాదు....పశువును. జా....హ్నా....వీ.... నేను.." అని ఆగిపోయాడు.

ఆ తర్వాత అతను మాట్లాడలేదు.

కొద్ది క్షణాలాగి రామకృష్ణ వంగుని అతడిచేయి పట్టు కున్నాడు. తర్వాత గుండెలమీద చేయి ఉంచాడు. ఆపైన శ్వాస చూసి-"జాహ్నవీ! ఇతడు మరణించాడు" అన్నాడు.

జాహ్నవి బదులివ్వలేదు. ఆమెకు స్పృహ తప్పింది.

రామకృష్ణ చుట్టూ చూశాడు.

తల పగిలివున్న బాబా....

చలన రహితుడైన ప్రతాప్ ....

తెలివిలేని జాహ్నవి....

భయంకరంగా బేతాళ విగ్రహం....

ఎవరో మాంత్రికుడు రాజకుమారుణ్ని బలి ఇచ్చి సర్వ శక్తులూ పొందాలనుకుని ఎన్నో పూజలు చేసి ఎన్నో ఏళ్ళు శ్రమపడ్డాక ఓ రాజకుమారుణ్ని తెచ్చి ఇవ్వబోగా చివరి క్షణాల్లో ఆ రాజకుమారుడే మాంత్రికుణ్ని బలి చేసి సర్వ శక్తులూ తను సంపాదించుకున్నాడు.

జాహ్నవికోసం ప్రతాప్ అక్కడ రక్తపుటేర్లు పారించాడు. కానీ ఆ జాహ్నవి చివరి క్షణాల్లో రామకృష్ణ చేతుల్లో ఉన్నది.

ఆమెలో జీవం ఉన్నదో లేదో తెలియదు. ఉన్న ఆ జీవం నిలుస్తుందో నిలవదో తెలియదు.

"జాహ్నవీ-నిన్ను నేను బ్రతికించుకుంటాను. నీకోసం నా ప్రాణాలైనా అడ్డువేస్తాను. నాకు నువ్వు కావాలి.. నిన్ను చావనివ్వను...." రామకృష్ణ ఆమె శరీరానికి బట్టలు కట్టబెట్టాడు. ఆమెను ఎత్తుకుని అక్కడి నుంచి పరుగెత్తాడు.

* * *

గదిలో పలంగ జాహ్నవి. ఆమె పక్కన డాక్టర్లు, నర్సులు, హడావుడి....

గది బయట రఘురాం, కృష్ణవేణమ్మ, సుకుమార్, రామకృష్ణ, సీతాపతి, లక్ష్మమ్మ....ఇంకా మరెందరో....

"అప్పుడే ఇంకా ఏమీ తెలియదు...." అంటున్నది లోపల్నుంచి బయటకు వచ్చిన ఓ నర్సు.

అంతా రామకృష్ణ చుట్టూ చేరారు. అతను వారికి చెబుతున్నాడు.

బాబా దగ్గర కొంత ప్రభావం వున్నది. పురుషుల ఆలోచనలను దగ్గర్లో వున్నపుడు ప్రభావితం చేయగల డతడు. అది మానవ మేధస్సులో ఒక భాగమని తెలియక అతడు తానొక మానవాతీతుడునని భ్రమించాడు. జనులతన్ని గుర్తించాలనుకున్నాడు. గుర్తించినవారు అతణ్ని మంత్రగాడన్నారు తప్పితే మానవాతీతుడనలేదు!

ఆ భ్రమతో అతడు క్షుద్ర గ్రంథాలు కొన్ని తిరగేసి ఓ క్షుద్ర పద్ధతిని ఎన్నుకుని తను మహా శక్తిమంతుడు కావాలనుకున్నాడు. ఆ కోరిక తీరకుండానే చచ్చి పోయాడు. మనిషి మెదడును అదుపుచేస్తే, ఏకాగ్రతతో సాధిస్తే ఏమైనా సాధించవచ్చు. హత్యలు, నరబలులు, క్షుద్రదేవతారాధనలు — మనిషి నేరాలు చేయడానికి తప్ప మరేవిధంగానూ సహకరించవు....

మరి ప్రతాప్!

రామకృష్ణ ప్రతాప్ గురించి మాట్లాడుతూంటే సీతాపతి దంపతుల కళ్ళు నీళ్ళతో మసకలు కమ్మాయి.

"ప్రతాప్ ది సున్నితమైన మన సత్వం. అయితే అతడిలో ఓ పెద్దలోపం వుంది. అతడు స్త్రీని దారుణంగా హింసించి మాత్రమే అనుభవించగలడు. అతడికి స్త్రీ వాంఛ కూడా ఎక్కువ. ఆ వాంఛతో అతను ఒక పర్యాయం వేశ్య దగ్గరకు వెళ్ళి తన లోపాన్ని గ్రహిచాడు. అయితే అతడిలో మరో లోపం వుంది. అతడు అందానికి అన్యాయం చేయలేడు. అందమైన ఆడవాళ్ళను హింసించ లేడు. అందమైన ఆడదాన్ని చూడగానే అతడిలో స్త్రీ వాంఛ కలిగితే అతడది తీర్చుకునేందుకు అందవికారంగా వుండే స్త్రీలను ఎన్నుకునేవాడు. అందమైన స్త్రీని కలవాలంటే పూవును నలిపి పారేసిన అనుభూతి

స్ఫురించేది అతడికి. అందుకని అందంగాలేని స్త్రీలతో పరిచయం పెంచుకున్నాడు. అయితే హింసించాలన్న కోరికను అదుపుచేసుకోవడం కష్టమయ్యేది.

అప్పుడు తనకి బాబాతో పరిచయమైంది. బాబా బేతాళ పూజ పేరు చెప్పాడు. ఏ స్త్రీని అతడు కలుసుకున్నా నాలుగింట ఒక్కసారయినా బేతాళ పూజ తప్పనిసరి. అతడి అదృష్టం కొద్దీ — అందుకనుమతించే స్త్రీలూ దొరికారతడికి.

ప్రతాప్ మనసు నిజంగానే విచిత్రమైనది. అతడి దృష్టిలో స్త్రీలంతా ఒక్కటికాదు. అందం, కురూపితనం.... అంటూ స్త్రీలకు రెండు కులాలు ఏర్పరిచాడు. మనుషుల్లో పూర్వం అంటరానివారినీ, బానిసలనూ— ఇతర మనుషులే హింసించినట్లు అతను అందానికి దూరంగా ఉంటూ, కురూపితనాన్ని హింసిస్తూ వచ్చాడు. స్త్రీలను, పూలను అతడు ఒకేవిధంగా ప్రేమించేవాడు. మల్లెపూలు వాడినవైనా—ఎవరైనా నలిపితే చూసి సహించలేక పోయేవాడు. అదే మందారమైతే తన చేతులతోనే నలిపి—తలకు నూనె రాచుకొంగలిగేవాడు.

సృష్టిలో మనుషుల మధ్య నలుపు తెలుపులనీ, కులాలనీ, మతాలనీ భేదాలు సృష్టించిన మహానుభావుల ప్రభావానికొక విలక్షణ రూపం ప్రతాప్.

తను జాహ్నవిని హింసించానని గ్రహించినపుడు అతను షాక్ తిన్నాడు. తెల్లగా ఉన్న జాహ్నవిని తను ఆరాధించాడు. నల్లగా వుంటే హింసించాడు. ఇంతేనా ఈ తెలుపు నలుపుల తేడా? ఒక్కసారిగా అతడి మస్తిష్కం మేల్కొంది. అతడిలో సంచలనం కలిగింది. తన కిరాతకం

స్ఫురించింది. అతనా షాక్‌ను తట్టుకోలేక వెంటనే మర ణించాడు.

మల్లెలు పువ్వులైతే మందారాలూ పువ్వులే! కలవా రింట కలకల నవ్వేది మగువలే అయితే—పొలాలందు నడుం బిగించి చకచకలాడించేది మగువలే! సమదృష్టి.... సమదృష్టి మనిషికి కావాలి...." రామకృష్ణ చెప్పటం ఆపాడు.

తలుపులు తెరుచుకున్నాయి.

డాక్టరు బయటకు వచ్చాడు.

ఆయనేం చెబుతాడన్నదే రామకృష్ణకు ఇప్పుడు కావలసింది!

జాహ్నవి బ్రతుకుతుందా? బ్రతికితే రామకృష్ణను అంగీకరిస్తుందా?

రామకృష్ణ కనులముందు ఒకే ఒక్క దృశ్యం మెసు లోంది.

జాహ్నవి ప్రతాప్‌ని విడిపించుకుని తనవద్దకు పరు గెత్తుకు వస్తోంది. తనేస్థితిలో ఉన్నానని ఆమె ఆలో చించటంలేదు. ఆమె అప్పుడు ప్రతాప్ అసలు స్వరూపం చూసింది. తననే సర్వస్వంగా నమ్మింది.

"రామకృష్ణా! సర్వశక్తులూ క్రోడీకరించుకుని నీ దగ్గరకు వచ్చాను. ఈ రాక్షసుడు నా ప్రాణాలు తీసేస్తాడు...."

"నేను జాహ్నవిని...."

"నేను నిజంగా జాహ్నవిని...."

రామకృష్ణ జాహ్నవిని గట్టిగా పొదివి పట్టుకున్నాడు. అప్పటి ఆ అనుభూతి అతనికిప్పుడు తెలుస్తోంది. తనువు పులకరిస్తోంది.

ఒక బేతాళ విగ్రహం, తల పగిలిన బాబా, చలన రహితుడైన ప్రతాప్, మూతబడిన పదిగోతులు.... ఓ పెద్ద విషాద గాథ....

ఇంతకూ మధ్య తనకు కలిగిన అనుభూతిలోని తియ్యదనాన్ని వెతుక్కుంటున్నాడు రామకృష్ణ.

ఆ అనుభూతి తాత్కాలికమా, శాశ్వతమా?

ఏది ఏమైనా ఇది పూర్తిగా రామకృష్ణకు సంబంధించిన విషయం.

ఆ అనుభూతిని శాశ్వతం చేసుకోవాలనుకుని మానవాతీత ప్రయత్నాలు చేసిన ప్రతాప్ ఇప్పుడు లేడు.

—:సమాప్తం:—

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 5 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును. •



# క్రైమ్‌లో తమాషాలు

## శెలవు?

ఆఫీసర్‌గారికి ఎదురుగా చేతులు కట్టుకొని నిలబడ్డాడు సుబ్బారావ్.

"సార్!"

"ఏం కావాలయ్యా?"

"రేపు నాకు శెలవు కావాలి సార్."

"ఎందుకు?"

"నా భార్యను పుట్టింటికి తీసికెళ్ళాలి సార్."

"నా భార్యను తీసికెళ్ళాలయ్యా, కాని నేను వెళుతున్నానా. ఒక్కర్తిని పంపించు. మరేం ఫర్వాలేదు వెళ్ళు, వెళ్ళు. మనది అసలే ప్రవేట్ ఫర్మ్, సెలవు పుట్టటానికి ఇదేం గవర్నమెంట్ ఆఫీసు కాదు."

మరి మాట్లాడలేక తల దించుకొని బయటికి వచ్చేశాడు సుబ్బారావ్.

సుబ్బారావ్ తర్వాత అప్పారావ్ లోనికెళ్ళాడు.

"సార్! నా భార్యకు జ్వరం సార్. శెలవు కావాలి."

"నా భార్యకు జ్వరమే. నేను శెలవు పెట్టానా. మీకు ఇదొక అలవాటై పోయింది. వెళ్ళు, వెళ్ళు నన్ను విసిగించకు."

బయటికి వచ్చిన అప్పారావ్‌కి ఆఫీసర్ మీద పీకలదాకా కోపం వచ్చింది.

దాంతో మరునాడు మాస్టర్ ప్లాన్ ఆలోచించి ఆఫీసర్ దగ్గర ఎటెండ్ అయ్యాడు.

"సార్!"

"ఏం శెలవు కావాలా? ఇవ్వను."

"అది కాదు సార్! నా భార్య ఎవడితోనో లేచి పోయింది. దాన్ని వెదకాలి సార్" అన్నాడు అప్పారావ్ దీనంగా.

"నా భార్య కూడా ఎవడితోనో లేచిపోయింది...." అని నాలుక కొరుక్కొన్నాడు.

"నీకు శెలవిచ్చాను. వెళ్ళు వెళ్ళు" అన్నాడు విసుగ్గా. విజయ గర్వంతో హుందాగా బయటకు నడిచాడు అప్పారావ్. —పి. దుర్గాప్రసాద్, కావలి.

## దొంగ....!!!?

రత్తయ్య బందిపోటు దొంగ.

ఇన్‌స్పెక్టరు రవి, రత్తయ్యను వెంటాడుతూ ఇద్దరూ బ్లాష్టింగు జరుగుతున్న ఒక కొండ ప్రాంతం చేరుకున్నారు. అక్కడనుండి రాయి లారీల్లో దూర ప్రాంతాలకు వెళ్తుం టుంది. అక్కడ ఎప్పుడూ బ్లాష్టింగ్ జరుగుతూ వుంటుంది.

పెద్ద ప్రేలుడు శబ్దం!

ఆ వెంటనే కొండ రాళ్ళు ఎగిరి చెల్లా చెదురయ్యాయి.

పెద్ద పెద్ద రాళ్ళు దొర్లి పై నుండి క్రిందకు దొర్లుకుంటూ అక్కడనుండి పల్లంలోకి పడసాగాయి.

రత్తయ్య—రవి యిద్దరూ రాళ్ళ వర్షానికి తీవ్రంగా గాయపడసాగారు.

ఇదంతా దూరం నుండి చూస్తున్న బ్లాష్టింగ్ సూపర్ వైజర్ తమ సిబ్బంది సహాయంతో వారిద్దరిని తమ వ్యానులో హాస్పిటల్‌లో చేర్పించారు. అక్కడి ఎమర్జెన్సీ డాక్టరు యిద్దరి మెదడుకు బాగా దెబ్బ తగిలిందని వెంటనే

యిద్దరికీ ఒకేసారి ఆపరేషను చేసాడు.

ఈ వార్త క్షణాలమీద అందరికీ తెలిపింది. పోలీసు వారు వచ్చారు. మంచి—చెడ్డా విచారించారు. ఇద్దరికీ నయమయ్యేవరకు ప్రతిరోజూ ఒక పోలీసు కాపలాగా ఏర్పాటు చేసారు.

రత్తయ్యను, రవిని డిస్చార్జి చేసే రోజు వచ్చింది. పోలీసువారు వ్యానుతో వచ్చారు—ఇద్దర్ని తీసుకెళ్ళడానికి.

అయితే ఎవరూ అనుకోని సంఘటన జరిగింది!

అప్పుడే స్పృహలోకి వచ్చిన రవి, ప్రక్క బెడ్ మీదున్న రత్తయ్యను చూచి ఒకటే పరుగు లంఘించుకున్నాడు. ఇన్‌స్పెక్టరు రవి పరుగెత్తడం చూచిన రత్తయ్య "అతడే దొంగ! పట్టుకోండి! పారిపోతున్నాడు" అంటూ తనూ బెడ్‌మీద నుండి ఒక్క గెంతువేసి రవి వెనకాల పరుగెత్తడం మొదలు పెట్టాడు.

అందరికి నవ్వాలో—ఏడ్వాలో అర్థంగాని పరిస్థితి ఏర్పడింది. కాని....

వారికి ఆపరేషను చేసిన డాక్టరు మాత్రం ఈ విధంగా అనుకున్నాడు. "మెదడులు తారుమారు కాలేదు గదా!?!"

—మూసాజీ, కాకినాడ.

## అల్లరి కుర్రాళ్ళు

ఇద్దరు కుర్రాళ్ళు కాలేజీ అమ్మాయిల్ని అల్లరి పెడుతుండగా పట్టుకున్నారు కానిస్టేబుల్స్.

ఆ కుర్రాళ్ళిద్దర్నీ ఎస్సైఎముందు హాజరుపరచి అసలు విషయం వివరించారు.

"ఎందుకరా అమ్మాయిల్ని అల్లరి పెట్టారు?" హుందాగా అన్నాడు ఎస్సై.

"ఆ అమ్మాయిలు బాగున్నారు సార్!"

"బాగుంటే అల్లరి పెట్టాలా?"

"అల్లరికాదు సార్! వరించమంటున్నాం!"

"అంటే—ప్రేమించమని నిర్బంధించారా?"

"అర్థిస్తూ అడిగాం సార్."

"అడుక్కుంటే ప్రేమ పుడుతుందా?"

"మరి ఎలా సార్ ప్రేమించడం?"

"మీకు వయసొచ్చిందిగాని బుద్ధి పెరగలేదురా! ఏ అమ్మాయి అయినా తన వెంటపడే మగాణ్ని కోరుకోదు. తనవైపు కన్నెత్తైనా చూడని కుర్రాడ్ని కావాలనుకుంటుంది.

ఆమె మనసు నొప్పించకుండా తెలివిగా మీరంటే పడి చచ్చే విధంగా నడచుకోవాలి. ఆమె తప్పా మిగతా అమ్మాయిలందరూ మీకు అక్కా చెల్లెల్లుగా భావించినట్టూ మీరు ఆమెకు కనపడాలి.

ఆమె పదే-పదే మీ వేపు కోర చూపులు చూస్తే మీరంటే ఇష్టపడుతోందనుకోవాలి. అప్పుడే మీ మనసు విప్పి ఆమెకు వినిపించాలి. పొండి. ఇకనుంచైనా బుద్ధిగా—తెలివిగా నడుచుకోండి" కోర మీసాలు మెలిపెడుతూ తన అనుభవసారిన్ని వారికి బోధించాడు ఎస్సై.

"సార్! సార్! వాళ్ళనెందుకు వదిలేసారు. వాళ్ళు అల్లరిపెట్టిన అమ్మాయిల్లో మీ అమ్మాయి రామలక్ష్మి కూడా వుంది సార్. సార్....!" కానిస్టేబుల్సు ఇద్దరూ చెప్పింది వినేసరికి, చిత్తరువులా కూర్చుండిపోయాడు ఎస్సై అప్పలరాజు.

—ఇందూ రమణ, సింహాచలం.

